

ఏరువాక

చిత్రకారుడు—శ్రీ పి. నాగేశ్వరరావు (కాకెంపూడి)

జూలై 30 విడుదల








రత్నశ్రీ ప్రొడక్షన్సు సమర్పించు

# భక్తవిజయం

దర్శకత్వం: ఆరూర్ . నిర్మాత: కె. సత్యన్నారాయణ

స్టూడియో మెజెస్టిక్

మాటలు, పాటలు: ఆరుద్ర . సంగీతం: కృష్ణమూర్తి, శ్రీరాములు

ఛాయ: కె. జానకిరాం. కూర్పు: ఎస్. కాసాని

PRASADS

డిస్ట్రిబ్యూటర్లు : ఆంధ్ర వెరైటీ రిలీజ్, సీడెడ్ : సంజీవి రిలీజ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 47

3-8-60
బుధవారం

శార్వరి శ్రావణ శుద్ధ ఏకాదశి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

ఎమ్. జి. ఎమ్. వారి 'బెన్-హర్'లో శిలువవేసిన క్రీస్తు



## గమనిక

సకాలంలో అందని కారణంచేత ఈ వారం న్యూఢిల్లీ లేఖ ప్రచురించలేక పోయాము.

—సంపాదకుడు.

## కావలెను

ప్రముఖ తెలుగుపత్రిక సంపాదక వర్గంలో పనిచేయడానికి అభ్యర్థులు కావాలి. విద్యావంతులు అయిన స్త్రీలు కూడా దరఖాస్తు పెట్టవచ్చు. దరఖాస్తులను ఆగస్టు 15, 1960, లోగా బాక్సు నంబరు W. 127 C/o ఆంధ్రసచిత్ర వారపత్రిక, మద్రాసు-1 కి పంపవలసి ఉన్నది.

# ఉత్తరాలు

## తెలుగువెలుగులు

ఈ వారం 27-7-60 సంచికలో శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగార్ని గురించి చూడగానే నాలో ఆనందం పరవళ్ళు త్రొక్కింది. వారినిగూర్చి ఉన్నదున్నట్లుగా వ్రాసినందుకు నా హృదయపూర్వక అభినందనలు. కాని ఆఖరుపేరాలో విమర్శ నాకేమాత్రము నచ్చలేదు.

పెద్ది రంగారావు
(విజయవాడ-1)

* * *

20-7-60 వ తేదీ సంచికలో ప్రకటించిన "తెలుగువెలుగులు" శీర్షికలో చదరంగం ప్రవీణుడు శ్రీ. జి. ఎస్. దీక్షిత్ గారి జీవిత చరిత్ర హృదయంగమంగాఉంది. సాహిత్యరంగాన్ని క్రీడారంగాన్ని రాజకీయరంగాన్ని అలంకరిస్తున్న తెలుగువీరులు చిరస్మరణీయులు. వారి నిలా పాఠకలోకానికి పరిచయం చేస్తున్న మీపత్రికారత్నానికి అభినందనలు. చిరకాలంపత్రిక మనుగడ సాగాలి. అలా వెంకటేశ్వరుడు చేయాలని ప్రార్థిస్తాం.

పి. నరసింహమూర్తి, టి. రామకోటేశ్వర రావు (తిరుపతి)

* * *

20-7-60 వారపత్రికలో ఛెస్ చాంపియన్ జి. ఎస్. దీక్షిత్‌గార్ని గురించి వ్రాసిన విమర్శ చాలబాగుంది. శ్రీ దీక్షిత్ తండ్రినిమించిన కొడుకు అనటంలో సందేహంలేదు. అభిమన్యునితో పోల్చటం చాల ఉచితమనితోస్తుంది. 'శారీరక రుగ్మత త్రోసిరాజన్నా శ్రీ దీక్షిత్ ఆటకట్టలేదు'! కట్టరు కూడా. మన తెలుగునాడుకే కాకుండా యావత్ భారతదేశానికి చదరంగ రంగంలో శ్రీ దీక్షిత్ ఒక వెలుగు. వ్యాసకర్తకు, శ్రీ దీక్షిత్ కు నా అభినందనలు.

వి. వి. రాజు (కపిలేశ్వరపురం)

* * *

## కవితాకింకిణి

'కవితా కింకిణి' కేవలం యువక రచయితలను ప్రోత్సహించటానికని చెప్పి, మొదటి రెండు గేయాలు చాలా అనుభవమున్న రచయితలవని తెలిసిఉండికూడా బహుమానము ఇవ్వడం ఏమంత బాగాలేదు–అని, నేనంటే మీ రేమంటారు ?

వి. రాంబాబు (హైదరాబాదు)

* వృద్ధుల అనుభవం పుణికిపుచ్చుకొని ఉన్న యువకులు!

* * *

వారపత్రికలో 'కవితా కింకిణి' అనే శీర్షిక ఏర్పరచి ఉత్సాహవంతులైన రచయి

హైదరాబాదు కార్పొరేషన్
ఎన్నికలలో సాధించిన విజయం
జీర్ణంకాక బాధ పడుతున్న ఇత్తెహాద్
ఉల్ ముస్లిమీన్ —

ఇత్తెహాద్ సభ్యులలో
ముసలం పుట్టినదట!

కొన్ని రష్యన్ చిత్రాలు
విసుగు పుట్టించేవని
కృశ్చేవ్ అభిప్రాయం






# ★ ఉత్తరాలు ★

తలను ప్రోత్సహిస్తూ పాఠకులతో సహకరిస్తూ మీరు చేస్తున్న కృషి మెచ్చతగ్గది.

యీదుపల్లి వెంకటేశ్వరరావు (విలూరు)

## ఈసరళ ఏసరళ?

సరళ సలహాలు చాలా బాగుంటున్నాయి. వీటిని వ్రాస్తున్నది శ్రీ ముళ్ళపూడి వెంకట రమణగారని మాకు (లోపాయికారీగా) తెలిసింది. అది ఎంతవరకు నిజమండీ?

వంగూరి మాణిక్యాంబ (కాకినాడ)

* ఈసరళ ముళ్ళపూడివారి రమణ కాదు. సరళగారి సరళమే.

## చిత్తరువు

ఈ వారం (20-7-60) పత్రిక అమోఘముగా ఉన్నదనుటలో సందేహము లేదు. ఊమెన్ కార్టూనులు వేయుచున్నందులకు మీకు అభినందనలు. ఈవారం కథలు కూడ దేనికి దానికి తీసిపోకుండ ఉన్నాయి. 'చిత్తరువు' నిజంగా జరిగిన కథలాగా ఉన్నది. ఇది నిజమేమో తెలియజేయండి. రచయితకు ధన్యవాదాలు.

డి. జె. భాస్కర్ (గుంటూరు)

## దయ్యాల శీర్షిక

'దయ్యాలున్నాయనేది అబద్ధం ఏమాత్రమూ కాదు'. ఆ సంగతి శాస్త్రజ్ఞులు ఎన్నో పరిశోధనలుసాగించి నిరూపించారు. ఈ దయ్యాలవలన 20-7-60 వ తేదీ పత్రికలోని 'చిత్తరువు' కథలో లాంటి భయంకరమైన అనుభవం కాకపోయినా, రకరకాలైన అనుభవాలు పొందినవారున్నారు. పాఠకులను దయ్యాలవలన పొందిన అనుభవాలను వ్రాయమని అవి ఒక ప్రత్యేక శీర్షికగా ప్రచురించితే బాగుంటుందని నా సలహా.

కిరణ్ (కిర్లంపూడి)

* * *

'వెరిగుడ్ !' ఈ (20-7-60) సంచిక ముఖచిత్రం చాలా బాగుంది. ఇది పత్రికకే ఒక హైలైట్ అని చెప్పవచ్చు. ఈ వారం నుండి ప్రారంభించిన వ్యంగ్య చిత్రాలు చాల బాగున్నవి. ఈ చిత్రాలు చిత్రించిన శ్రీ ఊమెన్‌గారికి నా ధన్యవాదాలు అందచేస్తున్నాను.

సి. యువరాజ్ సింగ్ (పాకాల)

* * *

ఈ వారం (20-7-1960) చెప్పుకోదగ్గ ప్రత్యేకత 'శ్రీ ఊమెన్' గారి కార్టూనులు. ఈ శీర్షిక ప్రవేశ పెట్టినందుకు చాల సంతోషము.

ఎన్. సి. రామచంద్రారెడ్డి (మద్రాసు)

* * *

## కథలు

మీ వారపత్రికలో కథలు ఏమంత బాగుండడము లేదు. ప్రసిద్ధ రచయితలు వ్రాయడము లేదా ?

కుమారి పి. పద్మ (నంద్యాల)

* * *

మీరు పేరునుబట్టి ప్రాంతీయాభిమానాన్నిబట్టి ప్రచురిస్తుంటారని మా మిత్రుడొకడంటాడు. కాదలా జరగదని నేనన్నాను. "నేను ప్రతిసారిచూస్తున్నాను - క్రొత్త రచయితల కేమైనా స్థానం ఇచ్చారేమోనని - కాని అలాంటి దేం కనిపించలా" అంటాడు మా స్నేహితుడు. మన రాయలసీమ రచయితల కసలే స్థానం లేదంటున్నాడు వాడు. దీనికి జవాబు ఇక మీరే యివ్వాలి.

బి. మోహన్‌సింగ్ (ద్రోణాచలం)

* సమాధానం సహృదయులు అయిన పాఠకులే ఇవ్వగలరు.

* * *

ఆంధ్ర సచిత్రవారపత్రిక వస్తుందని ఆత్రుతతో ఎదురుచూచే పాఠకులకు మీ పత్రిక కథలు నీరసములోనికి దించేస్తున్నాయి. "కథ కాని కథ" ప్రతివారము ప్రచురించినట్లయితే బాగుగా ఉండునని తలంచుచున్నాను.

బి. సత్యనారాయణ (ఖమ్మంమెట్టు)

* * *

## "భవదీయుడు - బంతిపూలు"

20-7-60 తేది పత్రికలో ఈ కథ పేరుకు తగ్గట్టు అతివాస్తవంగా ఉంది. రచయిత శ్రీరామచంద్రమూర్తిగారు పాఠకులను ఆనంద తరంగాలలో విహరింపజేశారు. భవదీయుడు "చలపతి"చేత తనఆత్మకథను సవివరంగా చెప్పించడంలో రచయితగారు కనుపర్చిన భావాలు ప్రశంసాత్మకమైనవి.

బంతిపూలకై సావిత్రి రావడం - స్నేహం విడలేని ప్రేమగా రూపొందడం - పెద్దల వైమనస్యాలకై అవ్యాజమైన ప్రేమ రూపుమాయడం - ఈ మొదలైన ఘట్టాలు రచయిత



# తెలుగు వెలుగులు 45

దుర్గాబాయమ్మగారంటే ఒకవ్యక్తి కాదు; ఒక వ్యవస్థ. అనిబిసెంటమ్మను పోలిన వ్యక్తి. దివ్యజ్ఞానసమాజానికి అనిబిసెంటమ్మ మూలవిరాట్టయినట్లు ఆంధ్ర మహిళాసభకు దుర్గాబాయమ్మగారు మూలవిరాట్టు. సంస్థా నిర్మాణ నిర్వహణ శక్తులకు అనిబిసెంటమ్మ జగత్ప్రసిద్ధిని సంపాదించింది. జగత్ప్రసిద్ధి కాకపోయినా, దేశవిఖ్యాతి సంపాదించింది దుర్గాబాయమ్మగారు.

కనకదుర్గమ్మవలె ఈ కాకినాడ దుర్గమ్మ శక్తిమయి. అయితే ఆమెశక్తి దారీ తెన్నూ లేక పొంగి పొరలి ప్రవహించే శక్తి కాదు; వ్యూహావిధానంలో నడిచే శక్తి; సంకల్పసిద్ధిని పొందేశక్తి.

మొట్టమొదటగా దేశం దుర్గాబాయమ్మగారిని గురించి విన్నది ఉప్పుసత్యాగ్రహసమరంలో. ఏదో పనిమీదవచ్చి, అప్పటికి ఆమె మద్రాసులో ఉంటడం తటస్థించింది; సత్యాగ్రహం రాబోతున్నదనీ, అందులో పాల్గొందామనీ రాలేదు. కాని, సెలయేరు పొంగినట్లు ఎదలో దేశభక్తి పొంగి ఆమెను సత్యాగ్రహ రంగంలోకి తరుముకొని పోయినది. నాగేశ్వరరావు, ప్రకాశం పంతులుగార్ల తర్వాత ఉద్యమ నాయకత్వం వహించింది. అప్పుడు కనుక ఆమె లేకపోతే, మద్రాసునగరంలో ఉద్యమం సన్నగిలిపోయేది. ఎవరీ దుర్గాబాయి - అన్న ప్రశ్నతో మద్రాసునగరం మారుమ్రోగింది.

అప్పటి కామెకు పట్టుమని ఇరవయిఏళ్లు కూడాలేవు. అందుకనే ఆవిడను "జోన్ ఆఫ్ ఆర్క్" వంటి వీరవనిత అని ప్రస్తుతించారు. మనిషీ, మాటాకూడా బెర్నార్డ్ షా వర్ణించిన జోన్‌రూపాన్నే స్ఫురింపజేసేది.

పిల్లప్రాయమందే ఆమెలో ఒకశక్తి తల ఎత్తి వేధించుకు తినేది. పెద్దలకు అందని, పెద్దలు తలపెట్టని పనులకు పూనుకొనేది. కాకపోతే పదిఏళ్లు వచ్చేటప్పటికే, హిందీ భాషలో మంచిపాండిత్యం సంపాదించడమే కాక, అమ్మలకీ, అమ్మమ్మలకీ బడిపెట్టి పాఠాలు చెప్పడమేమిటి?

వాస్తవానికి ఆంధ్రలో మొదటి హిందీ పాఠశాల పెట్టిన పేరూ ప్రతిష్ఠా ఆమెవనే చెప్పాలి. జమ్నాలాల్ బజాజ్ ఆ పాఠశాలను చూచి "దాన్ని నడిపే దెవరు?" అని ప్రశ్నించారట. "ఇదిగో ఈ అమ్మాయి!" అని పరికిణీ చొక్కాలో ఉన్న దుర్గాంబని చూపించారట.

ప్రథమ సత్యాగ్రహం నాటికి దుర్గాబాయమ్మగారికి దాదాపు ఇంగ్లీషు రాదంటే ఆశ్చర్యపడవచ్చు. ఉప్పుసత్యాగ్రహంలో రెండుపర్యాయాలు జైలుకు వెళ్ళింది. మూడు నెలలు మధుర జైలులో ఒంటరిగదిలో వేశారు. నడిఎండలో నిలబెట్టారు. మురవ కాయలు దంపించారు.

విడుదలయ్యేనాటికి ఆరోగ్యం పూర్తిగా చితికిపోయింది. అయినా ఆమె తనమనోనిశ్చయంవల్ల అనారోగ్యాన్ని జయించి విద్యాభ్యాసం ఆరంభించింది. మహర్షి సాంబమూర్తి పితృవాత్సల్యంతో ప్రోత్సాహమిచ్చారు. మెట్రిక్యులేషన్‌నుండి ఎం. ఏ., బి. యల్. వరకు పరీక్షలన్నీ ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణురాలయింది. రాజ్యాంగ నిర్మాణసభ సభ్యురాలైంది. అప్పటికే ఒక వ్యక్తిగానే కాక ఒక వ్యవస్థగా పల్లవించడం ఆరంభమైంది.

ఆమె ఆ రోజులలో స్థాపించిన ఆంధ్ర మహిళాసభ వివిధశాఖలతో వ్యాపించి మహావటవృక్షంలా వర్ధిల్లుతున్నది. ఆ సంస్థ ఆమె కార్యదీక్షకు, నిర్మాణశక్తికి గీటురాయి చిహ్నం. మద్రాసు మాదని ఆవేశంతో వీరాంగం వేసిననాయకు లెవరూ మద్రాసులో ఆంధ్రసంస్థను స్థాపించలేకపోయారు; స్థాపించిన ఘనత దుర్గాబాయమ్మగారికి దక్కింది.

1952 లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో ఆమె ఓడిపోక పోయివుంటే, చాలా మందికిమల్లె మహా అయితే ఒకమంత్రి అయ్యేది, అంతే. ఓడిపోవటం ఆమె కేలాఉన్నా దేశానికి మంచిదయినది. గెలిచివుంటే సంఘ సంక్షేమ వ్యవస్థకు (సోషల్ వెల్‌ఫేర్ బోర్డుకు) అధ్యక్షురాలుగా సేతుశీతనగ పర్యంతం జనానీకానికి సేవచేయ గలిగేది కాదు. ఆ వ్యవస్థ భారతదేశమంతా పరివ్యాప్తమైంది; ఒక చిన్న సామ్రాజ్యం. ఆమె దానికి మహారాజ్ఞి. "స్త్రీప్రియాయై నమః."

ఆమె ఇంత ఉన్నతస్థానం ఆక్రమిస్తున్నా, చింతామణి దేశ్‌ముఖ్ ఇల్లాలై దుర్గాబాయి దేశ్‌ముఖ్ అయినా, ఆంధ్రులకు దుర్గాబాయమ్మగారే. 

కమనీయంగా సృష్టించారు. ఇలాంటి చక్కని ఉత్సాహాన్ని కల్గించే కమనీయమైన కథలు అందజేస్తూన్న నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎప్పటికీ ఇలాగే ఉండా లని ఆశిస్తున్నాను.

చింతల సంజీవరావు (జమ్మలమడుగు)

* * *

# ఉత్తరాలు

## హరివంశము

హారీత శివశర్మగారి 'హరివంశము' నన్ను ఆనంద జలపాతాలలో ముంచివేస్తోంది. ఆ 'స్వర్ణగాథ'పై నేను వ్రాసిన 'సీస'పద్యం ద్వారా నా సంతోషాన్ని వెలిబుచ్చుతున్నాను.

ఏ మానవుని దివ్యహాస మీ ధరణిలో
మధుర సంగీతమై సుధను కురియు
ఏ ముకుందుని చిన్మయానంద శోభ యీ
యిలను సౌందర్యమై వెలుగుచుండు
ఏ మురారి మృదుహృదయ స్వనమ్ములు
మన జీవనమ్ములై మణుకుచుండు
ఏ సురాధిపుడు రాధా సమేతుడగుచు
సలుపు రాసక్రీడ తలపు సుఖము
మనకు, ఏ మురవైరి చుంబనము మహిని
మహిత ప్రణయమై దీపించు, ఆ హరిని మ
నమ్మనగ్ దలచి అహర్నిశమ్ము వాని
లీలలన్ వినినన్ మేలు కలుగుగాక!

ఎగ్గన్న (చీరాల)

* * *

## కథ కాని కథ

కథకాని కథల్లో మొన్న వారం ప్రథమ బహుమతి పొందిన 'ఎవరికి వారే' అన్నది కూడా చాలా బాగుంది. చదివి నవ్వుకున్నాం చాలాసేపు. మొత్తానికి ఆంధ్రసచిత్రవారపత్రిక విజ్ఞానవికాసాలను కల్గిస్తూ అహ్లాదకరంగా ఉంటోంది.

కుమారి ఎ. వి. రత్నం (నిడదవోలు)

* * *

## బొమ్మల కథ

"పారిపోయిన శివం" బొమ్మలసీరియల్‌కు ఒక్క పేజీమాత్రమే కేటాయించారు. దానికి రెండు, మూడు పేజీలన్నా పాఠకులకు అందించాలని కోరుతున్నారు.

పి. పల్లయ్యలింగం (తణుకు)

* * *

పారిపోయిన శివం అనే బొమ్మలకథ చాలా బాగున్నది. ఈ కథకుతగ్గట్టు బొమ్మలు చాలా మంచిగా వేసినారు. బి. వి. సత్యమూర్తి గారికి నా హృదయపూర్వక అభినందనములు.

వి. రంగారావు (ఖమ్మంమెట్టు)

* * *

## కార్టూన్

మీరు 18-7-60 తేది పత్రికయందు ప్రచురించిన కార్టూన్ చాల బాగున్నవి. ముఖ్యముగ "రైలు ఫోటో" చిత్రము మమ్ము లను చాల ఆకర్షించింది. ఈ చిత్రము బహుమతి పొందుటకు అర్హమైనదిగా ఉన్నది. ప్రస్తుతము మీ పత్రిక చక్కని కథలతో రాణించుచున్నది. ఇన్ని విధములుగ మమ్ముల నుత్సాహపరచుచున్న మీ పత్రికకు మా యందరి శుభాకాంక్షలు.

బి. ఎస్. రమేష్ (బెంగుళూరు)

* * *

## ప్రభుత్వోద్యోగుల సమ్మె

ప్రభుత్వాన్ని బెదరిస్తూన్న కేంద్ర ఉద్యోగులను - గర్విస్తూ శ్రీ శ్రీకృష్ణగారు



రోమన్ చక్రవర్తి ఆజ్ఞానుసారం జూడాకు తిరిగి వచ్చిన వారిలో జోసెఫ్, మేరీ ఉన్నారు. గుర్రాలశాలలో తల దాచుకొన్నారు అక్కడే క్రీస్తు ఉద్భవించాడు.

# బెన్-హర్

క్రీస్తు ప్రభవించిన తరువాత ఒక్క వంవత్సరమైనా తిరగకుండానే......

జీవితసూత్రం, మతసారం, జీవాత్మకు పరమాత్మకు ఉన్న బంధం-అన్నీ ఒకటే. అదే ప్రేమ. ప్రేమానందాను భూతికి ఆచరణమే సాధనం. ఆ ఆచరణమూ ఒక్కటే. అదే మానవసేవ.

"పాపపంకిలమైనదీ జగత్తు. స్వార్థం, ద్వేషం క్రౌర్యం పెచ్చు పెరిగినవి. మానవత్వం నశించింది. అగతికులైన నీ యీ బిడ్డలను ఉద్ధరించడానికి ఎప్పుడు అవతారం ఎత్తుతావు, తండ్రీ? మానవకోటికి ఇక ముక్తి లేదా" అని ఆక్రోశించాడు ఒకడు.

సర్వమూ భగవంతునికి అర్పణచేసి, భగవంతునే ఆశ్రయించి, త్రికరణశుద్ధిగా కొలిచినవాడు భగవంతునిదయకు పాత్రుడు అవుతాడని విశ్వసించాడు మరొకడు.

పరిపూర్ణత్వం దైవం. సరళత్వమే పరిపూర్ణత. ఇది సత్యం. మానవులు సత్యాన్ని కనరు, వినరు, మార్కొనరు. కనుకనే మానవకోటిని ఉద్ధరించడానికి భగవంతుడు అవతరిస్తాడు - అని తెలుసుకొన్నాడు వేరొకడు.

ముగ్గురికీ సమాధానం దొరికినది. మానవాళి నోములు ఫలించినవి. ధర్మసంస్థాపన కొరకు భగవంతుడు మానవ జన్మ స్వీకరించాడు. జూడాలోని బెత్లెహామ్‌లో క్రీస్తు ఉద్భవించాడు.

## రోమన్ పాలన

జూడారాజు హెరాడ్ మృతిచెందాడు. నిక్కృష్టమైన మరణమది. కనుకనే భగవంతుని శాపానికి గురిఅయినాడని ముందుతరాల క్రైస్తవులు విశ్వసించారు.

హెరాడ్ కుమారులలో కడగొట్టువాడు ఆర్చిలాస్. తండ్రి శాసనానుసారం సింహాసనానికి వారసుడు. కాని రోమన్ చక్రవర్తి సీజర్ అతనిని పదవీభ్రష్టుని చేశాడు. జెరూసలెమ్ ప్రజల అభిమానాన్ని కాలరాశాడు. జూడాను రోమన్ సామ్రాజ్యంలో ఒక రాష్ట్రంగా చేసి సిరియా ప్రిఫెక్చర్‌లో చేర్చాడు. అధికారంఅంతా రోమన్ పాలకులు హస్తగతం చేసుకొన్నారు. జెరూసలెమ్‌లో రోమన్ సైనికులు స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ప్రజలు పారతంత్ర్యంలో మునిగినారు. రెండుదశాబ్దాల అనంతరం...

## పునస్సమాగమం

గడిచేసవి. మిట్ట మధ్యాహ్నం. జెరూసలెమ్‌నగరంలో ఉన్నతమైన పర్వతశిఖరం మీదఉన్న ఆంటోనియా కోటలో ఒక గదిలో రోమన్ లీజియన్ (సేన) లో అధికారిగాఉన్న ఒక యువకుడు ప్రవేశించాడు. అతడు మెస్సాలా.

రోమన్ చక్రవర్తి మొదటి సీజర్‌కు అతని శత్రువులకు సాగిన ఘోరమైన యుద్ధాలలో మెస్సాలా పూర్వికుడు ఒకడు బ్రూటస్‌కు అండగా నిలిచాడు. ఫిలిప్పి యుద్ధానంతరం చక్రవర్తితో రాజీపడ్డాడు. అనంతరం సామ్రాజ్యాధిపత్యంకోసం ఆక్టేవియన్ పోరాటం సాగించినప్పుడు అతనికి తోడ్పడ్డాడు మెస్సాలా. తరువాత అగస్టస్ చక్రవర్తిగా సామ్రాజ్యం పాలించిన ఆక్టేవియస్ మెస్సాలా కుటుంబాన్ని అనేకవిధాల మహోఘనంగా సన్మానించాడు. పన్నులువసూలుచేసే అధికారం అప్పగించి అతనికుమారుని జెరూసలెమ్‌కు పంపాడు చక్రవర్తి. ఆ అధికారి కుమారుడే నేడు అంటోనియా దుర్గంలో అడుగుపెట్టిన యువకుడు మెస్సాలా.

అతని వెన్నంటిలోనికి వచ్చాడు అదే హోదా కలిగిన మరొక సైన్యాధికారి, వయో



# బెన్-హర్

వృద్ధుడు, సెక్స్టస్, ఉభయులను అనుసరించి సహోద్యోగులు కొలువుకూటంలోనికి వచ్చారు.

తళతళ మెరుస్తూ ఉన్న శిరస్త్రాణం తీసివేశాడు మెస్సాలా. సేవకుడు ఒకడు వేగిర పడుతూ వచ్చి దానిని అందుకొన్నాడు.

"భగవంతుని దయవల్ల ఎట్టకేలకు ఈ కార్యక్రమం ముగిసింది. ఏమైనా నిన్ను అభినందించక తప్పదు, సెక్స్టస్.

"నీ సైనికులు బారులు తీర్చినప్పుడు నిజంగా చూడ ముచ్చటగా ఉంది. ఈ రాష్ట్రంలో వేడి అధికం. అయినా రోమన్ సేనల క్రమశిక్షణకు భంగమేమీ కలుగలేదు."

"మీ అధికారం క్రింద ఉన్న సైన్యాన్ని అప్పగించి నన్ను సన్మానించారు మీరు" అన్నాడు మెస్సాలా.

"భగవంతునిదయకు పాత్రుడవావు. అదృష్టమూ నిన్ను వరించింది. నీకు స్వాగతమిస్తున్నాను మెస్సాలా. చిరకాలానికి దైవసమానుడైన టైబీరియస్ చక్రవర్తి నన్ను స్వదేశానికి తిరిగి రావలసినదని ఆదేశించారు. అందుచేత ఆనందంతో చక్రవర్తి ఆదేశాన్ని శిరసావహిస్తున్నాను" అన్నాడు సెక్స్టస్.

సేవకుని చేతిలోనుంచి పానపాత్ర తీసుకొంటూ చిరునవ్వు నవ్వాడు సెక్స్టస్.

"దైవసముడైన చక్రవర్తి ఆజ్ఞలను శిరసావహించడం ఒక్కటిమాత్రమే రోమన్ సైనికులకు ఆనందదాయకమైన" దన్నాడు మెస్సాలా.

విధ్యుక్తధర్మ నిర్వహణ దీక్షాపరతంత్రుడు అయిన సైనికునికి అనుగుణమైన విధంగానే మాట్లాడాడు మెస్సాలా. అయినా ఆ సమయం అందుకు అనుగుణమైనది కాదు. విధ్యుక్తధర్మ నిర్వహణానంతరం ఇష్టాగోష్ఠి సాగిస్తూన్న కాలమది. కనుకనే మెస్సాలా మాటలు కటువుగా తోచినవి. సెక్స్టస్‌కు కొంత వినోదమూ చేకూర్చినవి.

"బాగు. ఏమైనా రోమ్‌కు తిరిగి వెళ్ళడం నాకు చాలా ఆనందదాయకమైన విషయం. జూడా దేశాన్ని, ప్రజలను ప్రేమించే వారికి ఈ దేశంలో ఉండడం బాగానే ఉంటుంది. నాకు అలాంటి ప్రేమ ఏమీలేదు.

"ఈ జూడా ప్రజలతో వేగడం చాలా కష్టం. వాళ్ళు ఒకరు చెప్పినట్లు వినేరకం కాదు. మనం బలవంతంగా చెప్పినట్లల్లా వినేటట్లు చేయడానికి ప్రయత్నిస్తున్నాము. దానిని వారు ప్రతిఘటిస్తున్నారు. వారి ధైర్యాన్ని కొనియాడక తప్పదు. కాని వారికి యుక్తాయుక్త విచక్షణ జ్ఞానంలేదు. లోకజ్ఞానం అసలేలేదు. అందుకే కోపంగా ఉంటుంది" అన్నాడు సెక్స్టస్.

అధికమైన చిరాకుతో పానపాత్రనుఆడిస్తూ ఇంకా ఆదేధోరణిలో మాట్లాడసాగాడు. "ఒక్కమాటలో చెప్పాలంటే జూడాప్రజలు ఆవేశపరులు, పిచ్చివాళ్ళు. భ్రమలో పడి కొట్టుకొంటున్న వారు. వాళ్ళకు ఎప్పుడూ దయ్యాలు భూతాలు కనుపిస్తూ ఉంటాయి! దైవం ఒకడే అంటారు—అందులోనూ అవాఙ్మానస గోచరుడైన వాడట!

"ఏవో కట్టుకథలు చెప్పుకొంటూ ఉంటారు! అన్నీ యథార్థమని నమ్ముతారు. చక్రవర్తిని దూషించడం ప్రారంభిస్తారు. స్మృతిలేకుండా పడిపోయేటంతవరకు కొరడాలతో కొట్టి హింసించినాసరే తమతప్పు అంగీకరించరు."

సహోద్యోగుల బృందంలో నవ్వు చెలరేగినది. "మానవమాత్రులకు గోచరించని తమదేవుని కుమారుడు ఈ లోకంలో ఉద్భవిస్తాడని వారు చెప్పుకొంటున్నారు. ఈ కట్టుకథ విన్నారా" అన్నాడు వారిలో ఒకడు. "ఆ దేవునికుమారుడు ఈ రాష్ట్రానికి వస్తాడట. అతడు ఒక కన్య కడుపున పుట్టుతాడట! ఇదంతా అప్పుడే జరిగిపోయిందని కూడా కొందరు అంటున్నారు."

అక్కడివారి నవ్వు సముద్ర ఘోషను అనుకరించినది. మిన్నుముట్టినది. అంతలో నూతన సేనాధిపతి మెస్సాలా ఆకస్మికంగా ఒక అడుగు ముందుకువేసి చేయి పైకెత్తి వారిని వారించాడు. అధికారపూర్వకంగా కఠోరంగాచేసినసంజ్ఞ అది. ఆగదిని నిశ్శబ్దం ఆవరించినది. సెక్స్టస్‌మాత్రం నిర్లక్ష్యంగా ఎవరికీకనుపించకుండా భుజాలుఎగురవేశాడు.

మెస్సాలా జన్మతః సైనికుడు. నాయకత్వమూ సహజంగానే అబ్బినది. జూడా ప్రజలు ఎంతటి ఆవేశంతో కట్టుకథలు నమ్ముతారో అంతటి ఆవేశంతోనూ చక్రవర్తిని కొలిచే అధికారి. ఏమైనా మెస్సాలా అంటే సెక్స్టస్‌కు ఇష్టంలేక పోయినది.

"స్నేహితులైన వారు కులాసాగా కాలం గడపడం మంచిదే. కాని కర్తవ్య నిర్వహణమే అన్నిటికన్నా ముఖ్యమైనది. దానికి



జూడాకు తిరిగి వచ్చిన రోమన్ సైన్యాధికారి మెస్సాలా తో బెన్-హర్

ఏదీ అడ్డురాదు. ఇప్పుడు నా అధికారం క్రింద ఉన్న సైన్యానికి సంబంధించిన విధులు నేను నిర్వర్తించవలసి ఉన్నది. ఇంక మనం విడిపోదాం. భగవంతుడు మీకు మేలు చేయుగాక" అన్నాడు మెస్సాలా.

ఉన్న పళంగా అందర్నీ పొమ్మని చెప్పాడు సేనాపతి. అయితే ఏం? రోమన్ సేనలకు పట్టుగొమ్మ అయినది అచంచలమైన క్రమశిక్షణ. దానికి తగినట్లుగానే ఈ యువ అధికారి మాట్లాడాడని సెక్స్టస్ తనలో తాను అయినా అంగీకరించక తప్పలేదు.

అందరూ అక్కడినుంచి వెళ్ళడానికి ఉద్యుక్తులైనారు. అంతలో మెస్సాలా మళ్ళీ మాట్లాడాడు. "మీరు చెప్పిన కథల్లో కొన్ని నేను విన్నవే. కొన్ని కొత్తగా ఇప్పుడే వింటున్నాను. అయితే నా మిత్రులు అయిన మీ కందరికీ ఒకసంగతి చెప్పక తప్పదు. ఈ జూడా ప్రజలు నాకు తెలిసిన వారే. వారిని నేను అర్థం చేసుకోగలను. వారితో వ్యవహరించడం ఎలాగో నాకు తెలుసు. నా తండ్రి ఈ రాష్ట్రానికి గవర్నరుగా ఉన్నారు. చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు వారితో కలిసిమెలిసి జీవించాను. ఎప్పటికి అయినా రోమన్ సైన్యంలో చేరాలని, ఇక్కడి సైన్యానికి అధిపతిగా ఉండాలని కోరుకొన్నాను. చిన్ననాటి నా కల నిజమైనది. ఈనాడు ఆపదవిలో ఉన్నాను" అన్నాడు మెస్సాలా.

సెక్స్టస్ ఆ యువ అధికారికి అభివాదాలు అందజేశాడు. జాగ్రత్తగా తన అధికార ధోరణికి తగిన పద్ధతిలో హుందా తప్పకుండా మాట్లాడుతూ అందరి వద్దా సెలవుతీసుకొన్నాడు.

ఆ రాష్ట్రం విడిచి వెళ్లుతూ ఉండడం అతనికి మహా ఆనందంగా ఉన్నది. సెక్స్టస్ కూడా పుట్టుకతో సైనికుడు. తన అధికారం క్రింద ఉన్న సైనికులను, తాను పాలించే రాష్ట్రంలోని ప్రజలను ఎలా అదుపాజ్ఞలలో పెట్టాలో అతనికి బాగానే తెలుసు.

గది విడిచిపోతూ సెక్స్టస్ తనలో తాను నవ్వుకొన్నాడు. తనతరువాతి తరానికి చెందినవాడు ఈయువ సైన్యాధికారి. జూడా ప్రజలు చంచలస్వభావులు. ఎప్పుడు ఏలా వ్యవహరిస్తారో ఎవరికి తెలియదు. అలాంటి వారిని మెస్సాలో ఎంతబాగా అర్థం చేసుకొన్నాడో! అసలు వారిని అణచి ఉంచగలడా అని సెక్స్టస్ ఆలోచించసాగాడు.

క్రుద్ధిగా కార్యం ప్రదర్శించినంత మాత్రాన జూడా ప్రజలను అణచడం సాధ్యం కాదని సెక్స్టస్ స్వకీయమైన అనుభవంవల్ల తెలుసుకొన్నాడు.

## బెన్-హర్ ప్రవేశం

ఇప్పుడు ఒంటిగా ఉన్నాడు



బెన్‌హర్ పాత్రధారి ఛార్ల్టన్ హెస్టన్

మెస్సాలా అగతిలో. సేవకుడు ఒకడు వచ్చి ఆ దేశం ప్రభువులలో ఒకరు దర్శనం కోరుతూ బయట వేచి ఉన్నారని తెలియజేశాడు.

మెస్సాలో అతనివంక తీరగా చూశాడు. కొలదిగా నిటుగు జనించినది. భుజాలు ఎగరవేసి మాసంగానే ఆగంతకుని లోపల ప్రవేశపెట్టడానికి అనుమతించాడు. రోమన్ చక్రవర్తుల పాలనలో సామ్రాజ్యాధికారులకు, ఆ దేశంలోని ప్రభువులకు మైత్రి కొంతవరకు ఉన్నది.

కాని గుమ్మంలో అడుగుపెట్టి ప్రవేశించిన మూర్తి ఎవరది? వచ్చినవాడు అజానుబాహుడు, సుందర విగ్రహుడు, మెస్సాలో వయసువాడు. మనోమయాంబర ధారుడు.

ఆ మూర్తికంటపడేసరికి మెస్సాలాముఖం ఆనందంతో వికసించింది.

సేవకుడు గంభీరంగా "జూడా బెన్-హర్ రాకుమారుడు" అని ప్రకటించాడు.

# బెన్-హర్

మెస్సాలా చేతులు చాచుకొని బెన్-హర్‌కు ఎదురువెళ్ళాడు.

"జూడా, తిరిగి వస్తానని నీతో చెప్పాను. అలాగే తిరిగి వచ్చాను. చూడు!" అన్నాడు మెస్సాలా ఆనందంతో.

బెన్-హర్ కూడా ఆనందం ఆపుకోలేక పోయాడు. "నువ్వు తిరిగి వస్తావని నేను ఎప్పుడూ అనుకోలేదు. వచ్చినందుకు నాకు చాలా ఆనందంగా ఉన్నది. చాలా ఆనందం......".

మెస్సాలా అతని భుజాలమీద చేతులు పెట్టి దూరంగా నిలిచి అతనివంక చూచాడు. "నాకన్నా పొడుగయ్యావే! ఇది నాకు ఇష్టం లేదు. మనం ఇద్దరం చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు నేనే నీకన్నా పొడుగుగా ఉండేవాడిని" అన్నాడు.

బెన్-హర్ సవినయంగా తలవంచాడు. "అయితే ఏమి? కావాలంటే నాతల కొట్టివేసే అధికారమే నీకు ఉన్నది కదా, ట్రిబ్యూన్!" తన బాల్యస్నేహితునికి నేడు సైన్యంలో ఉన్న బిరుదంతో సంబోధిస్తూ అన్నాడు బెన్-హర్ గంభీరంగా.

మెస్సాలా నవ్వాడు. మిత్రుని తోడుకొనిపోయి 'కోచ్' మీద కూర్చోపెట్టాడు. మద్యం సేవిస్తూ చిన్నతనంలో ఆ రాష్ట్రం గవర్నరు కుమారుడుగా ఒకరు, దేశంలోకెల్లా భాగ్యవంతుడు అయిన ప్రభువు కుమారుడుగా ఒకరు గడిపిన రోజులగురించి తనివితీర మాట్లాడుకొన్నారు. పురాస్మృతుల తలపుల మాధుర్యం ఆస్వాదించారు.

అప్పుడు మెస్సాలా అన్నాడు. "నీతల్లి మిరియమ్ ఎలా ఉన్నది? నీ చెల్లెలు తిర్జా ఎలా ఉన్నది? చెప్పు. తిర్జాకు వివాహమైనదా?"

బెన్-హర్ ముఖంలో చిరునవ్వు మెలిక తిరిగినది. "లేదు. తిర్జాకు ఇంకా వివాహం కాలేదు. నువ్వు ఇక్కడికి వస్తున్నావని తెలిసినప్పటినుంచీ నా చెల్లెలు మరొక సంగతి తలపెట్టితే ఒట్టు. ఎంతసేపూ నిన్ను గురించే కబురు!

"నీకు తెలియదేమో కాని, మెస్సాలా, అయిదేళ్ళపిల్లగా ఉన్నప్పటినుంచి తిర్జా నిన్ను ప్రేమిస్తూ ఉంది..."

## సహాయానికి అభ్యర్థన

మెస్సాలా అడ్డువచ్చాడు. "తిర్జాను చూడాలని తహతహలాడుతున్నాను. ఇంకా ఒక యుగంలా ఉంది. ఆమెకు బహూకరించడానికి టిబెరియాస్‌నుంచి ఒక బ్రూచ్ తెచ్చాను. కాని ఇప్పుడు అన్నిటికన్న ముఖ్యంగా నా బాధ్యతల నిర్వహణం గురించే ఆలోచించవలసి ఉన్నది. నేను ఇక్కడికి వచ్చిన రోజునే నువ్వు వచ్చి కలుసుకొన్నందుకు భగవంతునికి కృతజ్ఞత తెల్పుకోవాలి సుమా. ఈ రాష్ట్రం పాలించడం చాలా కష్టం. నాకు నీ సహాయం అవసరం— ముఖ్యంగా నీ సలహా అవసరం."

బెన్-హర్ నవ్వాడు. "నా సహాయమూ, నా సలహా కావాలా? నేను యూదుడను. నీవో? రోమన్ చక్రవర్తి సైన్యంలో గొప్ప అధికారం కలిగిన ట్రిబ్యూన్".

"కాని నువ్వు ప్రభువుల కుటుంబానికి చెందినవాడివి. భాగ్యవంతుడివి. ఈ అలగా జనంలో నీకు చాలా పలుకుబడి ఉన్నది."

"అయినా నేను యూదుడనేకదా! ఈ అలగాజనమే నా ప్రజలు. నేను వారిలో ఒకడిని మెస్సాలా. నేను నీకు ఇవ్వగలిగిన సలహా ఒకటే—నీ రోమన్ సేనలను ఉపసంహరించు. మాకు స్వాతంత్ర్యం ప్రసాదించు."

[ఇంకా వుంది]

(ఎం. జి. ఎం. సౌజన్యంతో)



రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఇటీవల ఆంధ్రప్రదేశ్ రాజధానికి వచ్చినప్పుడు సికింద్రాబాద్ స్టేషన్‌లో సైనికవందనం స్వీకరించిన దృశ్యం.

న్యూఢిల్లీ లేఖ — శ్రీకృష్ణ

# ప్రత్తి కొరత ఏర్పడినా ఖాదీకి సబ్సిడీ తప్పదు

దేశంలో ప్రత్తి కొరత ఏర్పడింది. నూలు బట్టల ధరలు పెరిగినవి. అలాంటప్పుడు అయినా ప్రభుత్వం ఖాదీ సెస్సు రద్దుచేసి ఉండవలసినది. బట్టలకొరత ఏర్పడిన కాలంలో సహితం ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీతో నిమిత్తం లేకుండా ఖాదీ పరిశ్రమ నిలబడలేక పోతూ ఉందంటే నిజంగా ఆశ్చర్యంగా ఉన్నది. ఈ పరిస్థితికి ఎవరు బాధ్యులో తెలుసుకోనడమూ అవసరమే.

ముతక మధ్యరకాల నూలుబట్టల ధరలు క్రిందటి ఏడాదికన్నా నూటికి 40 వంతుల మేరకు పెరిగినవి. ప్రత్తి కొరత ఏర్పడినది. క్రిందటి ఏడాది ఉత్పత్తి అయిన బాపతు మిగిలిన సరకు చాలా స్వల్పం. వేరొకవంక ఖాదీ పరిశ్రమకు సబ్సిడీ ఇచ్చే విధానం అనుసరిస్తున్నది కనుకనే కాంగ్రెసు ప్రభుత్వం మిల్లు బట్టలమీద సెస్సు విధించినది. నూలు బట్టల కొరత ఏర్పడి, ధరలు పెరిగిన కాలంలో అయినా కనీసం ప్రభుత్వం ఆ సెస్సు రద్దుచేసి ఉంచవలసినది.

ప్రత్తి కొరత ఏర్పడిన సంగతి కేంద్ర ప్రభుత్వ కార్మికశాఖకు తెలియదా? ధరలు పెరుగుతూన్న కాలంలోనే వేతనసంఘం నిర్ణయాలు అమలులోనికి తేవడానికి పూనుకోనడంలో అంతరార్థం ఏమిటి? బట్టల ధరల మీదకూడా జీవన వ్యయం ఆధారపడి ఉన్నది కదా?

ప్రత్తి నిలువలు తరిగిపోయి కొరత ఏర్పడిన సంగతి ప్రభుత్వ వాణిజ్య పారిశ్రామిక శాఖకు అయినా తెలిసి ఉండవలసినది. అయితే మనదేశంలో రసాయనిక ఎరువుల పరిశ్రమ అభివృద్ధి పరచడానికి అమెరికా వారి సహాయ సహకారాలు సంపాదించే నిమిత్తం ఆ దేశానికి హుటాహుటి వెళ్ళిన వాణిజ్యశాఖ ఉపమంత్రి శ్రీ సతీష్‌చంద్ర ఈ ప్రత్తి కొరతనుగురించికూడా అమెరికా ప్రభుత్వంతో ఏమైనా చర్చలు జరిపారా? అయితే ఆ చర్చల పర్యవసానం ఏమిటి?

శ్రీ సతీష్‌చంద్ర అమెరికా వెళ్ళడానికి ముందుగానే ఆ దేశంనుంచి పబ్లిక్‌లా 480 క్రింద నాలుగులక్షల బేళ్ళ ప్రత్తి దిగుమతి చేయడానికి భారతప్రభుత్వం రాయబారాలు నెరపుతున్న సంగతి అందరికీ విదితమే.

నూలుబట్టలమీద ధరలు ముద్రించాలనే ప్రతిపాదన ఒకటి ఉన్నది. గతంలో ఈలాంటి పద్ధతి అవలంబించినప్పుడు నిజాయితీ ఎరుగని కొందరు వ్యాపారస్తులు దానిని ఆధారంచేసుకొని ఆదాయం పన్ను ఎగగొట్టారు. ఈ సమస్య పరిష్కారానికి అది మార్గమూ కాదు. ప్రత్తి ఇతోధికంగా ఉత్పత్తి చేయడమే దానికిమందు. పబ్లిక్ లా

న్నారు. ఉండివుండి, దీపపు వెలుగు శేషగిరి మీద పడుతూవుంటే శేషగిరి మొహం కప్పుకుంటూ పక్కకు తప్పుకుంటున్నాడు. "ఎక్కడికి?" అన్నాడు జట్కావాడు. శేషగిరి ఏదో వీధిపేరు చెప్పి దారి చూపించసాగాడు. ఆ వీధి శేషగిరి వీధికాదు—దాని వెనకవీధి. ఆ వీధిలోనికి గనక పోతే, దొడ్డి

# దిదృక్ష

గుమ్మానన తన ఇంట్లో ప్రవేశించ వచ్చును. ఆ వీధి సమీపిస్తున్న కొద్దీ శేషగిరికి కాళ్లూ చేతులూ వణక సాగినయ్. తన వీధి దాటి అవతలి

వీధి చేరుకునేలోగా శేషగిరి తను ఎరిగున్న మనిషిని చూశాడు. వొట్టి చూడడం కాదు—పరీక్షగా చూశాడు—ఆ మనిషి ముఖంలో 'విషాదచ్ఛాయలు' ఉన్నాయేమోనని. ఉన్నట్టే కనిపించింది శేషగిరికి. తను చెప్పిన

(60-వ పేజీచూడండి)

## మీ సౌందర్యానికి తగినది

# హిమాలయా బుకే టాయ్‌లెట్ పౌడర్



సాటిన్-వంటి మెత్తని హిమాలయా బుకే టాయ్‌లెట్ పౌడర్ మిమ్ములను సువాసనతో హాయిగా వుంచును; మీరు అతి సౌందర్యంగా నుండునట్లు చేయును.

సర్వదా హిమాలయా బుకే టాయ్‌లెట్ పౌడర్ వాడండి.

2 సైజులలో లభించుచున్నది.
మరియు అద్దుకొనే ప్యాడ్ సహితం
లేక ప్యాడ్ లేకుండా




లండన్‌లోని ఇరాస్మిక్ తరఫున హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ చేత భారతదేశంలో తయారు చేయబడినది.

HBP. 3-X52 TL



# బెన్-హార్

క్రీస్తుకాలంనాటి సాహసగాధ—మానవయత్నానికి దైవ సంకల్పానికి వైరుధ్యంఏర్పడిన మహత్తర సంఘటనకు దారితీసిన గాధ—నేడు ప్రపంచ ప్రజల మన్ననలకు పాత్రమైన చిత్రంగా రూపొందిన గాధ!

అమెరికా అంతర్యుద్ధంలో వాషింగ్టన్ నగరాన్ని తిరుగుబాటుదారులు వశపరచుకోనకుండా కాపాడిన ఘనత మేజర్-జనరల్ లూయీ వాలెస్‌దేనని చరిత్ర చాటుతున్నది.

అయితే ఆయనకు చిరంతనమైన యశస్సు చేకూర్చినది వేరొకటి ఉన్నది. అదే 'బెన్-హార్'

ఏసుక్రీస్తు మానవ జన్మ ఎత్తిన పుణ్యకాలంలో క్రీస్తు స్పర్శతోపు నీతమైన పుణ్యావనిలో సాగినట్లుగా చిత్రించిన సాహసగాథ 'బెన్-హార్.'

'బెన్-హార్' నవల 1880 లో ప్రచురితమైనది. అమెరికాలో ఈ నవల ప్రతులు 20 లక్షల వరకు విక్రయమైనవి. ఒక్క బైబిల్ మినహా ఇన్ని ప్రతులు విక్రయమైన గ్రంథం వేరొకటి లేదు. ఈ విధంగా పుస్తకరూపంగా ప్రచురితమైన నాటి నుంచి చరిత్ర సృష్టించుకొంటున్నది 'బెన్-హార్.'

ప్రచురితమైన తొమ్మిది సంవత్సరాలకు "బెన్-హార్" నాటకంగా ప్రదర్శించడం ప్రారంభమైనది. ఈ నాటక ప్రదర్శనం 21 సంవత్సరాల పాటు సాగినది. యూరోపు దేశాలరాజధాని నగరాలలోను, లండన్‌లో డ్రూరీలేన్ థియేటర్‌లోనుదీనిని ప్రదర్శించారు.

1907 లో మొదటిసారిగా కాలెమ్ సంస్థ అనుమతి పొందకుండా 'బెన్-హార్' చలనచిత్రంనిర్మించినది. పుస్తకాలు, నాటకాలు రచించేవారి అనుమతి పొందకుండా వాటిని ఆధారం చేసుకొని చలనచిత్రం నిర్మించరాదని, ఆలాంటి హక్కు రచయితలకు ఉన్నదని న్యాయస్థానాలు నిర్ణయించినవి. కాలెంసంస్థ నిర్మించిన చిత్రాన్ని ప్రదర్శించరాదని ఉత్తర్వు చేసినవి.

ఆ తరువాత దాదాపు 20 సంవత్సరాలకు మెట్రో గోల్డ్విన్ సంస్థ 25 లక్షల డాలర్ల (దాదాపు 125 లక్షల రూపాయలు) ఖర్చుతో "బెన్-హార్" చిత్రం నిర్మించినది. దానిని స్ట్రాండ్‌లోని టివోలీ థియేటర్‌లో వరుసగా 48 వారాలు ప్రదర్శించారు.

"బెన్-హార్" తొలిచిత్రం చూరగొన్న మన్నన అట్టిది. అది నేటికీ తరగలేదు. కనుకనే ప్రపంచంలో తయారు అయిన గొప్పచిత్రాలలో ఒకటిగా దానిని ఈనాటికీ పేర్కొంటున్నారు.

ఎమ్. జి. ఎమ్. దానితో సంతృప్తి చెందలేదు. ఇతోధికమయిన వ్యయప్రయాసలకు ఓర్చి తిరిగి 'బెన్—హార్'కు వెండితెరమీద రూపం కల్పించారు. దీనిని త్వరలోనే మన దేశంలో ప్రదర్శించబోతున్నారు.

'బెన్—హార్' తొలిచిత్రం నిర్మించడానికి 25 లక్షల డాలర్లు ఖర్చుఅయితే అది ఆర్జించిన మొత్తం 60 లక్షల డాలర్లు.

'బెన్-హార్' మలి చిత్రం నిర్మించడానికి అయిన ఖర్చు 150 లక్షల డాలర్లు (దాదాపు 7½ కోట్ల రూపాయలు).

1958 మే నెల మొదట్లో ప్రారంభమైనది ఈచిత్ర నిర్మాణం. ఆరు సంవత్సరాలపాటు నిరంతరాయంగా జరిగినకృషి దానికినాంది.

'బెన్—హార్' కొత్త చిత్రాన్ని న్యూయార్కులో, హాలీవుడ్‌లో, లండన్‌లో ఈనాడు ప్రదర్శిస్తున్నారు. ఇది ప్రజల అభిమానాన్ని అధికంగా చూరగొన్నది. హాలీవుడ్‌లో ఈ చిత్రప్రదర్శనం రెండేండ్లపాటు సాగుతుందని, కనీసం ఒక్క ఏడాది అయినా లండన్‌లో సాగుతుందని నిర్మాతలు ఆశిస్తున్నారు. అయితే ఈ చిత్రం మొదటి ఏడాదిలోనే మూడుకోట్ల డాలర్లు ఆర్జించవచ్చు. ఆర్జనలో నేటికీ నిలిచిఉన్న ప్రమాణం నెలకొల్పిన చిత్రం "గాన్ విత్ ది విండ్". అయితే ఆ మొత్తం ఆర్జించడానికి ఆ చిత్రానికి రెండు దశాబ్దాలు పట్టినది.

## ఉబుసుపోక

ఈ చలనచిత్ర నిర్మాణగాథలో దాగి ఉన్న గాథ మరీ రసవంతమైనది.

అంతర్యుద్ధం ముగిసిన వనుక సైన్యంలో

# 11 ఆస్కార్లు గెలిచిన చిత్రం

మెట్రో-గోల్డ్విన్-మేయర్ సంస్థ నిర్మించిన 'బెన్-హర్' 11 ఆస్కార్లు గెలిచి అమెరికా చలనచిత్ర పరిశ్రమలో చరిత్ర సృష్టించుకొన్నది.

'ఆస్కార్' బహుమతి పొందడం ఘనత. అమెరికా చలనచిత్ర పరిశ్రమకు సంబంధించినవారి లక్ష్యం కూడా. ఆస్కార్ బహుమతి ప్రతిభావ్యుత్పత్తులకు గీటురాయి.

మోషన్ పిక్చర్ ఆర్ట్సు, సైన్సెస్ అకాడమీ (అమెరికా) తొలుత ఈ చిత్రానికి 12 ఆస్కార్లు బహూకరించాలని సిఫార్సు చేసినది. ఈ సంస్థ చరిత్రలో మరి ఏ చిత్రానికి ఇన్ని ఆస్కార్లు బహూకరించాలని సిఫార్సు చేసి ఉండలేదు.

ఆతరువాత 1960 ఏప్రిల్ 4 వ తేదిని హాలీవుడ్ లో బహుమతి ప్రదానసభ జరిగినది. 'బెన్-హర్' 11 ఆస్కార్ బహుమతులు గెలుచుకొన్నది. అమెరికా చరిత్రలో మరి ఏ చిత్రానికి ఇన్ని ఆస్కార్లు లభించలేదు.

'బెన్-హర్'కు లభించిన ఆస్కార్ బహుమతులు ఇవి:

* ఆ ఏడాది నిర్మాణమైన చిత్రాలలో ఉత్తమమైనది.
* ఆ ఏడాది దర్శకులలో ఉత్తముడు (విలియమ్ వైలర్)
* ఉత్తమ నటుడు (ఛార్ల్టన్ హెస్టన్)
* ఉత్తమ ఉపపాత్రధారి (హ్యూ గ్రిఫత్)
* ఉత్తమ సంగీత దర్శకుడు (డా. మిల్కాస్ రోజా)
* రంగు చిత్రాలలో ఉత్తమ వేషభూషల రీతులు (ఎలిజబెత్ హాఫెండన్)
* స్పెషల్ ఇఫెక్ట్సు
* ఉత్తమ శబ్దగ్రహణం
* ఉత్తమమైన ఎడిటింగ్
* రంగు చిత్రాలలో కెల్లా ఉత్తమమైన కళాదర్శకత్వం
* రంగు చిత్రాలలో కెల్లా ఉత్తమమైన సినిమాటోగ్రఫీ

న్యూయార్కు చలనచిత్ర విమర్శకుల సంస్థ, 'ఫిల్మ్స్ అండ్ ఫిల్మింగ్ మాగజిన్', అమెరికా స్క్రీన్ ప్రొడ్యూసర్స్ గిల్డ్ 'బెన్-హర్'ను ఉత్తమ చిత్రంగా ఎన్నుకొన్నవి. 'పిక్చర్ గోయిర్ మాగజిన్' 'సీల్ ఆఫ్ మెరిట్' బహూకరించినది. కేన్స్ చలనచిత్రోత్సవం (1960) లో 'బెన్-హర్'కు 'హార్స్ కన్కోర్స్' లభించినది. అసమానమైన చిత్రానికి మాత్రమే లభించే అపూర్వ సన్మానమది.

బ్రిటిష్ ఫిల్మ్ అకాడమీ ఉత్తమ చిత్రంగా ఎన్నుకొన్నది.

దర్శకుడు విలియమ్ వైలర్ కు కూడా గొప్ప బహుమతులు లభించినవి.



'బెన్-హర్' నవల రచించిన జనరల్ లూయీ వాలెస్ శిలావిగ్రహం (వాషింగ్టన్ లో)

నుంచి విరమించుకొన్న తరువాత ప్రభుత్వ కార్యకలాపాలతో విసుగు చెంది ఉన్న క్షణంలో రచనకు ఉపక్రమించాలను కొన్నాడు జనరల్ లూయీ వాలెస్.

తనరచనకు నాటకంగా లభించిన ఆదరం, ఖ్యాతి చూచాడు. ఆశ్చర్యం అణచుకొనలేక పోయాడు.

"అరీ భగవంతుడా! ఇదంతా నా పుస్తకం గురించిన హంగామాయేనా" అన్నాడు ఆయన.

కాని కొన్నేండ్లు గడచిన తరువాత మిత్రులు పదే పదే కోరగా తాను 'బెన్-హర్' రచించడానికి పూనుకొనడం ఎలా సంభవించినది ఆయనే వివరించాడు.

ఒకానొక సందర్భంలో మతం గురించిన చర్చ సాగినది. జనరల్ లూయీ వింటూ కూర్చున్నాడు. వైయక్తికంగా తనకు భగవంతునిగురించి కాని క్రీస్తుగురించి కాని ఇతమిత్థమైన అభిప్రాయాలు, నమ్మకాలు ఏమీ లేవని ఆయన చెప్పాడు.

కాని ఆనాటిచర్చ ముగిసిన పిదప చీకటిలో ఇంటికి తిరిగి వెళ్ళుతూ ఉండగా క్రీస్తు కాలానికి సంబంధించిన గాథ ఒకటి మసక మసకగా ఆయన మెదడులో మెరిసినదట.

నాలుగుసంవత్సరాలపాటు పరిశోధన సాగించాడు ఆ వృద్ధవీరుడు. తత్ఫలితంగా 'బెన్-హర్' నవల రూపొందినది.

## సంగ్రహ గాథ

యూదు ప్రభువుల కుటుంబంలో ప్రభవించిన వాడు బెన్-హర్. అగర్భ శ్రీమంతుడు.

నాడు బెన్-హర్ మాతృదేశమైన యూదా రోమన్ చక్రవర్తుల పాలనలో పారతంత్ర్యంలో మునిగి ఉన్నది.

జన్మతః యూదుల నాయకుడు అయిన బెన్-హర్ పాలకులతో మైత్రి నెరపినాడు. వారి సద్భావం, గౌరవాదరాలు చూరగొన్నాడు.

బెన్-హర్ బాల్య మిత్రుడు మెస్సాలా రంగంలో ప్రవేశించడంతో పరిస్థితి కలుషితమయినది. బెన్-హర్ జీవితం ఆకస్మికంగా ఆపదపాలు అయినది.

రోమన్ సేనాధికారిగా మెస్సాలా యూదాకు తిరిగి వచ్చాడు. మెస్సాలా, బెన్-హర్ కలహించారు.

అప్రతిహతమైనది విధి విధానం. ఒకానొక యాదృచ్ఛిక సంఘటన మూలంగా రోమన్ చక్రవర్తి ప్రతినిధి ప్రాణాలు కోల్పోయినాడు. బెన్-హర్ తల్లి, సోదరి అమాయకులే అయినా పరాయిదొరల పాలకుల దౌర్జన్యానికి గురి అయినారు. కాని సత్యమే వారి బ్రతుకు అయినది. వారి ఆచూకీయే తెలియకుండా పోయినది.

బెన్-హర్ కూడా రోమనుల బానిసగా రోమన్ నౌకలలో కలాసి అయినాడు.

ఆ తరువాత చాలా కథ నడిచినది. గత చరిత్ర స్మృతిపథంలో మరుగయ్యే సమయం వచ్చినది.



'బెన్-హర్' దర్శకుడు
విలియమ్ వైలర్

'బెన్-హర్' కథ 10-8-1960 తేది సంచికనుంచి వరుసగా పాఠకులకు అందజేయగలము.

బెన్-హర్ విముక్తి చెంది యూదాకు తిరిగి వచ్చాడు.

రథాల పోటీలో మెస్సాలాను ఓడించాడు. తాను ప్రేమించిన యూదుబాలిక ఎస్తర్ సహాయంతో తల్లిని, చెల్లెలిని అన్వేషించడానికి పూనుకొన్నాడు.

అంతిమంగా అశేషమైన భాగ్య భోగాలు చూరగొన్నాడు.

బానిసగా ఉన్న నికృష్టమైన కాలంలో క్రీస్తుదేవుని అపారమైన కరుణాంతరంగం దర్శించాడు బెన్-హర్. క్రీస్తును రక్షించడానికి సమకట్టికూడా అనుల్లంఘనీయమైన భగవదేచ్ఛ ప్రతిబంధకం. కాగా విఫలుడైనాడు. క్రీస్తు పావన సందేశం లోకవ్యాప్తం చేయడానికై జీవితశేషం, సంపద సమస్తము అంకితం చేసుకొన్నాడు.

ఏసుక్రీస్తు ఉద్భవించడంతో ప్రారంభమై



'బెన్-హర్' నిర్మాత
కీ॥ శే॥ శామ్ జింబలిస్ట్

బెన్-హర్ పాత్రధారి ఛార్ల్టన్ హెస్టన్ కలాసిగా నటిస్తున్న సమయంలో అతని కుమారుడు ఫ్రేజర్ తండ్రికి చేయూతనిస్తున్న దృశ్యం.

శిలువ వేయడంతో సమాప్తం అవుతుంది బెన్-హర్. క్రైస్తవ-చారిత్రక సంఘటనలకు సంబంధించినదే అయినా అన్నిటికీ అతీతమైన జీవిత తత్వబోధకమై, వినోదకరమైనా జిజ్ఞాస రేకెత్తిస్తున్నదీ గాథ.

నవలకు తీసిపోని గాంభీర్యం "బెన్-హర్" చిత్రం సొమ్ము.

## చిత్ర నిర్మాణ గాథ

'బెన్-హర్' చిత్ర నిర్మాణ గాథ మరీ చిత్రమైనది.

గోల్డ్విన్ పిక్చర్స్ కార్పొరేషన్ వ్యవహారాలతో సతమతం అవుతూ పేచీలలో పడ్డాడు, శామ్ గోల్డ్విన్. ఇది ఇలా ఉండగా గాడ్సోల్ అనే ఆయన ఆసంస్థలో భాగస్వామ్యం సంపాదించాడు. గాడ్సోల్ పద్ధతులు గోల్డ్విన్‌కు నచ్చలేదు. ఆ సంస్థ నుంచి వైదొలగినాడు. ఆధిపత్యం గాడ్సోల్‌కు లభించినది.

అదే కాలంలో బెన్-హర్ నాటకం చలనచిత్రంగా నిర్మించే హక్కులు సంపాదించడానికి కొందరు ముందుకురావడం జరిగింది.

బెన్-హర్ చిత్రం నిర్మించాలని డగ్లస్ ఫెయిర్‌బాంక్స్, అడాల్ఫ్ జూకర్, మాక్స్ రైన్‌హార్డ్, డి. డబ్ల్యు. గ్రిఫిత్ సంకల్పించారు.

ఒక్క అణు అదనంగా చదివిన ఎర్లాంగర్ అనే ఆయనకు నాటకం ప్రదర్శనం హక్కు ఉన్నది. జనరల్ లూయీ వాలెస్ వారసుల వద్దనుంచి చిత్రం నిర్మించే హక్కు కొనడానికి పూనుకొన్నాడు ఎర్లాంగర్. అయితే జనరల్ లూయీ వారసులు రెండున్నర లక్షల డాలర్లు కావాలన్నారు. అంత మొత్తం సమకూర్చలేకపోయాడు ఎర్లాంగర్. ఆరుగురిని చేర్చుకొన్నాడు. దివాలా తీయడానికి సిద్ధంగా ఉన్న గోల్డ్విన్ కార్పొరేషన్‌ను పునరుద్ధరించే నిమిత్తం ఒక మంచి ఇతివృత్తం సేకరించ ప్రయత్నిస్తున్న గాడ్సోల్ సంస్థలో అడుగుపెట్టాడు. బెన్-హర్ ఎన్నుకొన్నాడు. కాని ఎర్లాంగర్ చెప్పిన ధరకు చిత్రం నిర్మించే హక్కు కొనడానికి అతనికి స్తోమతు లేదు. ఎర్లాంగర్ ధర ఆరు లక్షల డాలర్లు.

తగుమాత్రం ఖర్చుతో అంటే దాదాపు 360 వేల డాలర్ల ఖర్చుతో చిత్రం నిర్మించడానికి తగిన శక్తి ఉన్నది గాడ్సోల్‌కు. రాగల లాభాలలో సగం తీసుకొనే షరతుమీద చిత్రం నిర్మించే హక్కు కొంటానని ఎర్లాంగర్‌తో రాయబారం నడిపాడు! హక్కు భుక్తం చేసుకొన్నాడు గాడ్సోల్.

నాలుగున్నర లక్షల డాలర్ల ఖర్చుతో చిత్రం నిర్మించడానికి పథకం వేశారు. 1924 లో ఒక వర్గం ఇటలీ చేరుకొన్నది.

అక్కడ ఆలా చిత్ర నిర్మాణం సాగుతూ ఉండగా గోల్డ్విన్ కార్పొరేషన్‌ను మెట్రో-గోల్డ్విన్-మేయర్ పేరుతో తరువాత ప్రసిద్ధిచెందిన సంస్థకు విక్రయించడం జరిగినది. నిర్వాహక నిర్మాత ఇర్వింగ్ థాల్బర్గ్. ఇటలీలో ప్రారంభమైన కార్యక్రమం వారసత్వంగా సంక్రమించినది ఆయనకు. పరపు పుట్టించినదది.

ఇటలీలో కాక హాలీవుడ్‌లోనే ఆ చిత్రం నిర్మించాలని థాల్బర్గ్ కోరిక. అమెరికాలో అయితే 4,80,000 డాలర్ల ఖర్చుతో పూర్తి అవుతుందని ఆయన అనుకొన్నాడు. కాని అప్పటికే—14 నెలలలో — ఇటలీలో ఉన్నవారు 12 లక్షల డాలర్లు మింగివేశారు.

అప్పటివరకు జరిగినదానిని ఆధారం చేసుకొని నష్టం భర్తీ చేసుకొనే ప్రయత్నంలో ఇటలీలోని బృందాన్ని అమెరికాకు రప్పించాడు థాల్బర్గ్. ఇటలీలో ముస్సోలినీ నాయకత్వంక్రిందఉన్న ఫాసిస్టులకు, ఫాసిస్టు వ్యతిరేక వర్గాలవారికి సాగుతున్న సంఘర్షణలుకూడా ఈ నిర్ణయానికి కారణమైనవి.

ప్రాచీనమైన జెరూసలెమ్‌లో షూట్ చేసిన జనసమూహం దృశ్యాలు, సాగర యుద్ధం దృశ్యాలు బాగానే ఉన్నవని వాటిని ఉపయోగించవచ్చునని నిశ్చయించారు.

కాని రథాల పోటీ దృశ్యానికిగాను కాలిఫోర్నియాలోని కల్వర్ సిటీ స్టూడియోల ఆవరణంలోనే క్రీడాస్థలి (కొలీషియమ్) నిర్మించడానికి నిశ్చయించాడు థాల్బర్గ్.

క్రీడాస్థలి నిర్మాణానికే 180 వేల డాలర్లు ఖర్చు అయినది.

## నిర్మాతలు; నటీనటులు

ఈ నూతన చిత్రం నిర్మాత శామ్ జింబలిస్ట్. 'కోవాడిస్', 'కింగ్ సాలమన్స్ మైన్స్', 'మొగాంబో' మున్నగు గొప్ప చిత్రాల నిర్మించినది ఆయనే. బెన్-హర్ చిత్రం నిర్మిస్తూన్న ఆఖరిదశలో ఆయన రోమ్‌లో మృతి చెందాడు.

దర్శకుడు విలియమ్ వైలర్. రెండు పర్యాయాలు 'ఆస్కార్' గెలుపొందినవాడు.

స్క్రీన్‌ప్లే రచించినది కార్ల్ టన్‌బర్గ్.

ప్రధాన భూమికలు నిర్వహించినవారు చార్ల్టన్ హెస్టన్ (బెన్-హర్); జాక్ హాకిన్స్ (క్వింటస్ ఏరియస్); హాయా హరరీత్ (ఎస్తర్); స్టీవన్ బోయిడ్ (మెస్సాలా); హ్యూ గ్రిఫిత్ (షేక్ ఇల్‌దరిమ్); మార్తా స్కాట్ (మిరియమ్); కేథీ ఓ డానెల్ (తిర్జా); శామ్ జాఫ్ (సిమొనైడ్స్).

(ఎమ్. జి. ఎమ్. సౌజన్యంతో)



చారిత్రికమైన సంప్రదాయాలకు వారసులు ఒకరు. మరొకరితో చరిత్ర ప్రారంభం అవుతుంది. వేరొకరు చరిత్ర సృష్టించుకొంటారు. అజరామరమైన కీర్తి ఆర్జించుకొనేవారూ వారే. ఆలాంటి వారిలో శ్రీమతి సిరిమావో బండార నాయకే ఒకరు.

శ్రీమతి బండారనాయకే ఇటీవల సింహళం ప్రధానమంత్రి పదవి స్వీకరించారు. ప్రపంచచరిత్రలో ప్రధాన మంత్రిత్వం నిర్వహించిన తొలి మహిళ ఆమె. అపూర్వమైన ఈ ఘనత శ్రీమతి బండారనాయకేకు లభించడం అన్ని విధాలా తగి ఉన్నది.

ఆమె భర్త శ్రీ సాలమన్ బండారనాయకే, సింహళం ప్రధానిగా ఉన్నప్పుడు హంతకుని తుపాకి కాల్పులకు గురఅయి ప్రాణాలు కోల్పోయినారు. కఠోరమైన విధి విధానంవల్ల ఆవిధంగా సమర్థుడుఅయిననాయకుని కోల్పోయిన శ్రీలంక స్వతంత్రపక్షం బలం తదుపరి జరిగిన ఎన్నికలలో తరిగి పోయినది. ప్రభుత్వం స్థాపించటానికి తగినబలం ఏ పక్షానికీ లభించకపోగా తిరిగి ఎన్నికలు ఆవశ్యకమైనవి. శ్రీలంక స్వతంత్ర పక్షానికి సమర్థమైన నాయకత్వం కూడా అత్యంతావశ్యకమైనది.

శ్రీలంక స్వతంత్ర పక్ష సభ్యుల కోరిక మన్నించి నాయకురాలు అయినది శ్రీమతి సిరిమావో. ఆమె నాయకత్వాన ఆ పక్షం అఖండమైన విజయం సాధించి ప్రభుత్వం ఏర్పాటు చేసినది.

భర్త దుర్మరణానికి గురి అయ్యే వరకు రాజకీయాలలో పాల్గొనకపోయినా ఆమెకు రాజకీయ పరిజ్ఞానం మెండు. సంపన్నమైన కాండ్యన్ కుటుంబంలో 1916 ఏప్రిల్ 17 వ తేదిని జన్మించినదామె. సామాజిక సేవకు తొలుత జీవితం అంకితం చేసుకొన్నది. భర్తతో కలిసి జేశ దేశాలు పర్యటించినది.

శ్రీమతి బండారనాయకే నాయకత్వం క్రింద సింహళ దేశానికి ఇతోధికమైన అభివృద్ధి చేకూరుతుందని, ప్రజాజీవనం సుఖదం అవుతుందని ఆశించవచ్చు. ★

# పెళ్లిచూపులు



ఆనంద మానంద మాయెనే - మన జానకి పెండ్లి కూతు రాయెనే, మన రాముడు - పెండ్లికొడు కాయెనే_బ్యాండు మేళం వాళ్ళు ఆలాపిస్తున్నారు. పెండ్లికొడుకు అనూరాధ మెడలో మాంగల్యధారణ చేస్తున్నాడు. అనూరాధ అక్క పద్మ, అనూరాధ పూలజడని ఎత్తి పట్టుకుంది. "కాస్త ఆ మూడుముళ్ళూ గట్టిగా వెయ్యి నాయనా," హెచ్చరించింది ఎవరో ముత్తయిదువు. పెండ్లిపందిరంతా కిటకిటలాడుతోంది బంధువులతో స్నేహితులతో. వచ్చిన మగవాళ్ళను ఆహ్వానించటము సత్కరించటములో ఎవరికీ ఏ లోటూ రాకుండా పందిరంతా కలయతిరుగుతూ చూస్తున్నాడు అనూరాధ బావ మధుసూదనం; ఆడవాళ్ళ వేపు అనూరాధ చెల్లెలు వనజ పూనుకుంది. పద్మ పెళ్ళికూతుర్ని అంటిపెట్టుకు ఆమెను కూర్చోపెట్టాలన్నా నిలుచోపెట్టాలన్నా ప్రక్కన వుంటూంది. నరసింహంగారు వియ్యంకుని ప్రక్కనే కూర్చుని తాటాకు విసనకర్రతో విసురుతూ ఇద్దరు కూతుళ్ళనూ- ఇద్దరల్లుళ్ళనూ చూస్తూ ఆనందంతో చెమర్చిన కళ్ళను వత్తుకుంటూ "ఈ ఆనందం నువ్వు పెట్టిన భిక్షే బాబూ!" అని స్పష్టంగా తనలో తనే గొణుక్కుంటున్నాడు. రాజ్యలక్ష్మమ్మ గారి ఆనందానికి పట్టపగ్గాలులేవు. చిన్న కూతురు పెండ్లి ఎంత చిత్రంగా జరుగుతూందో పెళ్ళినాడు పసుపు బట్టలతో గడప దాటిన పెద్దకూతురూ, పెద్దల్లుడూ ఈ తరం ముక్కతో ఊడిపడటమూ అంత చిత్రంగానూ ఉంది ఆమె ప్రాణానికి. పెద్దకూతురు పెళ్ళిలో కూడా కనుపించని హాయి ఆమెకు అనూరాధ పెళ్ళిలో కనుపించసాగింది.

బి. ఎస్. లక్ష్మి

వియ్యంకుణ్ని నరసింహం దంపతులు బాబూ అని పిలుస్తారు. ఆయనను చూస్తే వాళ్ళకు అదో విధమయిన భక్తి. మాటిమాటికి, వియ్యంకుని వద్దకు వెళ్ళి "కాస్త పానకం తీసుకోండి, ఎండ ఎక్కువగా ఉంది. పోనీ దాహమేనా తీసుకోండి, పోనీ కాస్త కాఫీ తీసుకురమ్మన్నారా?" అంటూ రాజ్యలక్ష్మమ్మ తన ఆప్యాయతను వెల్లడించసాగింది.

"వెధవబండి లేటయిపోయింది. అయినా టయిముకే వచ్చానుగా నరసింహం, ఏమోయి శంకరం మాట మాత్రమేనా చెప్పావు కాదేం? శుభలేఖ చూసి ఆశ్చర్యపోయానుకో, మానవుడ ననిపించుకు మా అందరికి బుద్ధిచెప్పావు. అన్నాడు మధు తెచ్చిన తువ్వాలుతో కాళ్లూ చేతులు తుడుచుకుంటూ, అప్పుడే బండి దిగి వచ్చిన మూర్తి.

మూర్తి మాటలతో మధు మనస్సు తన పెళ్ళినాటి ఘట్టాల్ని స్ఫురణకు తెస్తుంది. తన మామగారు లాంఛనాలు అన్నిటిక్రిందా ఒక అంకెను చెప్పటము తానూవిన్నాడు. అయినా తనవాళ్ళతో కలసి "పేచీ" పెట్టేందుకు తను వెనక్కు జంకలేదు. పాపం పద్మ ఎంత బాధపడిందో! చివరకు అనూరాధపెండ్లి తనకన్నా యోగ్యుడైన వరునితో కానీ కట్నము లేకుండా జరుగుతూందన్న "రూఢి" అయిన వార్త తెలిసే వరకు తన పట్టు సడలనే లేదు. ఒకవిధంగా అనూరాధ పెళ్ళి తనకు గుణపాఠమే అయింది. ఆనాడు తనేమన్నాడు అనూరాధ పెండ్లిలో చూస్తాంగా అన్నాడు. ఏమిటి తను చూసేది. మామగారు తనకన్నా ఎక్కువ డబ్బు ఇస్తే

అనూరాధ పెళ్లి కూడా "రసాభాసు" చేయాల్సిందేనా? ఇప్పుడు పోటీపడి తీసుకున్న కట్నం తిరిగి ఇవ్వగలడా! మధు మనస్సు పశ్చాత్తాపంతో నిండిపోయింది. పసుపు పుయ్యటానికి వచ్చిన వనజను చూసి, "పెండ్లికూతురు చెల్లెల్నా మాట్లాడటము మానేశావు? ఇంతకూ కట్నమేమిస్తున్నారు?" పలకరించింది ముత్తయిదువ. "కట్నమా మా బావకు మా అక్క కట్నంట. ఈమాట మామయ్య అన్నారు" అంటూ వెళ్లిపోయింది వనజ. ఆపందిట్లో అంతా అనూరాధఅదృష్టం గురించి చెప్పుకుంటుంటే పద్మకు తన పెళ్ళి జ్ఞాపకము రాసాగింది. కట్నముకూడా ఇచ్చి పెద్ద పిల్లనుకదా! అని ఘనంగానే చేశాడు నాన్న. అయినా తనభర్తవార్ని తృప్తిపరచలేక పోయాడు. ఫలితంగానే పెళ్ళిపందిరి పన్నీటి జల్లులలో కాకుండా కన్నీటి జల్లులతో నిండిపోయింది. అంతా తన అదృష్టాన్ని కీర్తిస్తూంటే, పంతాలతో పసుపు బట్టలతో గడప దాటుతూన్న తన్ను చూసి, అమ్మ "పెద్దపిల్లకదా అని మా శక్తివంచన లేకుండా ప్రయత్నించినా మాట దక్కించుకోలేక పోయాం. ఇక అనూరాధ పెళ్లి ఏం చేస్తామో?" అన్ని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. మళ్ళీ అనూరాధ పెళ్ళికి ఇంత సంతోషంగా గడపలో అడుగు పెట్టగలుగుతానని తను అనుకోనే లేదు. అనూరాధ "అదృష్ట"మే కాకుండా "వక్రమార్గాన్ని" పట్టిన తన అదృష్టంకూడా చక్కబడింది.

* * *

అప్పుడే భోజనం చేసి వాకిట్లోకి వచ్చిన నరసింహముగారి చేతులో ఉత్తరముంచి వెళ్లాడు పోస్టుమేన్. ఆ ఉత్తరంలో రెండే రెండు ముక్కలున్నాయి.

ప్రియ మిత్రుడు నరసింహానికి, నీ కోరిక ప్రకారం "వరుణ్ని" బుధవారం పదకొండు గంటల "ప్యాసింజరు"లో పంపుతున్నాను. "స్టేషను"లో కలుసుకో. వివరాలు ఆయన వచ్చిన తరువాత వ్రాయి.

ఇట్లు నీ ప్రియమిత్రుడు మూర్తి.

చదువుతూన్న ఉత్తరం ఆయనకు తెలియకుండానే చేయి జారి పడిపోయింది. "వెనుకటికి నిత్యదరిద్రంతో బాధపడే ఒక కట్టెలవాడు ఈ బాధ పడలేకుండా ఉన్నాడు. చావేనా రాదేం అనుకున్నాడుట. వారంటే పడుతూన్న "మృత్యుదేవత" ఏం నాయనా పిలిచావు. నేను "మృత్యువుని" అందిట. దానితో కట్టెలవాడికి ముచ్చెమటలు పోసినట్లయి "ప్రాణభీతి" కల్గి అబ్బే! ఈ కట్టెల మోపు ఎత్తి పోతావనీ అన్నాడుట యుక్తిగా. ఆ కథ జ్ఞాపకమొచ్చింది నరసింహంగార్కి. పెద్దపిల్లపెళ్ళితో విసిగిపోయిన తాను ఈ పిల్ల పెళ్ళి అయిందని చస్తే చాలన్న స్థితికి దిగజారి పోయాడన్న

# పెళ్ళి చూపులు

మాట. ఆయనకు మూర్తి మొదటి ఉత్తరం జ్ఞప్తికి వచ్చింది.

ప్రియమైన నరసింహానికి

నీ ఉత్తర మందినది. నీ బాధకూడా నా కర్థమైంది. అయినా ఆడపిల్లలున్న ప్రతి తండ్రి ఈరకం బాధలు పడటము ఈరోజుల్లో పరిపాటి అయింది. నీవు రాసిన విషయం గురించి "క్షుణ్ణంగా"గా ఆలోచించాను. మన చేతికాని, ఈ రోజుల్లో "కన్యాదానం"తో తృప్తిపడే ఘనులెవరున్నారు? అందుకే నేనొకటి ఆలోచించాను. నా బాల్య స్నేహితుడు "శంకరం" అని ఉన్నాడు. రెండేళ్లు అటూ యిటూగా నా వయస్సే ఉంటుంది. అతని కీమధ్యే భార్య పోయింది. ఒక కొడుకు ఉన్నాడు. నువ్వు ఊఁ! అన్నావంటే అతని నెట్లాగో ఒప్పించి పంపుతాను. వయస్సు, ద్వితీయం, ఈ రెండూ పదిలేని పట్లయితే అతనన్ని విధాలా యోగ్యుడు. ఏమైనా కాగి చల్లారినపాలు, కనుక పెద్దలుడుతో వృద్ధ బాధలు ఇతనితో పడాల్సిన అవసర ముండదు. పూర్వాపరాలు, లాభనష్టాలు బాగా యోచించి నీ అభిప్రాయం తెలియచేస్తే దాన్నిబట్టి నా ప్రయత్నముంటుంది అని వ్రాశాడు. ఆక్షణంలో మూర్తి యోచన సమంజసముగానే తోచింది ఆయనకు. అతగాడు రాసినట్లు కట్నమంటూ ఇవ్వలేని తను ఇంతకన్న మంచి జోడీ తేగలననుకోటము వెర్రి. మనిషి యోగ్యుడైతే ఆపైన పిల్లదాని "అదృష్ట"మేలా ఉంటే అల్లా జరుగుతుంది. అట్లా తనకు తనే సమాధానపడి రాజ్యలక్ష్మమ్మతో నైనా యోచించకుండా మూర్తికి అంగీకారం తెలియచేశాడానాడు.

కానీ అంతా నిర్ణయమయాక తన మనసిట్లా ఎదురు తిరుగుతోంది. కట్టెలవాని ప్రాణభీతిలా అంతవరకు తన అంతరాంతరాల్లో దాగిఉన్న పితృప్రేమ ఒక్కసారిగా కట్టెదుట నిల్చినట్లుంది నరసింహంగార్కి.

వయస్సు ద్వితీయము, అన్న వాక్యాలు మరిస్తే మిగతా విషయాల్లో నువ్వు బాధపడవలసిన అగత్య ముండదు. అయినా కాగి చల్లారినపాలు బాగా యోచించుకో అన్న మూర్తి వాక్యాలు పదే పదే గుర్తుకు రాసాగాయి. తను మరవటము సాధ్యమే కావచ్చు. పద్దెనిమిదేళ్ళు నిండని తన అనూ దాదాపు తండ్రి వయస్సుదాటిన వరునితో తిరుగుతూంటే "మీ నాన్నగారా అమ్మా, మీ మామగారా అమ్మా?" అని లోకులు అడుగుతూంటే ఎట్లా మరవగలదు, ఏమని సమాధానము చెప్పగలదు. కా...గి చ...ల్లారిన పా...లు మూర్తి బాగా పోల్చాడు.



'కోర్టుకు దారి ఎటు?'
'చెబితే ఏమిస్తారు?'
-చిత్రకారుడు శ్రీ కె. సత్యనారాయణ (బిలాస్పూర్)

కాగుతూన్న పాలలా జీవితము మొదటిదశలో ఉన్న అనూ, చల్లారిన పాలలా ఆద్యంతాలు చవిచూసి అన్నీ ఉడిగిన భర్తతో సమన్వయమెట్లా కుదుర్చుకుంటుంది. విన్నావా అనూ! మీ నాన్న ఎటువంటి జంట కుదురుస్తున్నాడో! పిచ్చినవ్వు నవ్వుకున్నాడు నరసింహం. ఈ ఆలోచన ముందేవస్తే ఎంత బాగుండును. కళవళపడి పోతూ జుట్టు పీక్కున్నాడు అంతలో ఆయనకు భార్య గుర్తుకువచ్చింది. ఈ సంగతి తెలిస్తే రాజ్యలక్ష్మి ఏమంటుంది. రాజ్యలక్ష్మి సంగతి తనకు బాగా తెలుసు. వెనకా ముందూ చూడకుండా దులపరించి పారేస్తుంది. అయినా తనకా దుర్బుద్ధి ఎందుకు పుట్టాలి? ఎన్నడైనా ఆమెతో చెప్పకుండా ఏ పనైనా చేశాడా తను. ఇంతకీ ఈ అపాయంనుంచి బయటపడే ఉపాయమేమిటి? రేపే బుధవారం, ఏం చేసేందుకు వ్యవధి కూడా లేదు.

పోనీ ఆ వచ్చినాయన పిల్ల నచ్చలేదని వెళ్ళిపోతే... కానీ ఎందుకు వెడతాడు తన అనూకు ఏమి లోటనీ, తనలాంటి దరిద్రుని కడుపున పుట్టడము తప్ప. ఏడుకొండలవాడా తండ్రీ ఈ ఆపదనుంచి ఎట్లా గట్టెక్కిస్తావో, నా తల్లి అనూ ముఖం చూడు తండ్రీ అంటూ రెండు చేతులూ ఎత్తి తల మీద పెట్టుకోబోతున్న ఆయన చేతిని రాజ్యలక్ష్మమ్మ పట్టుకుని,

"అదేమిటండీ నిద్రపోతున్నారా? పెళ్ళివారొస్తున్నారని రాశారు కదా? ఆ శుభాన్ని తీసుకువచ్చిన ఉత్తరాన్ని కాళ్లతో త్రొక్కేసినా రవకే నావున్నారా? అయితే ఇంతకూ పెళ్ళికొడుకు దేవూరు? ఏం పని? పిల్లవాణ్ణి మీ రిదివరకెప్పుడైనా చూశారా?" అంటూంటే,

పెళ్ళికొడుకు పిల్లవాడు అనుకునే ఆమెకు అప్పటికి నిజముచెప్పే ధైర్యములేక, "అబ్బ! కాస్సేపు నన్ను పడుకోనివ్వూ. రేపేగా

"పెండ్లి కారొచ్చేది. అప్పుడు చూద్దాంలే," అని విసుక్కున్నారాయన.

అంతకుముందే కంచాలు కడగటము పూర్తి చేసి వాళ్ళ సంభాషణ వినేందుకు ప్రక్కగదిలో చేరిన అనూరాధకు ఆపైన ఒక్క అక్షరము కూడా వినిపించలేదు. కానీ అనూరాధ మాత్రం ఆ రాత్రి కలలు కంటూ నిద్రపోయింది! - రాజ్యలక్ష్మమ్మ రేపు వచ్చే పెళ్లివారు, చేయవలసిన ఏర్పాట్లూ తలచుకుంటూ కలత నిద్రతో తెల్లవారదీసింది.

నరసింహంగారికిమాత్రం ఎంత ప్రయత్నించినా ఆ రాత్రి నిద్రపట్టలేదు. పరీక్ష రాసిన విద్యార్థికి పరీక్షా ఫలితాలు తెలిసే రోజులా ఉంది ఆయన పని. ఎంత చప్పున తెల్లవారుతుందా ? ఆ రేపనేది ఎంత చప్పున వస్తుందా అని ఎదురు చూడసాగారాయన.

ఇంకా సరిగ్గా తెల్లవారక ముందే రాజ్యలక్ష్మమ్మ ఇంటి పనులలో మునిగిపోయింది. ఆమె ఉత్సాహం చూసి పెళ్ళి చూపులకు ఊళ్ళో సగంమందిని పోగేసుకు వస్తుందేమో అనుకున్నారాయన. తను చేయబోతూన్న ఘనకార్యం ముందుగా నలుగురి చెవిని పడటము ఇష్టము లేదాయనకు. పిల్లల్ని కూడా స్కూలుకు పంపివేయమని ఈ పెండ్లిచూపులు ఎంత గోప్యంగా జరిగితే అంత మంచిదని రాజ్యలక్ష్మమ్మతో చెప్పారాయన. సంబంధము అంత మంచిదేమో! కాలము మంచిది కాదు. అదీ నిజమేఅనుకుంది రాజ్యలక్ష్మమ్మ.

తెల్లారింది మొదలు ఆ చీర కాదని ఈ చీర ఈ చీర కాదని ఆ చీరా కడుతూ అలంకరణలో సతమతమయ్యే అనూరాధనుచూస్తుంటే మరీ బాధగాఉంది నరసింహంగారికి. ఆయన ఆమధ్య ఏదో సినిమాలో చూశాడు పెళ్ళికూతురు పిచ్చి వేషాలు వేసి పెళ్ళికొడుకుల్ని వెళ్ళగొట్టడము. అట్లా అనూ చేత చేయిస్తే! అయినా ఏమని చెప్పాలి ? అనూ నవ్వదూ! అట్లాగే నిరుత్తరుడై కానున్నది కాక మానదు అన్న నిస్పృహతో ఉండిపోయారాయన.

మూర్తి రాసినట్లు పదకొండుగంటల బండికి శంకరంగార్ని స్టేషనులో కలుసుకుని ఇంటికి తీసుకువచ్చాడు నరసింహం. ఆయనను వరండాలో కుర్చీలో కూర్చోపెట్టి పిల్లను పంపమని రాజ్యలక్ష్మమ్మతో చెప్పివచ్చారాయన. రాజ్యలక్ష్మమ్మ గుమ్మముదాకా పిల్లను తీసుకువచ్చి తల ఎత్తి చూసింది ఒకమారు. ఎదురుగా నెరిసీనెరవని కొద్దిపాటి బట్టతలా వమున్న తమైన పచ్చని శరీరం సులోచనాలు. నవ్వుతూ తన భర్తతో మాట్లాడుతూన్న శంకరంగార్ని చూసింది. మరొకసారి చుట్టూ కలయచూసింది. మరో వ్యక్తి ఎక్కడా కనపడకపోయేసరికి ఆమె కనులముందు తెర తొలగిపోయి, గుండె ఆగినంత పని అయింది. ఆమె చేతులు ఆమెకు తెలియకుండానే పట్టు తప్పాయి. క్షణకాలం స్తంభించి పోయినట్లు నిలబడ్డ ఆమె, అనూరాధను గుమ్మముదగ్గరే వదలి చరాలున లోనికి వెళ్ళిపోయింది.

తలవంచుకు నడుస్తూన్న అనూరాధ తల్లి చాపదాకా తీసుకువచ్చి కూర్చోపెడుతుందేమో నని ఒక క్షణం ఎదురుచూసి సిగ్గుతో తనంత తనే వచ్చి చాపమీద కూర్చుంది. తెల్లనిపాదాలపై ఎర్రని పట్టంచు జీరాడుతూండగా మెల్లగాకదలివచ్చే ఆ రెండుపాదాలను చూస్తున్న శంకరంగారి దృష్టి క్రమంగా అనూరాధ ముఖం మీదకు పోయింది. అదే సమయంలో అనూరాధ కూడా కళ్ళెత్తి వరుని వంక చూసి తృళ్ళిపడింది.

ఆ క్షణంలో ఆమెలో అనేక భావాలు సుడులు తిరిగాయి. తన మీద తనకే జాలి వేసి అనుకోకుండా నల్లకలువలులా ఉన్న ఆమె కాటుక కండ్లు ఆర్ద్రమూ - సజలమూ కావటముతో తలవంచేసుకుంది. అనూరాధ మరీ బొత్తిగా చిన్నపిల్ల కాదు. పరిస్థితులను గుర్తించలేనంత అమాయకురాలూ కాదు.

నిమిషాలు గడచిపోయే కొద్దీ ఆమెకు తన పరిస్థితి తండ్రి పరిస్థితి అర్థము కాసాగింది. అసలు మధ్యతరగతి కుటుంబాలలో ఆడపిల్లలే అంత. వాళ్ళకు వయస్సును మించిన అనుభవము అవగాహనశక్తి ఉంటుంది. దానితోడు తనవారి మీద సానుభూతి కూడా తగినంత ఉంటుంది. ఆ సానుభూతే తండ్రిమీద కల్గింది అనూరాధకు. ఈ పెళ్ళి చూపులు సవ్యంగా జరిగితే అవక తను తండ్రికి బరువుకాని విధం ఆలోచించుకోవచ్చు. ఆలోచించుకునేందుకు ఏముంది? నాన్నను కష్టపెట్ట కూడదంటే నాన్న నిర్ణయానికి తల వొగ్గటము ఒకటి, ఆత్మహత్య ద్వారా తన సమస్య వాళ్ళకు లేకుండా చెయ్యటము రెండవది. ఆత్మహత్య అనే సరికి అనూరాధకు కాంత జ్ఞాపకమొచ్చింది. అది చనిపోయేనాడు తనతో అంతా చెప్పుకు ఏడ్చింది. తన బరువు తనవాళ్ళకు తగ్గించాలంటే "ఆత్మహత్య" కన్న గత్యంతరం లేదంది. తెల్లవారేసరికి చచ్చిపడి ఉంది కాంత. కానీ ఏం జరిగింది. ఈ గుడ్డిలోకం చనిపోయిన ఆ అభాగ్యురాలిమీద సానుభూతి చూపకుండా అనేక అపనిందలు అంటగట్టింది. ఏం లేకపోతే ఇట్లా ఎందుకు చస్తుందీ అని ప్రశ్నించింది. దానితో అంతకు ముందే పెట్టుపోతలు సరిగ్గాలేవని గుణుస్తూన్న కాంతబావ భార్యను పుట్టింట వదలి చక్కాపోయాడు. ఒక అక్క ఆత్మహత్య చేసుకుని, మరో అక్కను వదిలివేసిన ఇంటి ఆడపిల్లలను చేసుకునేందుకు తగ్గ గుండె ధైర్యమెవరి కుంటుంది. కాంతపోయి సంవత్సరమైనా వాళ్ళ కుటుంబము మరింత చిక్కులలో ఇరుక్కుందే కానీ చక్కబడలేదు.

మొన్నటికి మొన్న అమ్మ ఏమంది? "ఆ ఇంటికి ఇక మార్పురాదనీ, అన్ని విధాలా వాళ్ళను కాంత అన్యాయం చేసిందనీ అన లేదూ? రేపు తనగురించి కూడా ఇట్లాగే అనుకుంటారు. ఛీ! ఈ దేశంలో ఆడపిల్లలకు స్వేచ్ఛగా చచ్చే అవకాశం కూడా లేదు అనుకుంది అనూరాధ.

అయినా ఎటూ తను ప్రాణాన్ని వదిలేందుకు నిశ్చయించుకున్నదే కాయిరి. ఏదో సుఖపడాలన్న వాంఛ మాత్రం ఎందుకు? కేవలం పరోపకార మిదం శరీర మన్నమాటకే సాటిగా కాలాన్ని వెళ్ళతీస్తే అటు భర్తనూ - ఇటు తండ్రినీ సుఖపెట్టినదీ అవుతుంది. ఇహమూ - పరమూ సాధించగలుగుతుంది. ఈ నిశ్చయమే శతధా మంచిదని ఎంచింది అనూరాధకు. ఒక దృఢనిశ్చయాన్కి వచ్చిన ఆమెకు వెనుకటి కళవళపాటు తగ్గి జీవితాన్ని జయించిన గొప్ప వేదాంతిలా ముఖంలో కొత్త కాంతి వెల్లొందింది. అంతలోనే మళ్ళీ లోపలకు వెళ్ళవచ్చునమ్మా అన్న తండ్రిమాట వినిపించటముతో లోనికి వెళ్లింది అనూరాధ.

తను ఊహించిన దెబ్బను అనూరాధ ముఖంలో కనబడక పోయినా రాజ్యలక్ష్మమ్మకు మాత్రం కూతుర్ని చూడగానే దుఃఖము పొంగుకొచ్చింది. అప్పుడే నరసింహంగారు కూడా లోపలికివస్తూ ఈ దృశ్యాన్ని చూసి కళ్లు వత్తుకున్నారు. ఆయనను చూడగానే దుఃఖముతోపాటు కోపము కూడా రెచ్చిపోయిన రాజ్యలక్ష్మమ్మ, "ఆయనేనా వరుడు? మీకన్నా పెద్దవాడైన ఆయనను అల్లుణ్ని చేసుకునేందుకు మీకు సిగ్గు వెయ్యటంలేదూ! నా బిడ్డకు పెళ్లి కాకపోతే మానె, ఈ పెళ్ళి నే జరగనివ్వను!" అంది ఆవేశంగా!

## వివరాలు అక్కర్లేదు!

కోటీశ్వరుడు ఒకరు స్వంత విమానంలో ప్రయాణానికి బయలుదేరాడు. మార్గంలో విమానచోదకుడు యజమానితో "అయ్యా, ఇప్పుడు మనకు దిగువగా ఉన్నది ఢిల్లీనగరం అండీ" అన్నాడు.

"వివరాలు అక్కర్లేదు. అది ఏ దేశమో చెప్తే చాలు" అన్నాడు ఆ కోటీశ్వరుడు.

ఎమ్. వి. శివకుమార్ (చెరుకుపల్లి).

# పెళ్ళిచూపులు

"అవతల పెద్దమనిషిని పిలిచి పిల్లను చూపి ఇవ్వడు కాదంటే ఎట్లా!" భార్యను అనునయించబోయాడు నరసింహంగారు.

తండ్రి నా స్థితిలో చూస్తుంటే అనూరాధకు ఊరుకోబుద్ధి కాలేదు. "చేసుకునేదాన్ని నేను నాన్నగారూ! మీ ఇష్టమే నా ఇష్టము అమ్మా! కూతురు పెళ్ళంటే ఏడ్చే తల్లి ఎవరైనా ఉన్నారా!" అంటూన్న అనూరాధ మాటలు పూర్తి కాకుండానే "బావగారూ!" అన్న శంకరంగారి పిలుపు ముగ్గుర్ని ఆశ్చర్యచకితులను చేసింది.

అయితే శంకరంగారు కూడా పిలిచేముందు ఎంతో తర్జనభర్జన పడ్డాడు. మళ్ళీ వివాహము చేసుకోవటము ఆయనకు ఇష్టము లేదు. సాగాటి కలమూర్తి, తమాషాగా అరిచేతిలో వైకుంఠము చూపినట్లు మాట్లాడుతూంటే కాదనలేకపోయాడు ఆయన. తీరా పెళ్ళివారింట్లో అడుగు పెడుతూన్న ఆయనకు పార్వతమ్మతో జరిగిన పెళ్ళిచూపులే గుర్తుకు వచ్చాయి. ఆనాడు ఎంత అట్టహాసం చేశారు తన మామగారు. ఊరిలో సగంమంది ఆడా, మగా అక్కడే ఉన్నారు అనిపించింది తనకు. అంతలో ఆయనకు అనూరాధను వదలి అక్కడినుంచే తీవ్రంగాకదులుతూన్న రాజ్యలక్ష్మమ్మ కనుపించింది. మళ్ళీ తన అత్తగారితో పోల్చి చూసుకుంటే రాజ్యలక్ష్మమ్మ చర్య వింతగానే కనుపించింది.

పెళ్ళికూతురు అనూరాధను చూస్తుంటే మళ్ళీ పార్వతమ్మ జ్ఞప్తికి వచ్చింది శంకరంగారికి. మరణశయ్య మీద ఉన్న పార్వతి, "నాకు అబ్బాయిని గురించిన చింతకన్న మీ చింతే బాధిస్తోంది. ఎటూ కాని వయస్సులో మిమ్మల్ని వదలి పోతున్నాను. కానీ భగవదిచ్ఛను కాదనలేం. తొందరగా అబ్బాయిని ఓ ఇంటివాణ్ని చేస్తే, కొడుకూ కోడల్ని చూస్తూంటే కొంతవరకు ఈ దెబ్బ నుంచి కోలుకుంటారు," అంటూ కళ్ళుమూసింది.

తల ఎత్తి చూసేసరికి అనూరాధ విశాల నయనాలు కనుపించాయి. పార్వతి చూపుల్లో ఉన్న తృప్తి అనూరాధ కండ్లలో లేదు. పైగా పంజరంలో చిక్కుకున్న పక్షి నిస్సహాయతా — కసాయివాని ముందు మేకపిల్లకున్న మొండిధైర్యము ఆ చూపుల్లో కనుపించింది. ఎటూకాని వయస్సని పార్వతి ఎందుకందో ఆయనకు అర్థమయింది. బ్రతికి ఉన్నన్నాళ్ళూ పార్వతి విలువయిన సలహాలే ఇచ్చింది. చనిపోతూ కూడా ఇచ్చింది. ఇంతలో లోనుండి రాజ్యలక్ష్మమ్మ మాటలలో ఒకటి రెండు శంకరంగారి చెవిని పడ్డాయి. ఈ సమయంలో తెలివిగా తప్పుకోవాలంటే పార్వతి సలహాయేరటు. అనుకున్న ఆయన, "బా వ గా రూ!" అని నరసింహంగార్ని పిలిచారు. శంకరంగారి పిలు

భుతో నరసింహంగారు వాకిట్లోకి రాజ్యలక్ష్మమ్మ తలుపుచాటుకు చేరుకున్నారు. అనూరాధ అక్కడినించే అతిజాగ్రత్తగా వినసాగింది.

"బావగారూ, పిల్లను చూశాను. అబ్బాయి కూడావచ్చి చూసుకుంటే నా అభ్యంతరమేమీలేదు. మీకు తెలిసే ఉంటుంది. అబ్బాయి ఈ సంవత్సరమే బి. ఏ. పరీక్షకు వెళ్ళాడు" అన్నారు అతిలౌక్యంగా శంకరంగారు.

రాజ్యలక్ష్మమ్మ గుండె కుదుటపడింది. కొడుక్కు పిల్లను చూసుకునేందుకు ఆయన వస్తే తొందరపడి ఎంతెంతమాటలన్నది తను! ఆ పెద్దమనిషి ఏమనుకున్నాడో ఏమో! ఇంతకూ ఈయనగారి మతిమరపు ననుకోవాలి అనుకుందావిడ.

శంకరంగారి మాటలతో నరసింహంగారికి పోయిన ప్రాణం వచ్చినట్లయింది. మళ్ళీ అంతలోనే బి. ఏ. చదివాడనీ, అబ్బాయనీ అంటున్నాడీయన కట్నమెంత అడుగుతాడో అనుకున్నాడాయన. "బాబూ! కట్నమదీ యిచ్చుకోలేననీ అటువంటి సంబంధము పంపమని వ్రాస్తే మూర్తి మిమ్మల్ని పంపుతున్నానని మీరేవరుడని వ్రాశాడు. ఇంతవరకు మీరే పెళ్ళికొడుకనుకున్నాం. మూర్తిపొరపడలేదుకదా?" అన్నాడు నరసింహంగారు చేతులు నలుపుకుంటూ.

నరసింహంగారిని చూస్తూంటే శంకరంగారి ముఖంలో జాలితోకూడిన చిన్నచిరునవ్వు పెదవులమీదకు వచ్చింది. అంతలోనే ఆయన ముఖంలో గాంభీర్యం ఆవరించింది. "నా దొంగతనం మీముందు బయటపడకూడదనుకున్నాను. ఇప్పుడు చెప్పక తప్పనిసరి అవుతోంది. మీ అనూరాధను చూసేవరకు మీరూ—మూర్తే—కాకుండా నేనుకూడా పెళ్ళికొడుకుననే అనుకున్నాను. రాజుగారి కిరీటంలో ఉండవలసిన అనర్ఘమణి నిరుపేద దగ్గర ఉంటే ఎంతశోభస్కరంగా ఉంటుందో అనూరాధ నా ప్రక్కనున్నా అంతేనని పించింది. ఆ సంగతి మీకూ—మూర్తికీ కూడా బాగా తెలుసు. అయినా కట్నమనే భూతానికి వెఱచి మనమల్ని ఎత్తేవయస్సులో ఉన్న నా ప్రక్కను అనూరాధలాంటి చక్కని చుక్కను నిలబెట్టేందుకు సంకోచించటములేదు. చిన్నపిల్లాడిలా నన్ను మాటలతో మభ్యపరచాలని చూశాడు మూర్తి. ఇది ఈనాటి మనదేశపు దౌర్భాగ్యం!— అదటా ఉంచండి. మహాలక్ష్మి వెరికోరి మా ఇంటికి వస్తానంటూంటే కాదనగల సామర్థ్యం నాలోలేదు. అందుకే ఆలక్ష్మిని కోడలుగా స్వీకరించాలనుకున్నాను. కట్నానికేముంది మా అబ్బాయికి మీ అమ్మాయే కట్నం! నామాటకు ఎదురుచెప్పక మా అబ్బాయికి పిల్లనిస్తాననిమాట ఇవ్వండి!" అన్నారు. నరసింహం దంపతులు నోటమాట రానంతగా స్తంభించిపోయారు. అనూరాధ ఆశ్చర్యానికి అంతేలేదు. బిడ్డకోసం మనువు మాట్లాడి తానుచేసుకుని ఆపైన ఆ వనితకు మాయనిమచ్చ తెచ్చిన రాజరాజనరేంద్రుని చరిత్రలోనూ, అట్లాంటివారినే ఇతరత్రానూ చూసింది. తను తనకోసం మాట్లాడుకోటానికి వచ్చి కొడుక్కు నిశ్చయించుకునేందుకు సిద్ధమయిన ఉదారుణ్ణి ఈ ఇరవయ్యో శతాబ్దంలో తన కళ్ళతో చూసి ఏమనగలదు! ఆయన ముందు తామంతా అల్పప్రాణులు అనుకుంటూన్న అనూరాధను తీసుకువెళ్ళేందుకు రాజ్యలక్ష్మమ్మ వచ్చింది.

తనకు కలిగిన ఆశ్చర్యంనుంచి తేరుకుని రాజ్యలక్ష్మమ్మ లోపలకు వెళ్ళగానే నరసింహంగారు శంకరంగారి రెండు చేతులూ పట్టుకుని "ఎంత చల్లనిమాట సెలవిచ్చారు. మిమ్మల్ని ఏ విధంగా అభినందించి మీ ఋణం తీర్చుకోగలనో అర్థం కావటములేదు" అన్నాడు గాద్గదికంగా.

అప్పుడే అనూరాధను తీసుకువస్తూన్న రాజ్యలక్ష్మమ్మ "ఉన్న పాపం చాలక మీ గొప్పమనస్సు తెలుసుకోలేని అల్పబుద్ధిని ఎన్నెన్నో మాటలన్నాను బాబూ దీనికి పరిహారమేమిటో" అంది తనలో తను అనుకున్నట్లు. అప్పుడే పాదాలకు వంగి నమస్కరిస్తూన్న అనూరాధను చూస్తూ "దానికి మీరు విచారించనక్కర్లేదు. మళ్ళీ సంవత్సరానికి ఈ ముసలాడితో ఆడుకునేందుకు పండులాంటి బిడ్డనిచ్చి అనూరాధ మీ ఇద్దరి ఋణాలు అవలీలగా తీర్చేస్తుంది. ఏమమ్మా అనూరాధా ఈ ముసలాడి ఆశ తీరుస్తావుకదూ!" అని శంకరంగారంటూంటె,

సిగ్గు-భక్తి పెనవేసుకున్న అనూరాధ తల ఎత్తి చూడలేక పోయింది. మరోవారానికి రామంవచ్చి తన అంగీకారాన్ని తెలిపి వెళ్ళాడు.

అనూరాధ అదృష్టాన్నే మార్చిన ఆనాటి సంఘటన ఇంతింతై-వటుడింతై, అన్నట్లుగా అనూరాధ మనస్సులో పెరిగి వేళ్ళు పారినదై. రామం మాంగల్యం కడుతూంటే, తలంబ్రాలు పోస్తూంటే, అతనితోపాటు చెయ్యి చెయ్యి కలుపుకుని అగ్నిహోత్రం చుట్టూ ప్రదక్షిణం చేస్తూంటే, అనూరాధ అదృష్టవంతురాలని నల్గురూ అంటూంటే, వాటిమాటున ఉన్నతంగా మహోన్నతంగా మూర్తీభవించిన మానవత్వములా ఉన్న శంకరంగారి వ్యక్తిత్వమే ఆ పందిరంతా వ్యాపించి ఆశీర్వదిస్తూన్నట్లే అనిపించి నతశిరస్క అయిన అనూరాధ ఆయన పరిపూర్ణ మానవుడు అనుకుంది. ★

# పూర్ణ యామిని

'ఝాన్సీ'



గోదావరి వడ్డున యిసుకలో కూర్చుని నిండు పున్నమిని చూస్తూవుంటే ఆ నదీతరంగాలలా యేవో జ్ఞాపకాలు మెదల సాగాయి. ఆ చందమామవంక అలా చూస్తుంటే నాకేవో మధురస్మృతులు జ్ఞాపకంరావడంపరిపాటి. అందుకే ముఖ్యంగా పున్నమి చంద్రుడంటే నాకెంతో యిష్టం. అసలు నాకే కాదు, అందరికీ ఆ వెన్నెలరేడంటే యిష్టం అనుకుంటా. అందువల్లే, ఆదికవులనుండీ ఆధునిక భావకవుల వరకూ అందరికీ ఆరాధ్య కవితా వస్తువయ్యాడు.

ఇప్పుడు అక్కయ్య రాజమండ్రిలో వుండడంవల్ల, తన పుణ్యమా అంటూ ఇన్నాళ్ళకు మళ్ళీ ఆ పావన గోదావరీతీరాన్ని కూర్చుని సెలకేరిని చూస్తూ గత స్మృతులను జ్ఞాపకం చేసికొనే అదృష్టం కలిగింది—

పదేళ్ళక్రిందటి మాట— నేను క్రొత్తగా కాలేజ్ లో చేరిన రోజులు. అవే నా జీవితంలో ఎంతో మధురమైనవి, ఎప్పుడూ జ్ఞాపకం వస్తూ నన్ను ఆనందాబ్ధిలో ముంచేవి. కాలేజ్ లో చేరినా, అప్పటికింకా మగ్గ మెరుగని పసిహృదయంలా వుండేది. ఎవరైనా మనస్సుకు నచ్చితే యిక వాళ్ళకి ప్రాణం యివ్వాలనిపించేది. అప్పట్లో ఆ స్నేహం తప్ప, ప్రపంచంలోని యింకేవిషయమూ నన్ను అంతగా ఆకర్షించేది గాదు. నేను ఎప్పుడూ చిందులు వేస్తూ చలాకీగా తిరిగేదాన్నని మా క్లాసులో అంతా నేనంటే చాలా యిష్టపడేవారు. నేనుకూడా అందరితోనూ స్నేహంగావుండే దాన్ని. కాని అందరిలోనూ నా మనస్సును ఎక్కువగా ఆకర్షించినది పూర్ణ. పూర్ణ చాలా మంచి అమ్మాయి. సాధారణంగా తన చదువువిషయం తప్ప మిగిలినవేవీ అంతగా పట్టించుకొనేది కాదు. అయినా క్లాసులో అందరితోనూ స్నేహంగానే వుండేది. క్లాసులో ఎప్పుడూ తనదే ఫస్టుమార్కయినా, యీషణ్మాత్రం గర్వం లేకుండా అందరితోనూ సమానంగా ప్రవర్తించేది. అందుకే క్లాసులో అందరికీ తనంటే యిష్టం. నాకు మాత్రం పూర్ణ అంటే యిష్టమే కాక భావమూ, భావానికి అందని ఆప్తేకుగా వుండేది. తను నాకు పూర్వజన్మలో ఎంతో సన్నిహితురాలై వుండాలి. లేకపోతే నాకు ఎందుకు తనమీద అంత మమకారం అనిపించేది నాకప్పుడు. పూర్ణతోడిదే లోకమన్నట్లు వుండే దానిని నేను. నా అదృష్టం, పూర్ణ కూడా నేనంటే యిష్టంగా వుండేటందువల్ల మా స్నేహలత చిగిర్చి పుష్పించడానికి ఏమీ అడ్డు లేకపోయింది. రాను రాను తనని తప్ప మిగిలినవాళ్లెవరినీ అంతగా లక్ష్యపెట్టే దానిని కాదు నేను.

మా క్లాసులో యామిని అని ఒకఅమ్మాయి వుండేది. కాని అసలు తను క్లాసులో వున్నట్లే ఎవ్వరికీ తెల్సేది కాదు. అంత నెమ్మదిగా వుండేది. అందువల్ల నేనసలు

తనగురించి పట్టించుకోకుండా, తనంటే చాలా నిర్లక్ష్యంగా వుండేదానిని. కాని యామినిమాత్రం నన్నెప్పుడూ ఏదో విధంగా పల్కరించడానికి ప్రయత్నించేది. నాకు యిష్టమైతే తనకు సమాధానం చెప్పేదాన్ని లేకపోతే మాట్లాడకుండా వెళ్ళిపోయేదాన్ని. నేను తనకు నవ్వుతూ జవాబివ్వకపోతే, పాపం తన మొహం ముకుళించుకుపోయేది. యామిని సహజంగా అందంగా వుండేది వికసించిన కుసుమంలా. కాని నేను పెడసరంగా జవాబు చెప్పినప్పుడు మాత్రం ఎవరికైనా జాలికొల్పేటంతగా మారిపోయేది తన మొహం. అయినా నేను మాత్రం ఏమీ పట్టించుకోకుండా వెళ్ళి పోయే దాన్ని. క్లాసుల్లో ఎప్పుడూ నన్ను బ్రతిమాలి నా రూమ్‌లోనో, నా రూమ్ ఎదురుగా వరండాలోనో కూర్చునేది యామిని చదువుకోవడానికని. నే నెప్పుడైనా చదువుకుంటూ మధ్యలో తన మొహం చూస్తే తను నా మొహమే చూస్తూ కన్పించేది. అసలు చదువుతున్నట్లే వుండేదికాదు. కాని తను అట్లా నా మొహం చూస్తూ కూర్చున్నంతసేపు ఎంతో ఆనందంగా కన్పించేది. కాని తను అట్లా ఎందుకుంటుందో నే నెప్పుడూ ఆలోచించడానికి ప్రయత్నించలేదు. నాకెప్పుడూ పూర్ణ గురించి ఆలోచనలతోటే సరిపోయేది. అందువల్ల యామిని నాతో ఎంత సన్నిహితంగా వుండాలని ప్రయత్నించినా, నా ముభావం తనని నాకు దగ్గర చెయ్యలేకపోయింది. ఆ విచారం తన మొహంలో స్పష్టంగా కన్పించేది కాని నేను లెక్కచేసేదాన్ని కాదు.

ఒకసారి నేను పూర్ణ ఫోటో తీసుకుని, నాది తన కిచ్చాను. ఎప్పటినుండో యామిని నా ఫోటో అడగాలనుకునేది గాబోలు, కాని నాదగ్గరనుండి ఎటువంటి సమాధానం వస్తుందోనని భయపడి అడగలేదనుకుంటా. నేను పూర్ణకి యిచ్చానుకదా, తనకి కూడా యివ్వకపోతానా అని చివరకు ధైర్యం చేసి నన్ను అడిగింది. అప్పటికి నా దగ్గర ఒకటే ఫోటో వుంది. బాగా నవ్వుతూ వున్నానందులో. నా కసలు తనకి ఫోటో యివ్వడం యిష్టం లేనందువల్ల అది బావుండలేదని వంక పెట్టి తరువాత వేరేదైనా యిస్తాలే అని చెప్పాను. కానీ అందులో నువ్వు నేచురల్ గా వున్నావు. నా కదేకావాలని పట్టు పట్టింది యామిని. తన మొండిపట్టు చూసి నాకు చాలా కోపం వచ్చింది. కాని పాపం యామినికి ఎంత యిదిగా వుండేదో తన దగ్గర నా ఫోటో వుంచుకోవాలని, అంతవరకూ చేతిలో వుంచుకుని చూస్తూవున్న నాఫోటో తీసుకుని, చిన్న పిల్లలా క్రిందకు పారిపోయింది. నేను కోపంతో తన వెనకాలే పరుగెట్టాను. మేడ అంతా తిప్పింది కాని, తను నా చేతికి దొరకలేదు. నేను వుడుకుమొత్తనంతో నా రూమ్‌కు వచ్చి తలుపు వేసుకుని కూర్చున్నాను. తరువాత వచ్చి ఎంతో బ్రతిమాలింది యామిని తలుపు తియ్యమని. కాని తను ఫోటో తిరిగి యివ్వడానికి మాత్రం ఒప్పుకోలేదు. ఆ రోజంతా నన్ను మామూలుగా నవ్వించడానికి ఎన్నో ఎత్తులు వేసింది.

నేను సాధారణంగా అందరితోనూ ఎంతో చనువుగా వుంటూ, యామిని విషయంలో మాత్రం తను నాస్నేహాన్ని ఎంతగానో కాంక్షిస్తున్నా కూడా, నేను తనంటే ఎందుకంత నిర్లక్ష్యంగా వుండేదాననో అర్థం కాదు. నేను కోపంవచ్చి తనతో మాట్లాడకపోయినప్పుడల్లా, పాపం తనెంతో జాలిగా చూస్తూ, నేనెంత కసరికొట్టినా సరే అస్తమానూ నా వెనుకే తిరుగుతూ వుండేది. తనకి నేనంటే ఎందుకంత యిష్టం? తనని అంతగా ఆకర్షించడానికి నాలో ఏం వుంది? అని ఎంత ఆలోచించినా జవాబు దొరకలేదు. కాని నాకు పూర్ణ అంటే ఎందుకిష్టమో? నన్ను తను ఎందుకంతగా ఆకర్షించిందో ఆలోచిస్తే నా ప్రశ్నకి జవాబు దొరికి వుండేది. కాని అప్పుడు యామినిని అర్థంచేసికొనడానికి ప్రయత్నించేదానిని కాదసలు. అందువల్ల తను ఎంతో వుత్సాహంగా నాతో కబుర్లు చెప్పబోతే నేను విసుగ్గా మొహంపెట్టి వెళ్ళిపోయేదానిని. పాపం, నా నిర్లక్ష్యానికి యామినిమనస్సు ఎంత బాధపడేదో. అప్పటికీ తను నన్ను విడచివుండేది కాదు.

ఒకసారి పూర్ణ వరుసగా పది రోజులు కాలేజ్‌కు రాలేదు. క్లాసులో ఏమీ తోచేదికాదు తను లేనందువల్ల. తరువాత కబురుచేసింది పూర్ణ తనకు 'ఫ్లూ' వచ్చిందని. తనకు త్వరగా తగ్గిపోవాలని ప్రార్థించుకుంటూ, ఆ పది రోజులూ దినమొక యుగంగా గడిపాను. నేను డల్ గా వున్నందువల్ల యామిని కూడా అదోమాదిరి వుండేది నన్ను ఎంతో సానుభూతితో చూస్తూ. పూర్ణ మళ్ళీ కాలేజ్‌కి రావడం మొదలుపెట్టాక, రోజులు ఎప్పటిలాగే - పూర్ణ యెడల అనురాగమూ, యామిని యెడల నిర్లక్ష్యమూ పెరుగుతూ, గడచిపోయాయి.

ఒక రోజు పూర్ణను కాలేజ్ గేటువరకూ సాగనంపి వచ్చేస్తున్నాను. రోజూ సాయంత్రం తనను అట్లా సాగనంపడం నా వెనకనే యామిని కూడా అనుసరించి రావడం, నేను తనని పల్కరించకుండా తిన్నగా "మెస్"కి వెళ్ళడం అలవాటు. ఎప్పటిలాగే సంతోషంతో గంతులువేస్తూ, చూసుకోకుండా క్రింద గొప్పు తగిలి పడిపోయాను. అప్పుడు మా కాలేజ్ స్విమ్మింగ్ పూల్ చుట్టూ ఫెన్సింగ్ వేస్తున్నారు. నేను వెళ్ళి యినుపతీగలు గుచ్చివున్న ఆ సిమ్మెంట్ స్తంభాలమీద పడ్డాను. వెంటనే నా వెనకనే వస్తున్న యామిని భయంతో అరిచి నా వేపుకు పరుగెత్తడం మాత్రం నాకు తెల్సు. తరువాత ఏం జరిగిందో నాకు తెలియలేదు. నాకు మెల్లగా మెలకువ వచ్చేసరికి ఏవో మాటలు వినబడుతున్నాయి, కాని కళ్ళు తెరచి చూడలేకపోయాను. ఆ వాతావరణాన్ని బట్టి, నేను హాస్పటల్‌లో బెడ్ మీద వున్నానని వూహించుకున్నాను. ఇంతలో నాకు చిరపరిచితమైన మా వార్డెను గొంతు, డాక్టరుతో మాట్లాడుతూ వినిపించడంచేత కదలకుండా పడుకుని వినసాగాను. వాళ్ళమాటలు పూర్తయ్యేసరికి నా మత్తు పూర్తిగా వదిలిపోయింది. వాళ్ళ కబుర్ల సారాంశం యిది: నేను క్రింద పడడంలో యినుపవూచ నా నుదుటిమీద గుచ్చుకొని, చాలా రక్తం కారిపోయినందువల్ల నేను స్పృహ తప్పి పడిపోయానట. నా వెనకనే వున్న యామిని వెంటనే వెళ్ళి మా వార్డెనుతో చెప్పి, టాక్సీ పిలిపించి, దగ్గరలోనున్న ఆ హాస్పిటల్‌కు తీసుకు వచ్చిందట. డాక్టరుగారు పరీక్షచేసి, చాలా రక్తం పోయినందువల్ల రక్తం ఎక్కించాలని చెప్పారు. కాని బ్లడ్ కోసం బ్లడ్ బాంకుకు పంపాలన్నారట ఆ హాస్పటల్‌లో అప్పుడు రక్తం లేనందువల్ల. కాని యామిని నాకింకా స్పృహ రాకపోవడంచూసి, బ్లడ్ తెచ్చేసరికి ఆలస్యం అవుతుందేమోనన్న భయంతో తన రక్తం నాకు సరిపోతుందేమో పరీక్షచేసి తీసుకోమందిట. డాక్టరుగారు యామిని కంగారుచూసి నేను తనకేమవుతానని అడిగారట. అప్పుడు యామిని ఏడుపుమొహంపెట్టి "డాక్టరుగారూ! ముందు నా ప్రాణం అయినాసరే తీసుకుని యీ అమ్మాయిని కాపాడండి. మా బాంధవ్యం మీకు చెబితే అర్థం అయ్యేదికాదు. ముందుగా నా రక్తం తీసుకోండి" అని ఆవిడని బ్రతిమాలిందిట.

(38-వ పేజీ చూడండి)

డాక్టరు— ఏమిటోయ్ ఇది ఆశ్చర్యంగా ఉందే! నీ బరువు నిన్న 120 పౌన్లు. ఈవేళ 110 పౌన్లు ఉందే, మరి?

రోగి—నిన్న అన్నం తిని వచ్చానండి.

—రాయప్రోలు బ్రహ్మానందశాస్త్రి (బందరు).

# హరివంశము

## సభా పర్వము - 5

వ తా ఉర్వ్యా రేణుకణాన్ అత్నుతే
వ సంస్కృత త్రమువయ స్త్రి తా అతి
ఉరుగాయముభయం తస్య తా అను
గావో ము_ర్తస్య విచర ని యజ్వనః.

త్రైవామన మన్వంతరంలో ఒకప్పుడు విష్ణువు వినుగురుయొక్క దీనమైన కూయిని విని దాన్ని రక్షించేందుకు వైకుంఠంలో వారికి ఎవ్వరికీ చెప్పకుండా గూడా పరుగుపెట్టుకు వచ్చినట్లు కథలు వున్నాయి. అవి ఎంతవరకు నిజమో చెప్పలేము గాని, ఇప్పుడు ఈ వైవస్వత మన్వంతరంలో ద్వాపరయుగంలో బృందావనంలోని వ్రేపల్లెలో నివశిస్తున్న గోగోపగోపాలికా నివహాలు కేశిరాక్షసుని ఉద్ధత విజృంభణాన్ని భరించలేక పెట్టినకూయి, మిథిలలో నీలను స్వయంవరం అవుతున్న శ్రీకృష్ణదేవునికి విన్పించి కాబోలు, అది విన్పించిన వెంటనే రెక్కలు కట్టుకొని బృందావనం వచ్చినట్లు, శ్రీకృష్ణదేవుడు యమునవడ్డున వ్రాలినాడు. బంధువులు అందరితో కలిసి, పాటబళ్ళమై, ఆయన వచ్చి వ్రాలినాడు. ముందు బండిలో శ్రీకృష్ణుడు, బలరాముడు, శ్రీధాముడు మొదలైన కొందరు కూర్చుని వున్నారు. ఆవెనుక బండిలో నీల, యశోద, రోహిణీదేవి మొదలైనవారు వున్నారు. ఆవెనుక నీలకు కుంభుడు అరణముగా నిచ్చిన ధనకనక వస్తువాహనముల బండ్లు; పశువులు; ఆవెనుక నందుని పాటబండి. ఈ అరణములను, ఈ పశువులను చూచికొనగా, నందునికి మిథిలలో తనకు, కుంభునికి జరిగిన సంభాషణ ఒక్కడు దారిపొడుగునా మనస్సులో ఆడుతూనేవుంది. సప్తవృషభహననం అయిన తర్వాత కుంభుడు పిల్లను తీసుకువచ్చి శ్రీకృష్ణునకుగా తన చేతుల్లో పెట్టాడు. పెట్టి ఇట్లా అన్నాడు. "బావా! మీ అబ్బాయి సామాన్యుడు కాదు. అప్రతర్క్యమైన మహనీయ భుజావిభవం కలవాడు. అతని శౌర్య కలసంపుపేర్మి మాకు సమ్మదం చేకూర్చింది. అశేషకులాన్వితంగా మాశోకాన్ని తొలగబెట్టింది. మమ్మల్ని మనిచింది. నీ పుత్రుని అద్భుత భుజావిక్రమంవల్ల అస్తోకమైన విభూతిని పొందినవాణ్ణి అయినాను. ఇప్పుడు నీకుమారుని యశోగరిమమే ఎల్ల దిక్కులలోను పేర్చి పెక్కు మిగులుతున్నది. అతనికి నేను ఏమి ఇచ్చి ఋణం తీర్చుకోగలను! వేలు పదివేలు లక్షలు నీలకు అరణంగా నీయింటికి మేలైన గోవులను ఇస్తాను. ఇవి ఎందుకు అనకు. నా అభీష్టం అట్లా వుంది". నందునికి నవ్వువచ్చింది. మంచి వ్యవహర్తవుపోలి యశోద తమ్ముడు తనతో మాట్లాడుతున్నాడు. నందుడు తానూ తక్కువ వ్యవహర్తను కాదనుకున్నాడు. అనుకొని ఇట్లా అన్నాడు: "ఏమోయి! కుంభ! మాకుగూడా కొలంది యిడరాని పని వుంది. అపరిమిత మహిష్య జాలికములు వున్నాయి. మా తండ్రి జన్మించింది మొదలుగా గోవులు ప్రతిసంవత్సరము ప్రసూతలై కోడెలను పెడుతున్నాయి. పాలు ఎంతపితికామో, అంతా వెన్న అవుతోంది. ఇవిగాక మాకు అరణ్యాలు వుండనేవున్నాయి. మధువు పంటలను ఒడిగిస్తూ వుంటాయి. అయినా, మాకు కొదుగడా నీ యీ అరణం. నీకూతునకు ఇచ్చుకుంటున్నావు. సరే! నీ చేసినపని మాకునచ్చింది." అప్పుడు రోహిణీదేవి నవ్వులుగా "నందయ్యా! నీలి" ఇచ్చిన అరణం నీకు నచ్చడం యేమిటి! అయినా ఈ పశువుల అరణం ఏమిటి?" "అన్నది. కుంభుడు వెంటనే అన్నాడు: "తల్లీ! మీ ఆజ్ఞ కావాలిగాని, నా తల్లికి ధనకనక వస్తువాహనాలలో ఏ కొరత వాటిల్లనీయను." అట్లా జరిగినమాటలుగా మిథిలలో వారు బయలుదేరారు. శ్రీకృష్ణుడు శ్రీధాముణ్ణి గూడా తనతో రమ్మన్నాడు. వాడికి అంతకంటే కావలసింది లేదు. అంతా బయలుదేరుతూ వుండగా ధర్మద, రోహిణీదేవితో "తల్లీ! మా తల్లిని మీరు వేయికళ్ళతో కాపాడుతూ వుండాలి" అన్నది. "అది యేమే! దానికి యశోద అత్తగారు. అది దీనిని, ఇది దానిని కాపాడుకుంటూ వుండాలి. మధ్య నే నెవరుకను" అని రోహిణి యశోద వంక చూచి నవ్వింది. యశోదకు ఆనందంతో పిచ్చలిస్తోంది. "అది అత్తగారి ఛాయ అంతే" అన్నది రోహిణి. అంతా నవ్వుకున్నారు. బళ్ళు కదులుతూవుండగా రోహిణిదేవి ధర్మదతో అన్నది: "ధర్మీ! నీలను ఒకరు చూడవలసింది యేమిటి! దాన్ని అదే చూచుకుంటుంది. అసలు అందర్నీ చూడవలసింది అది" అన్నది. ఆ తర్వాత బళ్ళు బయలు దేరాయి. నందుడు మిథిలనుండి, ఇక్కడికి చేరేదాకా ఆమాటల అర్థం యేమా అని ఆలోచించాడు. కాని ఆ అర్థం యేమో తనకు బోధపడలేదు. రోహిణీదేవిని అడిగి అతను తెలిసికోనూలేదు.

మిథిలనుండి బృందావనం వరకు ప్రయాణం ఎంతో ఉల్లాసంగా సాగింది. నీలతోడి మాటలుగా, నీలతోడి పాటలుగా, నీలతోడి ఆటలుగా శ్రీకృష్ణదేవుడు ప్రయాణం సాగించాడు. బళ్ళు బృందావనంలో ప్రవేశించాయి. అందరిలో ఆ ఉల్లాసం పోయింది. సంతోషం తొలగింది. బృందావనం అంతా నానా పాడుగాను వుంది. మనుష్య సంచారం లేదు. పశువు కన్పించడంలేదు. వనం అంతటా పశు కంకాళాలు, మనుష్య కంకాళాలతో నిండివుంది. ఇది యేమిటి? ఇట్లా ఎందుకైంది - అని అందరు అనుకుంటూ వుండగా, దూరంనుంచి, ఘోషంనుంచి "కృష్ణా! నువ్వు ఎక్కడ! నీవు ఊరలేక మేము దిక్కులేని వాళ్ళంఅయిపోయి నాము. ఇది యేదో మాయగుఱ్ఱము మమ్మల్ని భక్షిస్తోంది" అన్న జన ఘోష విన్పించీ విన్పించనిదై, ఏదో రోదనంగా వారి చెవులకు తాకింది. ఆ రోదనం విన్పించి బళ్ళు తొందరగా నడిచాయి. కృష్ణుని బండీ "అహామేహోలు"గా ముందుకు దూకుతోంది. అది ఎంత ఇదిగా నడిస్తే, తక్కినబళ్ళుగూడా అంతవేగంతోనూ నడుస్తున్నాయి. ముందుకు వస్తున్నకొద్ది ఘోషం మీద పడుతూ కేశిదానవుడు హయరూపధారియై చేస్తున్న హేషితాలు ఘోరంగా వినవస్తున్నవి. అంతకన్నా ఘోరంగా, దీనంగా, హృదయాన్ని ద్రవింప





చేస్తూ గోగోపగోపాలికా జనవిలాపం వినవస్తున్నది. కృష్ణుడు అప్పుడు ఏమిచేస్తాడో, ఏమి చేయవలెనని అనుకుంటున్నాడో, ఆ బండ్లలోవున్న ఎవ్వరికి అర్థంకాలేదు. కృష్ణుడు హఠాత్తుగా బండ్లను ఆపమన్నాడు. బండ్లు అన్నీ ఆగినాయి. నందుడు మొదలైన గోప వృద్ధులు అతణ్ణి దరిసి ఏమిచేస్తాడా అని నిలబడి చూస్తున్నారు. కృష్ణునకు వారిసంగతి పట్టినట్లే లేదు. "కృష్ణా! వీడెవడో వాజి దానవుడు మామీద చెలరేగుతున్నాడు. నీవు మిథిలనుంచి ఎప్పుడు వచ్చి ఎప్పుడు మమ్మల్ని రక్షిస్తావు?" అంటూ వాయుతరంగాల మీదుగా తేలి వస్తూవున్న వల్లవజనుల దీనమైన కూయిమాత్రం అతని చెవులకు తాకుతున్నది. ఆ కూయిని వింటూ శ్రీకృష్ణదేవుడు విచిత్రమైన సింహనాదం చేశాడు. అది వాయుతరంగ ఘట్టనంగా, సాగి సాగి ఘోషంలో మేఘ నిర్ఘోషాన్ని పోలి విన్పించింది. కేశి చెవులను అశనిపాతాన్ని పోలి తాకింది. అంతవరకు నానా ఆగడము చేస్తున్న ఘోటక రక్షస్సు, ఒక్కసారిగా ఆగిపోయినాడు. ఆగి ఒక్క క్షణం చెవులురిక్కించి, మోఱ పైకి ఎత్తి, ఆధ్వని యేమా అని విన్నాడు. ఆ ధ్వని విచిత్రమై, ఒక మహావీరుడు, ఇంకో మహావీరుణ్ణి ఏకాంగి యుద్ధానికి ఆహ్వానిస్తున్నట్లు ఆ రక్షస్సుకు వినిపిస్తున్నది. వాడు పొంగిపోయినాడు. తన జీవితంలో ఏ వీరునితో పోరాటాన్ని వాంఛించి బ్రతుకుతూవచ్చాడో, ఆ వీరునితో ఇప్పుడు తనకు పోరు లభిస్తున్నదని వాడు పొంగి చెంగలించాడు. చెంగలించి, ప్రళయార్కుణ్ణి కబళింప బోయే రాహుమండలాన్ని పోలి సంరంభం చూపిస్తూ, అధిక ప్రచండమైన వక్త్రాన్ని విచ్చి విచిత్రహేషలు చేస్తూ, వాడు శ్రీకృష్ణుని సింహనాదాన్ని అంటి, అది వస్తున్న దెసకు తురంగలించాడు. రాగా ఎదురుగా నీలమేఘశ్యాముడైన బాలుడు ఉద్దాముడై, ముఖమున చిరునవ్వు తలుకొత్తుతూ, నిర్భీకుడై నిలబడి వున్నాడు. అతణ్ణి చూడగా కేశికి మనస్సులో మెప్పుదల తోచింది. అంతఃకరణంలో ఎక్కడో అతనితో తన పూర్వపు వైరంసంగతి వాసనలు గుబాళించాయి. అతని చేతిలో అప్పుడు తన ఓటమి సంగతి జ్ఞాపకంవచ్చింది. భయమో, అవహేళనమో, తెగింపో తెలియని విధంగా కేశి విచిత్రంగా సకిలించాడు. శ్రీకృష్ణదేవునికి వాని వాలకము చూడగా నవ్వువచ్చింది. వీణ్ణి ఈ సారిగూడా నిరాయుధుడనయ్యే సంహరిస్తాను అని ఆయన అనుకున్నంతలో వెనుకనుండి "తండ్రీ" అన్న పిలుపు వినవచ్చింది. శ్రీకృష్ణదేవుడు అటు తిరిగి చూడగా రోహిణీదేవి తన వున్న యెడకు ద్రుతగమనంగా వస్తున్నది. ఇది ఏమా అని ఆయన మనస్సులో అనుకున్నాడు. అంతలో ఆవిడ దగ్గరకు వచ్చింది. ఇట్లా అన్నది: "తండ్రీ! వీడెవరో నీకు తెలుసా! వీడు కేశి. కేవలం తురగం కాడు. కంసునికి వీడు బహిఃప్రాణం. దేవతలకు గూడా అవధ్యుడు. సర్వభూతాలు వీణ్ణి చూచి త్రాసం చెందుతూ వుంటాయి. వీడు పాపకర్ములలో ప్రథముడు. వీనితో మొనలేర్చి నిల్చి పలువురు జనపాలురు సమరానికి కాక నివృత్తులయిన సందర్భాలు గూడా వున్నాయి. నీవు తొందరపడక వీడితో వెరవుతో పోరాటం సాగించవలసి వుంటుంది సుమా!"

కృష్ణుడు ఏమీ అనలేదు. ఒయ్యన నవ్వి ఆమెవంక చూచాడు. ఆ చూపులలో ఏమివున్నదో, ఆమె చకితయై, తిరిగి పోయింది. ఆమె తిరిగి పోయినంతలో కేశి రెచ్చిపోయినాడు. సకల వల్లవులు సంభ్రాంతులై చూడగా శ్రీకృష్ణునిమీద బలియుడై కవిశాడు. శ్రీకృష్ణుడుగూడా వానితో తలపడడానికి సిద్ధంగావున్నవాడవడంచేత సవ్య దక్షిణ పరిభ్రమణాలుగా మెరుస్తూ, అశ్లేశంలో కేశి ఆ ధాటిని తట్టుకొని తప్పించుకోగల్గాడు. కేశికి అది అపశకునంగా తోచింది. మొదటి దెబ్బరయే వట్టిపో[illegible]. ఆ భావం రాగా వాడు క్రోధ సంఘూర్ణితుడైపోయినాడు. ఇరుదెసల మొగము మురియిస్తూ, గొరిజలతో భూమి అదురువగా తాడిస్తూ, కెట్టిదంగా అడరి,

# హరివంశం

ముందరికాళ్లు రెండు ఎత్తి, శ్రీ కృష్ణదేవుని వక్షస్థలాన్ని త్రొక్కాలని నిక్కి చూపించాడు. ఆ తాపును గూడా శ్రీకృష్ణుడు ఒడుపుతో తప్పించుకున్నాడు. రజసావృతమైన ఫేనం వాడి నోటి వెంట వర్షాన్ని పోలి కురిసింది. హిమకాలంలో మంచువానలువచ్చి పూర్ణ చంద్రుణ్ణి ముంచిన విధంగా ఆ ఫేనపు వెల్లువ శ్రీ కృష్ణదేవుని ముఖాన్ని ముంచివేసింది. అరవిందాక్షుడైన శ్రీ కృష్ణదేవుడు హయ దానవ ముఖోద్గీర్ణమైన ఫేన పాతంలోను, హేషితోద్గారి శీకరాల లోను హేమంత చంద్రముణ్ణి పోలి ప్రకాశించాడు. కేశి కేశఘనావృతస్కంధుడు. లంబ సటాజాలంతో విరాజిల్లుతున్న ముఖం కలవాడు. ప్రళయాగ్ని కీలలవంటి దంతములు గలవాడు. వాడు ఇప్పుడు అతి రూక్షమైన ఈక్షణాలతో శ్రీకృష్ణదేవుణ్ణి చూచి, ఖురతాడనం చేత భూమి రజాన్ని గోపుతూ త్రుళ్లి పెల్లురేగి, ముందరికాళ్ళతో మొత్తబోయి, తప్పకోగా పిచ్చియెత్తి, వెనుక కాళ్ళతో తన్నబోయి, చెదిరిపోగా బెదురుపొంది, నోటితో కరవబోయి, చెళ్లున దెబ్బ తగులగా రిల్లపోయి, డిల్లపడిన జీవి పోయి నిస్పృహాలో పడి, నిస్పృహాలోనుండి క్రోధంతో తేరుకొని, తిరిగి తిరిగి, విజృంభిస్తున్నాడు. ఇప్పుడు వానికి మిగిలిన ఆయుధాలు పళ్లువినా మరి యేమీ లేవు. అన్నీ వృథా అయినాయి. అందువల్ల వాడు కృష్ణునితో కలియబడి మెడతో బిట్టురాస్తూ, పళ్ళతో అదమి పట్టుకోవాలని ప్రయత్నంచేశాడు. ఆ రాపిడిలో మేఘాల్లో సూర్యుణ్ణిపోలి ప్రకాశించాడు. వాని ఆ విజృంభణాన్ని శ్రీకృష్ణుడు మెచ్చుకున్నాడు. మెచ్చుకొని వాణ్ణి వధించడానికి నిశ్చయించుకున్నాడు.

కేశి వక్త్రం ఘోరంగా ఉంది. దంష్ట్రిలు తీక్ష్ణంగా వున్నాయి. ఆ నోరు తెరిచి, ఆ దంతాలు ఆయుధాలుగా వాడు శ్రీ కృష్ణుని బాహుశిఖరాన్ని అదమి పట్టుకున్నాడు. ఆ తర్వాత ఏమి జరిగిందో కేశికి తెలియలేదు. తెలిసేసరికి వాడు లేదు. కేశి ఏక్షణంలో తన బాహుశిఖరాన్ని దంష్ట్రిలతో నిక్కపట్టాడో, అప్పుడు శ్రీకృష్ణుని బాహువు ఒక్కడు కాలాహిపోలి ఆభోగంగా లేచి, వాని ముఖంలో ప్రవేశించింది. శ్రీకృష్ణుని విక్రమం అంటే ఏమిటో ఘోటకరక్కసునకు అప్పుడు అర్థమైంది. కాని ఏమి లాభం! ఆ చేతిని కొరికివేద్దామని, భక్షించివేద్దామని కేశి ముందు అనుకున్నాడు. లాభంలేకపోయింది. వాడు అందుకు అశక్తుడైపోయినాడు. వాడి దంతాలు మూల నిర్ముక్తంగా రాలిపోతున్నాయి. నోటివెంట నెత్తురు ధారాపాతంగా జారిపడుతున్నది. నురువులతో కలిసి వమనాన్ని పోలి ఏకధారగా ప్రవహిస్తున్నది. వాడి పెదిమలు విపాటితములై పోతున్నాయి. కటములు విదలీకృతములై పోతున్నాయి. నేత్రాలు వికృతాలవుతున్నాయి. కనుగుంటల్లోనుండి దొర్లి ఆ నేత్రాలు ఇవతలపడుతున్నాయా అనిపిస్తున్నది. అప్పుడు వాడు నిరస్తహనురావిష్టుడు, శోణితాక్తవిలోచనుడు అయినాడు. ఉత్కర్ణుడు, నష్టచేతస్కుడు అయిపోయినాడు. కాళ్ళు గిలగిలా కొట్టుకున్నాయి. శకృన్మూత్రాలు అధికమైనాయి. ఖిన్నాంగరోముడు, శ్రాంతుడు, నిర్యత్నచరణుడు అయిపోయినాడు కేశి. కేశి వక్త్రవిలగ్నమైన శ్రీ కృష్ణదేవుని బాహువు చంద్రార్కకిరణముల చేత ఘర్మాంతసమయంలో వ్యాభుగ్నమైన మేఘాన్ని పోలి ఒప్పుమిగిలింది. శ్రీ కృష్ణసంసక్తుడైన కేశి శాంతగాత్రుడై, శ్రాంతుడై, ప్రభాతావనతుడైన చంద్రుడు మేరువును ఆశ్రయించినట్లు కన్పించాడు. శ్రీకృష్ణబాహు నిష్పిష్టములయిన కేశిదశనములు శరత్కాలంలో నిస్తోయాలయిన మేఘాలయొక్క అవయవాలనుపోలి జారిపడ్డాయి. దామోదరుని దోర్దండం దండధరుని దండాన్ని పోలి కేశి సర్వశరీరాన్ని నానాబీభత్సం చేసి వేసింది. ఆచేయి పూరికే పెరిగిపోయింది. వాడి జిహ్వను పెరికింది. పళ్లు రాల్చింది. తాలువులు సెలసింది. కంఠనాళాన్ని తెరిపిచేసింది. అధరాన్ని వ్రచ్చింది. ఉదరాన్ని కలచింది. ప్రేవులు చిదిమింది. జీవుణ్ణి కదలించింది. శౌర్యశిల్పాన్ని రూపిస్తూ, క్రకచాన్ని పోలి వాని శరీరాన్ని రెండుగా చీల్చివేసింది. ప్రాణావసానసమయంలో కేశి అతి భయంకరమైన హేషితం చేశాడు. వాడి శరీరం రెండుగా నరుకబడిన పర్వతాన్ని పోలి విడిలిపోయింది. మహారౌద్రుడైన వాడు, ఆ కేశి, ఏనుగులొండంచేత విలీకృతం చేయబడిన కదళీవృక్షంలాగా నేల కూలినాడు. శ్రీ కృష్ణబాహుచేతకృత్తదేహుడై, పరమశివుడు పినాకంతో కూల్చిన పశువునుపోలి, ద్విపాద పృష్ఠపుచ్ఛార్ధంగా, శ్రవణైకాక్షి నాసికంగా, ఇటుసగం అటు సగంగా, ద్విధాభూత శరీరుడై నేల కూలాడు. కేశిదంతములయొక్క నొక్కులతో శ్రీ కృష్ణదేవుని భుజం గజేంద్ర దశనాంకితమైన వృక్షసాలాన్ని పోలి కన్పించింది.

ఇట్లా కేశివధ జరిగింది. 



# జీవనగంగ



పురాణం సూర్యప్రకాశరావు

(గతివారం తరువాయి)

## 31

ఈ వారంలోనూ మల్లిబాబు ఆరోగ్యం చాలావరకు కోలుకుంది. దెబ్బలు చాలావరకూ మానిపోయాయి. అతనిలో కొద్దికొద్దిగా బలం పుంజుకోసాగింది. మామూలుగా కాకపోయినా కొన్ని పదార్థాలు మినహాయించి ఆహారం పుచ్చుకుంటున్నాడు. కాస్త ఆ వీధి చివరివరకు సాయంత్రంపూట షికారుకి వెళ్ళుతున్నాడు.

ఆవాళ ఆదివారం. మల్లిబాబు ఓ మనిషి కోసం ఎదురుచూస్తు కూర్చున్నాడు. లక్ష్మణరావు ఇంట్లోనే ఉన్నాడు. రామచంద్రం పక్క చేరిన దువ్వెన్నను బాగు చేసుకుంటున్నాడు.

కృష్ణారావు ముసలితండ్రిని వెంటబెట్టుకుని రెండుగంటలకు వచ్చాడు.

లక్ష్మణరావు వాళ్ళను లోపలికి తీసుకొచ్చి చాపలుపరిచి కూర్చోబెట్టి, లోపల మందు పుచ్చుకుంటున్న మల్లిబాబుతో "తమ్ముడూ మీ తాత వచ్చాడు" అన్నాడు.

మల్లిబాబు వచ్చి "బాగున్నావా తాతా" అని కుశలం అడిగి తాతపక్కగా కూర్చుంటు "కృష్ణకు పెళ్లి చెయ్యవా తాతా?" అన్నాడు.

లక్ష్మణరావు అందుకుని "అదేమిటి తమ్ముడూ. ఎందుకు చెయ్యడు. అదేం ప్రశ్న?" అన్నాడు.

తాత బోసిగా నవ్వుతూ "చెయ్యాలనే ఉంది బాబూ." అన్నాడు. యువకుడు సిగ్గు పడుతున్నాడు. అతను తలవంచుకుని చాపమీద గీతలు గీస్తున్నాడు.

"అయితే ఒక మంచి సంబంధం ఉంది. చేసుకుంటావా కృష్ణా?" అన్నాడు మల్లిబాబు.

"అలా అడగండిబాబు, ఎన్ని సంబంధాలు వచ్చినా చేసుకోదల్చుకోలేదని ఒకటేమాట బాబూ, చెబితే వింటేనా?" అన్నాడు తాత.

కృష్ణారావు తలెత్తి "కాస్త నాలుగు డబ్బులు ఎక్కువ వచ్చేవరకు పెళ్లి చేసుకోకూడదనుకున్నానండీ అంతే" అన్నాడు.

"సింధియాలో ఉద్యోగం వచ్చిందిగా." అన్నాడు మల్లిబాబు.

"ఏది బాబూ అదిగో ఇస్తాం ఇదిగో ఇస్తాం అని తిప్పుతుంటేను."

లక్ష్మణరావు "నేను కనుక్కుని నీకు ఆర్డర్లు వేయిస్తాను" అన్నాడు.

యువకుడు ఉత్సాహంగా "నిజంగానాండి" అన్నాడు. తాత ముఖం దాగరంత యింది.

"మా లక్ష్మణరావుగారు అక్కడే పని చేస్తున్నారు. పెద్ద పలుకుబడి ఉంది."

"అంత ఉపకారం జరగాలేగాని మీమాట కాదంటానా బాబూ" అన్నాడు కృష్ణారావు.

"వాళ్లు కూడా అంత ఉన్నవారు కాదు. కాని మంచి సంప్రదాయంలో వాళ్లు. ఒకప్పుడు బాగా పచ్చిగా బ్రతికిన వాళ్ళు. పిల్ల అందంగా ఉంటుంది. నాకు నచ్చింది. నీకూ నచ్చుతుంది."

"ఇక మీరు నాకవన్నీ చెప్పక్కర్లేదు. మీరు ఎలా చెబితే అలా నడుచుకుంటాను. ఆ ఉద్యోగం ఇప్పిస్తేచాలు" అన్నాడు కృష్ణారావు.

"పెద్దలు. మా మంచికోసే చెబుతారు. ఉండడమేమిటి బాబూ. మా కుటుంబు ఉన్నదేమిటి? రెక్కాడితే డొక్కాడుతుంది. పిల్ల మంచిదయితే అంతేచాలు" అన్నాడు తాత.

"మీకు చూపిస్తాను తాతా. ఇవాళ సాయంత్రం అటు వెళ్దాం. పిల్లను చూద్దురు కాని" అన్నాడు మల్లిబాబు.

"నీకు పెళ్లి మీద కంటె ఉద్యోగం మీద ఎక్కువ దృష్టి ఉన్నట్టుందే?" అన్నాడు లక్ష్మణరావు.

"ఎవరికయినా అంతేకదండి మడులున్నాయా మాన్యాలున్నాయా. మా నాన్న చెప్పినట్టు రెక్కలున్నాయి. పెళ్ళయినా, మరేదయినా తిండిలేందే కారంకదూ" అన్నాడు కృష్ణారావు.

తాత కొడుకును దగ్గరగా తీసుకుంటూ "మా నాయన చాలా బుద్ధిమంతుడు బాబూ. మంచి గుణాలు, ఎవరినీ కష్టపెట్టడు. ఒకరి కష్టం చూడలేడు. అంటూంటే తండ్రి కౌగలిని విడిపించుకుంటూ "ఉండునాన్నా, నువ్వెప్పుడు ఇంతే" అని దూరంగా జరిగి కూచున్నాడు కృష్ణారావు.

లక్ష్మణరావూ, మల్లిబాబూ ఒకేమారు నవ్వారు. యువకుడు సిగ్గుపడ్డాడు.

తాత అంతతో విడిచిపెట్టలేదు. "మా నాయనకు అప్పుడే పెళ్లికళ వచ్చింది." అన్నాడు.

యువకుడికి ఈమారు నిజంగా కోపం వచ్చింది.

"కోపగించుకోకోయ్. పెద్దవాడి మనసు తెలుసుకో" అన్నాడు లక్ష్మణరావు.

"అదికాదండీ. అస్తమానూ అలా అంటూంటే ఏం బాగుంటుంది చెప్పండి. దేనికయినా ఓ వేళా పాళా ఉండద్దుటండీ" అన్నాడు కృష్ణ.

తాత ఆనందంతో ఒళ్ళంతా కదిలేలా నవ్వుతున్నాడు.

* * *

సాయంత్రం కాస్త చల్లబాటువేళ చుట్ట కాల్చుకుంటూ గోడవేపు తిరిగిపడుకున్నాడు ముసలితాత. మనవలు పక్కనే పడుకుని దొర్లుతున్నారు. పెద్దమనవరాలు లోపల పని చేసుకుంటూంది.

మల్లిబాబు వంగి చూరుపట్టుకుని "తాతా నిద్రపోతున్నావా?" అని పిలిచాడు.

తాత చప్పున వెనక్కుతిరిగి చుట్టదూరంగా పారేసి లేచి 'రండి బాబూ రండి' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించాడు.

"నేనొక్కడినే కాదు. కూడా పెళ్ళివారు వచ్చారు. కాస్త చాపవేసి...ఒద్దులే...ఆ సంగతి నే చూస్తాను. మంచినీళ్లిచ్చి అమ్మాయిని చూపించు తాతా" అన్నాడు మల్లిబాబు.

తాత ఆనందసాగరంలో మునిగి తేలుతూ

# జీవనగంగ

ఉక్కిరి బిక్కిరవుతూ "కూచోండి బాబూ కూచోండి. ఏదో బీదముండా వాణ్ని. ఇదే ఉంది." అంటూ ఓ చింకిచాప పరచబోయి మనసు ఒప్పక "ఒక్క నిముసం ఆగండి బాబూ" అంటూ కదలబోతుంటే మల్లిబాబు ఆపి "ఎక్కడికి తాతా? ఎందుకంత కంగారు పడతావు. నేనులేనూ" అంటూ భుజంమీద కండువా తీసి అరుగుమీదపరిచి "కూచోండి" అని పక్కనున్న వాళ్ళను హెచ్చరించాడు. తను చింకిచాపమీద కూర్చుంటూను.

కృష్ణారావు ఆ కండువా తీసి మడత పెడుతూ "అరుగుమీద కూర్చుంటే తప్పా. నాకలాంటి పట్టింపులు లేవండీ" అని తండ్రితో కలిసి చింకిచాపమీద కూర్చున్నాడు.

ఈ బయటి హడావుడికి ఒకమారు బయటికి తొంగిచూసి సంగతి తెలిసి పెళ్ళికూతురు లోపలికి వెళ్ళిపోయింది. ఆవిషయం పెళ్ళికొడుకు గమనించకపోలేదు. ఆ ఇద్దరి హృదయాలలోనూ మధురమైన అనుభూతులు కలిగాయి. తాత పరవశమయి పోతున్నాడు.

ఒక్క అరగంటలో పెళ్లికూతురు వచ్చి ఎదురుగా కూర్చుంది.

"ఈమె మూగదేమో అనుకోనక్కర్లేదు మాట్లాడించనా" అన్నాడు మల్లిబాబు పెళ్లికూతురు తలవంచి నవ్వుకుంది.

"అక్కర్లేదు" అన్నాడు యువకుడు.

"సినిమాపాటలు బాగా పాడుతుంది. పాడించమంటారా?"

తాత కొడుకుభుజంమీద చేతులువేసి మల్లిబాబుతో "ఒద్దులే బాబూ! ఆపిల్ల పాత రోజులూ మా అబ్బాయి యువరాజులాగ ఠీవిగా కూర్చుని వెనకరోజులూ ముందు ఉన్నాయి. ఇప్పుడుపాపం సిగ్గుపడుతూంది." అన్నాడు.

మల్లిబాబు నవ్వుతూ "అయితే మరి ఏమంటారు?" అన్నాడు.

కృష్ణారావు "అదేమాట మళ్ళీ అంటావేం? నేనేం చెప్పాను ఇందాక. మీఇష్టం. మీరెలా చెబితే అలా వింటానంటినిగా. పదేపదే మీరలాగంటూంటే నాకు బాధగా ఉంటుంది" అన్నాడు.

పెళ్ళికూతురు లోపలికి వెళ్లిపోయింది.

"అలాఅంటే పనికిరాదు. నీకునచ్చిందా?"

"నచ్చింది. సరా బాబూ."

"ఇప్పుడు నాకు తృప్తిగా ఉంది" అని మల్లిబాబు అన్నాడు.

పెళ్ళివారు లేచారు. తాత, కృష్ణ బయట నిలబడ్డారు. తాత మల్లిబాబుచేతులు పట్టుకుని "నీ ఋణం..." మాట పెగలక కన్నీటితో చెంపలు తడుపుకుంటూ కిందికి వాలిపోతుంటే మల్లిబాబు గట్టిగాపట్టుకున్నాడు. తాత రెండుచేతులూ మల్లిబాబు పాదాలు బలంగా పట్టుకున్నాయి.

రెండు ముసలిచేతులు యౌవనకాంతితో మెరుస్తూన్న రెండు పాదాలను గట్టిగా పట్టుకోవటం, రెండుచేతులు వారించబోవటం దూరంనుంచి కృష్ణారావు గమనించాడు.

మల్లిబాబు పంచ పైకి పట్టుకుని ఇవతలికి వస్తూ వెనక వస్తూన్న తాతను "నువ్వికవుండు తాతా" అన్నాడు.

తాత వీధిలోకి వచ్చి రెండు చేతులతో ఇద్దరిచేతులూ పట్టుకుని "మీమీద ఆశపెట్టుకున్నానుబాబూ" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

* * *

లక్ష్మణరావు శ్రద్ధగా కనుక్కుని కృష్ణారావుకు ఆర్డరు వేయించాడు. అంతకుముందే పెళ్ళి నిశ్చయం అయిపోయింది.

"చూశారా అమ్మాయి ప్రభావం!" అన్నాడు మల్లిబాబు చమత్కారంగా.

యువకుడు సిగ్గుపడ్డాడు.

ఒక సుముహూర్తాన లక్ష్మణరావునూ, మల్లిబాబునూ పెద్దలుగా చేసుకుని ఆయువతీ యువకులిద్దరూ పరస్పరం హృదయాలను పంచుకున్నారు. పెళ్ళికూతురుకు జానికమ్మా, రాధా చెరో చీరా, రవికలగుడ్డా చదివించారు.

ముసలితాత పెళ్ళిపీటలమీద మనవరాలిని చూసుకుని కూతుర్ని తలుచుకుని కన్నీరు పెట్టుకున్నాడు. తాతపక్కనే స్తంభానికి చారబడి మల్లిబాబు "తాతా ఇప్పుడు నీ మనసు తృప్తిగా ఉందా? ఆ కుర్రవాడు బుద్ధిమంతుడు. నెమ్మదయినవాడు. నేను ఎంతో పరీక్షచేసి తెలుసుకొన్నాను. అమ్మాయి సుఖపడుతుందిలే" అన్నాడు.

"అదే బాబూ నేను కోరేది." దగ్గరగా వచ్చి "నాబాధ కేముంది బాబూ. వయసు వచ్చినపిల్లేమో పెళ్ళవుతుందో లేదో, ఐతే తండ్రిలాంటివాడు వస్తాడేమో అని బెంగటిల్లిపోయింది బిడ్డ. మీరు యీ సంబంధం తెచ్చిననాటినుంచీ దాని ఆనందం చూసి తీరాలిబాబూ. నేను ఓకంట కనిపెడుతూనే ఉన్నా" అన్నాడు.

కొడుకు—నాన్నా, నువ్వు చీకట్లో వ్రాయగలవా?
తండ్రి—ఓ. వ్రాయగలను.
కొడుకు—(లైటు ఆర్పేసి) అయితే నా స్కూలు రిపోర్టు మీద సంతకం పెట్టు!
—ఎస్. వి. అప్పారావు (బాపట్ల).

పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ కలిసి పెద్దలందరికీ పాదాభివందనం చేశారు.

"వాళ్ళకూ వీళ్ళకూ పెళ్ళిళ్ళు చేయిస్తున్నావు. నీపెళ్ళి ఎప్పుడు బాబూ?" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

మల్లిబాబు నవ్వి ఊరుకున్నాడు. జానకమ్మ, రాధా అక్కడే ఉన్నారు.

పక్కనున్న లక్ష్మణరావు "అదీ కొద్దిరోజుల్లో జరుగుతుంది" అన్నాడు.

జానకమ్మ భర్తతో "ఇంటివిషయంలాగానే ఇదికూడా ఉన్నట్టుండి బయటపెడతారేమిటి?" అంది. పూరిపాక తాటాకులు గాలికి గలగలలాడాయి. చంద్రుడు పైకి లేచాడు.

ఆ పూరిపాకలో పేదరికాన్ని అలవాటుగా చూసే చుట్టుపక్కలవారికి ఆపాక ముందు పందిరిలు, ఆ పేదవారిమధ్య ఉన్న ఆ కుటుంబంలో మనుష్యులు మెదలటం ఆశ్చర్యంగానే ఉంది. ఆ మర్నాడు వాళ్ళవాళ్ల పనిమనుష్యులద్వారా అన్ని సంగతులూ తెలుసుకుని "ఇది చోద్యంగానే ఉంది" అనుకున్నారు. ఆ మర్నాటినుంచీ ఆ పిల్లను చూస్తే దూరంగా తప్పుకోవటం మానక పోయినా కొత్తపలకరించటం మొదలుపెట్టారు. అంతా సరదాలే. పక్కింటావిడ మంచినీళ్ళకోసం పోబోతున్న కొత్తపెళ్లికూతుర్ని పనిగట్టి పిలిచి 'అంతదూరం దేనికమ్మా పోతావు. మా దొడ్లో తోడుకుపో. ఇదేమైనా భాగ్యమా?" అంది పిల్లదాని మెళ్ళో పెళ్లికొడుకువారు అందంగా చేయించిన ఒంటిపేట గొలుసుచూస్తూను.

ఆమె నీళ్లు తోడుకుంటుంటే "రోజులెప్పుడూ ఒక్కలాగు ఉంటాయా తల్లీ. నీ మొగుడుకి సింధియాలో ఉద్యోగమటగా. జీతంబాగానే ఇస్తారుట. ముందు ముందు ఇంకా వృద్ధిలోకి వస్తారుట. బాగుందమ్మ బాగుంది. అసలిదంతా నీ అదృష్టం అమ్మా. అచ్చం నేననుకున్నట్టే అయింది" అంటూ తెగపొగిడింది.

"మీ పెద్దల అభిమానం ఉంటే అంతే చాలమ్మా. అదే పదివేలు" అంది ఆ పిల్ల బిందె చంకకు ఎత్తుకుంటూను.

"ఆ వినయమే నిన్ను కాపాడుతుంది."

"ఒస్తానమ్మా" అని సెలవు తీసుకుని ఆమె గుమ్మంలో అడుగుపెట్టిందో లేదో వెనకనించి కృష్ణారావు గొంతు వినిపించింది. గుండెఝల్లుమన్నట్టయి చంకలోబింది టప్పున జారి మెట్లమీదపడి దొర్లి దొర్లి కొత్తపెళ్లికొడుకు కాళ్ళముందు వెళ్లి నిలిచింది. నీరు మడుగుకట్టి తూములో కలిసిపోయింది. లోపలికి పరుగెత్తి తలుపువార నిలబడిపోయింది.

సొట్టలుపడిన ఆ బిందెని తీసుకుని అతను ముందుకు అడుగువెయ్యబోతుంటే అప్పుడే



వచ్చినతాత చప్పున అతని చేతిలోంచి బిందె అంది పుచ్చుకుని "అదేమిటి నాయనా" అంటూ సగౌరవంగా లోపలికి తీసుకు పోయాడు.

## 32

మధుసూదనం దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

'ఇక్కడ రెండు సంసారాలూ సాఫీగానే నడుస్తున్నాయి. అక్కడ అంతా క్షేమం అనుకుంటాను. అమ్మకు అక్కడికి వచ్చెయ్యాలని ఉంది. కాని సాధ్యపడటం లేదు. సుగుణమ్మ సంగతే ఏం చెయ్యాలో పాలుపోవటం లేదు. ముగ్గురు పిల్లలు, ఆమె ఇంతమందిని ఏ ఒక్క కుటుంబీకుడు భరించగలడనుకోను. ఈ మూడు మాసాల్లోనూ మొత్తం నాలుగొందలు అప్పుచేశాను. ఇది కాకుండా పచారీ కొట్టులో ఖాతాను విపరీతంగా పెరిగిపోయింది. దరిద్రుడు పెళ్లికి వెళ్లితే వడగళ్ళవానట. ఈ ఒత్తిడి తట్టుకోవటానికి నా వయస్సు చాలటం లేదు బావా. నేను ఉత్తదరిద్రపు జాతకుడ్ని కాకపోతే ఇలా కుటుంబాలు కుటుంబాలుగా వచ్చి మీద పడతాయా? సుగుణమ్మను చూస్తుంటే జాలి మాట అటుంచి భయం వేస్తోంది. ఇంతకంటే దారుణమయిన విషయం మరొకటుందా? రాధ మళ్ళీ హిందీ పాఠాలు మొదలుపెట్టిందని తెలిసి సంతోషించారు. రాధను తల్చుకుని నేను గర్వపడుతూంటాను.

ఈమధ్య సుభద్రమ్మ ఆరోగ్యం బాగులేదు. ఏపీలేదు. కొద్దిరోజుల్లో మరో బిడ్డను కనబోతూంది. తరుచుగా నేనే వంటగదిలో చేతులు కాల్చుకోవలసి వస్తోంది. నీకు కోపం వస్తుంది ఇలా రాస్తుంటే. ఏం చెయ్యను బావా. నువ్వు చేసిన సాహసం నేను చెయ్యలేకపోతున్నాను. ఎప్పటికప్పుడు బావలాగా నాకూ ఇక పిల్లలు పుట్టకూడదు అనుకుంటూనే ఉంటాను. బుద్ధి గడ్డితింటూనే ఉంటుంది. ఇకమీదటనైనా ధైర్యం చెయ్యాలి. అధికసంతానం దరిద్రహేతువు. ఇలాగే చిన్నచిన్న పొరబాట్లతో పెద్ద పెద్ద తప్పులు జరిగిపోతూంటాయి. తర్వాత 'అయ్యో' అనుకుని గింజుకుంటాం. ఇక నేను జాగ్రత్తపడదల్చుకున్నాను. గోపి బాగా చదువుకుంటున్నాడా? సుభద్రమ్మ అస్తమానూ వాడ్ని తల్చుకుంటూంటుంది. సరే! ఉంటాను. సమాధానం రాయి.'

ఆ ఉత్తరం ఇంట్లో అంతా చదివారు. ఆ ఉత్తరంలో కొత్త విషయం రాధా, రామచంద్రం ఇప్పుడే మొదటిసారిగా తెలుసుకున్నారు. అందుకని అన్నయ్యకు మరో పాపాయి పుట్టబోతున్నాడన్న విషయం వాళ్ళను అంత ఉత్సాహపరచలేదు. లక్ష్మణరావుగురించి ఇంకో విశేషం తెలిసింది.

"ఒకతప్పు లక్షతప్పులకు మూలమవుతుంది. తామరతంపరలాగ పిల్లల్ని కని అనారోగ్యాలతో, ఆర్థికబాధలతో నానాటికి దిగజారిపోయి వాళ్ళభవిష్యత్తు పాడుచేసి మొత్తం దేశం బలహీనమైపోయే ప్రమాదానికి కారకులయేవారు దేశద్రోహులనే నా అభిప్రాయం" అన్నాడు లక్ష్మణరావు మల్లిబాబుతో.

మల్లిబాబు నవ్వి ఊరుకున్నాడు.

"నువ్వెందుకు నవ్వావో నాకు తెలుసు. ప్రతిదానికీ విమర్శించటమే పనిగా పెట్టుకున్నాననుకుంటున్నావు కాబోలు" అన్నాడు లక్ష్మణరావు.

"ఇది మరీబాగుందండి. నేనేవీ అనకుండానే మీరే ఊహిస్తున్నారే?"

రాధ పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది, జానకమ్మ లేసు అల్లుకుంటూ కూర్చుంది. పిల్లలు ముగ్గురు గేటుదగ్గర ఆడుకుంటున్నారు.

పేపరువాడు పేపరు పడేసిపోయాడు. లక్ష్మణరావు పేపరు తీసుకుంటూ "ఇక పరీక్షలయిపోయాయి కాబట్టి రిజల్టుకోసం ఎదురుచూస్తూ కూచోవటం ఒకపని" అన్నాడు.

"ఈ డబ్బులు తిని మంచానపడకుండా ఉండిఉంటే తప్పకుండా క్లాసువచ్చేది."

"సరె క్లాసుమాట దేముడెరుగు. బ్రతికి బయటపడ్డావు. అదే పదివేలు నాయనా" అంది జానకమ్మ.

"చదువు మీద ఉత్సాహమున్న వాళ్ళకు అలా అనిపించదక్కా" అంది రాధ.

"ఇది విన్నారా?" అంటూ లక్ష్మణరావు పేపరులోని ఒకముఖ్యవార్తను ఇలా చదవసాగాడు :

"ప్రభుత్వం స్త్రీల అభివృద్ధి నిమిత్తం, ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాల ఆదాయం పెరుగుదలకు, అనాథస్త్రీల రక్షణకు రకరకాల చేతివృత్తులు నేర్పే శిక్షణాలయాలను కొన్ని కొన్ని ముఖ్యకేంద్రాలలో స్థాపించబోతున్నది. కొద్ది రోజులలోనే ఈ కేంద్రాలను ఏర్పాటుచెయ్యడానికి తగిన చర్యలు ప్రభుత్వం తీసుకోబోతున్నది..." అని చదివి ఇది హర్షించతగిన చర్యకదూ?" అన్నాడు.

"ఆలోచన బాగానే ఉంది. ఆచరణలో సక్రమంగా నిర్వహింపబడాలిగా" అన్నాడు మల్లిబాబు.

"దుబారా జరుగుతోందనేగా నీ ఆరోపణ?"

"నా ఆరోపణే కాదు. దేశంలో పెద్దలందరికీ ఈ విషయం తెలుసు."

"ఒప్పుకుంటాను తమ్ముడూ. అందుకని ఒక్క ప్రభుత్వాన్ని నిందించి ప్రయోజనం లేదు తమ్ముడూ. ప్రజల్లో అధికార దుర్వినియోగం, లంచగొండితనం, నిర్లిప్తత అన్నీ ప్రబలిపోతున్నాయి. పైవాడి దగ్గర్నుంచి కిందవాడి వరకూ చేతులు చాచేవాళ్ళే. డబ్బు పిచ్చి ఎక్కువయిందికూడా. ఈ వ్యాధుల నివారణకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకో

# జీవనగంగ

వటం లేదనే ఆరోపణ నేనూ ఒప్పుకుంటాను. కాని ఇలాంటి సమస్యల పరిష్కారానికి వ్యక్తి వికాసం, నీతి, ధర్మంపట్ల న్యాయంపట్ల నమ్మకం ప్రజల్లో బలపడాలని నా ఉద్దేశం. ఎవడి క్షేమం వాడు చూసుకోకుండా మొత్తం దేశాన్ని కూడా దృష్టిలో పెట్టుకోవాలి. తెలిసి తప్పు చెయ్యటం వేరు. తెలియక చెయ్యటం వేరు. ఇందులో మొదటి స్వభావం ప్రమాదకరమైంది. మన దేశంలో ఈ స్వభావమే సర్వత్ర వ్యాపించి ఉంది."

"నా అభిప్రాయం ఇందుకు కారణం ప్రభుత్వం వేసే పన్నులనుకుంటాను. మన దేశంలో ఉన్నవారంతా చాలావరకూ మధ్యతరగతికి చెందినవారూ, పేదవారూను; ఈ పన్నుల భారం వాళ్ళమీదే పడుతూంది. రకరకాల పన్నులు. ప్రజల రాబడి పెరగటం లేదు. ప్రతి వస్తువు ధరలూ విపరీతంగా పెరిగిపోయి ఉన్నాయి. అందుకని డబ్బు సంపాదనకు ప్రజలు పెడదారులు చూసుకుంటున్నారు. తప్పటంలేదు."

"మరి దేశం అభివృద్ధి సంగతి? డబ్బు లేకపోతే ఎలా?"

"మరి ప్రజల బాధలు? ప్రతి వస్తువుధరా ఇలా విపరీతంగా పెరిగిపోతే బ్రతికే ఎట్లు?"

"ఉత్పత్తి పెంచటానికేగా ప్రభుత్వం ప్రాజెక్టులు కడుతూన్నది. అదనపు సాగు జరగాలి. ఏదైనా కొంతకాలం మనం ఓర్పు పట్టాలి మరి."

"ఓర్పు నువ్వూ నేనూ పడతాం. జనం మాట ఆలోచించండి" అన్నాడు మల్లిబాబు.

"అదే వచ్చిన చిక్కు."

"ఇలాంటి స్త్రీ సంక్షేమ కేంద్రాలు నెలకొల్పటం చాలా అవసరం. వాటిని సక్రమంగా నిర్వహించాలి."

దీపాలు వెలిగాయి. లక్ష్మణరావు పేపర్లో ముఖ్యమయిన వార్తలన్నీ చదివేసి మల్లిబాబుకు ఇస్తూ "కాస్త వీలు చూసుకుని ఈ కేంద్రం ఎక్కడ ఏర్పాటు చేస్తారో ఏమిటో వాకబు చెయ్యి తమ్ముడూ" అన్నాడు.

గేటుదగ్గర పిల్లలు ఆటలుమాని ఆకలేస్తోందంటూ తల్లిదగ్గర చేరారు. గోపి రాధపక్క కూర్చుని "అక్కా అమ్మ ఎప్పుడు వస్తుందే" అని అడిగాడు.

లక్ష్మణరావు పక్కకు తిరిగి "ఏరా గోపీ అమ్మను చూడాలని ఉందా?" అన్నాడు. గోపి తలఊపుతూ "వస్తుంది. కొద్దిరోజుల్లో వచ్చేస్తుంది" అన్నాడు.

## 33

ఆ నాడు ఆదివారం. లక్ష్మణరావు వరండాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. ఉదయం ఎనిమిది గంటలయింది.

జానకమ్మ పనిమనిషిచేత దగ్గరవుండి ఇల్లు కడిగిస్తూంది. రాధ కొత్తగా నేర్చుకొన్న ఇడ్లీలు వెయ్యటం అమల్లో పెడుతూంది. వీధుల్లో జనం ఇంకా తిరగటం లేదు. రామచంద్రం వంటగది గడపమీద కూర్చుని చెల్లెలికి సలహా లిస్తున్నాడు. గోపీ సుద్దముక్కతో పలకమీద బొమ్మలు వేస్తున్నాడు.

మల్లిబాబు గేటు తెరచుకుని ఆదుర్దాగా లోపలికి వస్తూ "ఓ ఏభయి రూపాయలు యివ్వండి లక్ష్మణరావుగారూ. అర్జంటుగా ఊరికి వెళ్ళాల్సి వచ్చింది. నాన్నకు చాలా జబ్బుగా ఉందిట." అన్నాడు.

జానకమ్మ ఇవతలకు వచ్చి కంగారుగా "ఏమిటండీ?" అంది.

రాధ రామచంద్రం కూడా యివతలికి వచ్చేశారు.

లక్ష్మణరావు కుర్చీలోనుంచి లేచి లోపలికెళ్ళి అయిదు పదిరూపాయల నోట్లు తెచ్చి మల్లిబాబు చేతిలో పెడుతూ "ఇంకా అవసరం ఉంటే రాయి. వెంటనే పంపుతాను" అన్నాడు.

మల్లిబాబు ఒక సంచీనిండా బట్టలు సర్దుకుని అందరికీ చెప్పి రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు.

మల్లిబాబు మంచాన పడ్డప్పుడు పిల్లలకు లక్ష్మణరావూ రాధా చదువు చెప్పేవారు. ఆ విధంగా రాధ కొంత అనుభవం సంపాదించే వుంది.

లక్ష్మణరావు రాధవైపు తిరిగి "రేపటినుంచి పిల్లల చదువులు నువ్వు చూసుకోవాలి" అన్నాడు.

"ఆయన ఎప్పుడు తిరిగి వస్తారో చెప్పారా?"

"లేదు. బహుశా ఎక్కువ రోజులు పడుతుం దనుకుంటాను. అక్కడ పరిష్కారం కావలసిన సమస్యలు చాలా ఉంటాయి."

"నాది, నా వాళ్లు అనే అభిమానం అలా ఉంటుంది. ఎంత కాదనుకున్నా మనసు అటు పీకుతూనే ఉంటుంది."—అంది జానకమ్మ.

"గాయపడిన హృదయాలూ, చెదరిన మనసులూ అతి వికృతమయిన మానసస్థితికి దిగజారిపోయే ప్రమాదం వుంటుంది. ఇతను ఎలా వచ్చాడో మన మధ్యకు వచ్చిపడ్డాడు. మనలో ఒకడయాడు. అంతేకాదు. నామటుకు నేను ఒక బిడ్డలాగ అతన్ని చూశాను. మీరంతా ఆ ప్రవర్తంలో వారిలా మనసిచ్చి మసిలారు. అందుకని అతడు ఎక్కువగా దెబ్బతినలేదు సరికదా ఇంకా బాగుపడ్డాడు. జీవితానుభవం సంపాదించుకున్నాడు." భార్యవైపు తిరిగి "భగవంతుడు దయ తలిస్తే ఎంతో వృద్ధిలోకి వస్తాడని." అన్నాడు లక్ష్మణరావు.

"ఇక మళ్ళీ వస్తాడంటారా?"—అంది జానకమ్మ.

"తప్పకుండా వస్తాడు. ఆ సందేహం నాకు లేదు."

రాధ లోపల ఇడ్లీల వ్యవహారంలో వుంది. గోపీ పొయ్యిదగ్గర మకాం వేశాడు. రామచంద్రం ఆకలిగా ఉందంటూ కడుపు రాసుకుంటున్నాడు. రాధ మనస్సు అక్కడలేదు.

మొత్తంమీద ఇడ్లీలు అనుకున్నంత తృప్తిగా రాలేదు. అక్కడక్కడ ఉడకలేదు. జానకమ్మ వచ్చి చూసి "నన్ను పిలవకపోయావా" అంది.

రాధమ్మకు అంత ఉత్సాహంగా లేదు. 'ఫర్వాలేదు. అదే తినేస్తే సరి' అంది.

జానకమ్మ మళ్ళీ గిన్నె పొయ్యిమీద పెట్టి "నువ్వుండు. నే వేస్తాను" అని కుంపట్లో బొగ్గులు సరిచేసి గిన్నె సర్దింది.

రాధ పక్కకు జరిగి జానకమ్మకు వీలుగా చోటు ఇచ్చింది.

లక్ష్మణరావు "నాక్కూడా కొత్త పెడతావా రాధమ్మా" అంటూ లోపలికి వచ్చాడు.

"ఎందుకు, తిట్టటానికా?" అంది రాధ.

"ఉడక్క పోతే కడుపులో పోటు వస్తుంది." అంటూ లక్ష్మణరావు ముఖం చిట్లించుకున్నాడు.

జానకమ్మ చిన్నబుచ్చుకున్నట్టున్న చెల్లెలి ముఖం చూసి "ఊరుకుందురూ. దానికన్నీ తెలుసు. ఎవరికయినా అప్పుడప్పుడు ఇలా పొడవటం జరుగుతూనే వుంటుంది. మహా వేళాకోళం చేస్తున్నారు." అంటూ మందలించింది.

"వాతావరణం వేడివేడిగా వుంది. ఇక్కడ్నించి నిష్క్రమించడం మంచిది" అనుకుంటూ లక్ష్మణరావు ఇవతలికి వచ్చేశాడు.

రామచంద్రం కొంచెం పెద్దగానే నవ్వేశాడు.

(ఇంకా వుంది)

కొడుకు —నాన్నా, మరేం నిన్నరాత్రి కలవచ్చింది. నువ్వు నాకో రూపాయి ఇచ్చావట.

తండ్రి—చూచావా, మరి! ఎంత మంచివాడినో! ఆ రూపాయి నీదగ్గర ఉంచుకో.

—ఎస్. వి. అప్పారావు (బాపట్ల).

# చిత్రమైనదీ విధివిధానం

డి. సీతారామ శాస్త్రి

క్లాసులో లెక్చరరు పాఠం చెప్పుకు పోతున్నాడు ఉషారుగా. 'చూచారు యీ యాజ్ యూ లైక్ ఇట్ నాటకంలోని పాత్రను కదిలించినా తన ప్రేమగోలే కదా. రాకుమార్తెలు రాకుమారులు ప్రేమించుకోవటం సహజం. కాని షేక్స్‌పియరు గొర్రెల కాపరులనుకూడ ప్రేమవలలో పడేసి మరింత ఉదాత్తంగా సృష్టించాడు పాత్రలను. అందుకనే ప్రేమ గ్రుడ్డిది అంటారు. ప్రేమించటానికి ప్రేమింపబడటానికి అందరు అర్హులే' అని వివరిస్తూ విద్యార్థులవైపు తిరిగిచూచారు.

అప్పుడే యౌవనములో అడుగుపెట్టిన వారేమో 'ప్రేమ' అను పదము వారిలో మధురానుభూతులు కల్గించి చక్కిలిగింతలు పెడుతోంది.

క్లాసంతా ముసిముసి నవ్వులతో నిండిపోయింది.

లెక్చరరు మగపిల్లలని ఆడపిల్లలని కలయచూస్తూ వారి భావాలను గమనిస్తున్నాడు.

'మాష్టారు' అన్న సన్నని కంఠధ్వని వినపడింది.

క్లాసంతా నిశబ్దము. అంతా అటువైపే తిరిగి చూచారు.

'నాకు తలనొప్పిగా వుందండి వెళ్ళిపోతాను' అంది సుజాత.

'ఏమమ్మా ముందే అడిగి వెళ్ళక పోయినావా'

సమాధానం లేదు.

'సరేలేమ్మా వెళ్ళు' అన్నాడు లెక్చరరు.

పుస్తకములు తీసుకొని వచ్చేసింది సుజాత. బరువుగా అడుగులు వేసుకుంటూ బయలుదేరింది.

'నిజంగా తనకు తలనొప్పి వచ్చిందా' అనుకొంది. 'కాదు ఆవేదన' అని మనస్సు చెప్పుతోంది.

పార్కు వచ్చేపోయే జనముతో సందడిగా వుంది. పిన్నలు, పెద్దలు, యువతులు, యువకులు అందరు సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఆకుపచ్చని కంబళీ పరచినట్లుగా వున్న పచ్చికపై అక్కడక్కడ తీరికగా కూర్చున్నారు. పిల్లలు కేరింతాలు కొడుతూ ఆడుకొంటున్నారు.

నిర్మానుష్యముగా వున్న ప్రదేశంలో ఏకాంతంగా కూర్చుంటే నాన్న కొంచెము ఊరట కలుగుతుందేమోనని దారి తీసింది పార్కులోకి సుజాత.





'సుజాతా' అని పిలుపు వినపడింది.

వెను దిరిగి చూచింది సుజాత.

'ఏమే సుజ అట్లా వున్నావు' అని ప్రశ్నించింది కమల దగ్గరకు వస్తూ.

'ఆ మనసేమీ బాగుండ లేదు' అంది సుజాత.

'పోనీ నాకన్నా కాస్త చెప్పకూడదటే - నీ ఆప్త మిత్రురాలిని కదా!

'అదికాదే - ఇంటర్ క్లాసులో మాస్టారు యాజ్ యూ లైక్ ఇట్ పాఠం చెపుతుంటే తల నొప్పిపుట్టి వచ్చేసాను. అంతే ఏమీ లేదు' అంది సుజాత అసలు సంగతి మరుగు పరుస్తూ.

ఎవరూ లేని చెట్టుక్రింద కూర్చున్నారు యిద్దరు మౌనంగా.

సుజాతకు పదనిమిది సంవత్సరము లుండవచ్చు. అందమైన ముఖము, సోగదేరినకండ్లు, దొండపండులాంటి ఎర్రటి చిన్ని పెదవులు చక్కటి తెల్లని పలువరుస. నిడుపైన జడ. పచ్చని దబ్బపండులాంటి శరీరచ్ఛాయ. గాంభీర్యంతో కూడిన ఆ ప్రశాంతవదనము ఎవరినైన యిట్టె ఆకర్షిస్తుంది.

ఇద్దరిమధ్య నిశ్శబ్దత కాపురం చేస్తోంది. మనస్సులో లేచే ఆవేదనాతరంగాల కనుగుణంగా గాలికి లేగిన ముంగురులు ముఖాన్నంత ఆవరించుకుంటున్నాయి.

'ఏమిటివి - సుదీర్ఘంగా ఆలోచిస్తున్నావు సుజా' అంది భరింపరాని నిశ్శబ్దతను భంగ పరుస్తూ.

ఆలోకంలోకి అడుగుపెడుతూ 'ఏమిటే అంటున్నావు' అంది సుజాత.

'నీతో మాట్లాడటంకన్నా రాయితో మాటాడటం మేలు'

'కాదు మరి. ఓపట్టానికన్నా రాయిపలుకుతుంది, నేను అదీలేదుకదూ' అంది నవ్వుతూ.

'ఎప్పుడూ అట్లావరధ్యానంగా వుంటావేమిటే'

'అది సరేకాని పరీక్షలు దగరకు వస్తున్నాయికదూ. బాగా చదువుతున్నావా క్లాసురావాలి మరి'అంది సుజాత విషయాన్ని మార్చటానికి ప్రయత్నిస్తూ.

వారిద్దరిమధ్యా అనేక విషయాలు దొర్లిపోతున్నాయి.

'హా హా హా హా' అని పెద్దగా నవ్వుతున్నారు ఎవరో.

ఇద్దరు ప్రక్కకు తిరిగిచూచారు. పిచ్చివాడులాగావున్నాడు. పాతిక సంవత్సరాలు వుండవచ్చు. దుబ్బుగా పెరిగిన గడ్డం. పీక్కుపోయినకండ్లు. చూడటానికి అసహ్యంగా వున్నాడు. గట్టిగా నవ్వుతున్నాడు. అంతలోనే ఏదో గొణుగుకుంటున్నాడు తనలో.

సుజాత అతని వంక ఒకసారి చూసి ప్రక్కకు త్రిప్పుకుంది. తనువ్వక్కన కూర్చుంది. ఆమెకు ఏదో అనిపించింది. మళ్ళీ అతని వైపు పరీక్షగా చూచింది.

'చూడవే కమలా. ఆ కళ్ళలోని కాంతి. ఎవరో పాపం నిర్భాగ్యుడు.'

'చీకటి పడుతోంది యిక పోదాం' అంది కమల.

ఇద్దరు యిళ్ళకు వెళ్ళటానికి లేచారు.

చదువుకుందామని పుస్తకముతీసి టేబిల్ లైట్ ముందర కూర్చుంది సుజాత. పేజీలు త్రిప్పుతోంది. అక్షరాలు అలుక్కుపోతున్నాయి. పుటలు వెనక్కు తిరుగుతున్నాయి. ఒక్కసారి కళ్లు అశ్రుపూరితాలైనాయి. గత చరిత్ర జ్ఞాపకం వచ్చింది. రెండు సంవత్సరాలు వెనుకకు వెళ్ళింది.

అప్పటికి తనకు పదహారు సంవత్సరాలు. అందరు బంగారు బొమ్మ సుగుణాల రాశి అని అంటుండేవారు తనని. 'పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది' అది అమ్మలక్కల రిమార్కు. తను సరదాగా కబుర్లు చెబుతూ చిలిపిగా ప్రవర్తిస్తుండేది. 'ఏమోనమ్మా ఈ చిలిపి పిల్లతో ఆ వచ్చే మొగుడు ఎట్లా వేగుతాడో గాని' అంటుండేవారు ప్రక్కింటి బామ్మగారు. అప్పుడు తను ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతోంది. ఒక రోజున ఉదయమే లేచి పనిమనిషి రాకపోవటంవల్ల తొట్టి ప్రక్కన నీళ్లు చల్లుతోంది. చెంబుతో విసురుగా నీళ్లు చల్లింది. అప్పుడే టూత్ బ్రష్‌తో ప్రత్యక్షమైన మూర్తిముఖం ఒళ్లు తడిసిపోయింది. విత్తరపోయి చూస్తోంది. అతను రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు తన వైపే. తనకు భయమేసింది. తుర్రున లోపలికి ఒక్క అడుగులో వచ్చి పడింది.

మూర్తి ఆ రోజు రాత్రే, ప్రక్క భాగంలో వుంటున్న తన బావగారింటికి వచ్చాడు. ఎమ్. ఏ. లిటరేచరు ఫస్టు క్లాసులో ప్యాసై మద్రాసులో లెక్చరరుగా పని చేస్తున్నాడు. నిండు విగ్రహము. అందమైన ముఖం. మూర్తి వున్న రెండు రోజులలోను సుజాత రూపగుణములకు సమ్మోహితుడైనాడు. ఆమె చిలిపిచేష్టలు తనకు చక్కిలిగింతలు పెట్టినట్లయింది. అంతే. విధి అనుకూలించింది. ఆ వేసవిలో యిద్దరికి వివాహమైంది.

మూర్తికి శలవులు అయిపోయినాయి. మద్రాసు వెళ్ళవలసిన రోజు దగ్గరపడింది. 'ఏమండీ నేనూ మీతోనే మద్రాసు వస్తా' నంది సుజాత గోముగా.

'సరేకాని, హోటలులో కాపురం పెడదాము' అన్నాడు నవ్వుతూ. 'అదికాదు సుజా. నేను ముందరవెళ్ళి మంచి ఇల్లు కుదుర్చుకొని కావలసిన ఏర్పాట్లన్నీ చేసి మళ్ళీ వచ్చి తీసుకొని వెళుతానుగా' అన్నాడు మూర్తి.

'మారాముచేస్తే ఎట్లా చెప్పు. మా మంచి పాపాయి మా చిట్టి పాపాయివి కదూ' అంటూ బుజ్జగించాడు.

అంతా కలిసి స్టేషనుకు వెళ్ళారు. ప్రియు

# చిత్రమైనదీ విధివిధానం

ని వీడిపోయిన ప్రేయసిలా రైలు కూత కూసి బయలుదేరింది భారంగా.

విధి విచిత్రమైంది. భగవంతుని లీలలు ఎవరికీ అర్థంకావు. చిన్న పిల్లలు వినోదంకోసం రంగు రంగుల సీతాకోకచిలుకలని పట్టుకొని రెక్కలు విరిచి దారముతో కట్టి హింసిస్తూ వుంటారు. దేవుడూ అంతేనేమో. కాకపోతే తన ఆనందంకోసం మానవుల ప్రాణాలతో చెలగాటమాడతాడా.

మూర్తి ప్రయాణిస్తున్న రైలు ప్రమాదానికి గురైంది. ప్రమాదంలో మూర్తి ప్రాణాలను కోల్పోయాడు. తన ఆశాసౌధాలన్నీ కూలిపోయినాయి. తన బ్రతుకు బండలైంది. అంతా శూన్యం. విధిరాతను ఎవరు తప్పిస్తారు.

కళ్ళనీళ్ళు తుడుచుకుంది సుజాత.

పూర్వపు చిలిపితనం లేదు. ఉదాసీనంగా వుంటోంది. కాలచక్రంలో రెండు సంవత్సరాలు గడిచిపోయినాయి. నాన్నగారి బలవంతంమీద కాలేజీలో చేరింది. భారంగా నడుస్తోంది కాలము.

మనసు బాగుండనపుడల్లా అట్లా పార్కుకు వెళ్లి ఏకాంతంలో ఊరట పొందుతుండేది. జనసంచారం తక్కువగా ఉండటంవలన ఎప్పుడువెళ్లినా అదేప్రదేశంలో కూర్చునేది. అనేకసార్లు తను ఆపిచ్చివాడు అక్కడ తారసిల్లడం జరిగింది. వాడు ఆప్రక్కనే కొంచెము దూరములో కూర్చుని ఏదో గొణుగుకుంటుండేవాడు. ఆ పిచ్చివాడిని చూస్తుంటే జాలికలిగేది సుజాతకు. బహుశః తనలాంటి నిర్భాగ్యుడై వుంటాడని వేడిగా నిట్టూర్చేది.

'ఏమిటా ముసి ముసినవ్వులు. ఇది క్లాసు. ఆడపిల్లలైతేమాత్రం క్లాసులో మీకు ప్రత్యేకతేమీ లేదు. అంతా సమానమే. ఈసారి క్షమిస్తున్నాను. మళ్ళీ ఇట్లాజరిగితే బయటకు పంపించవలసి ఉంటుంది. మీ ఇష్టం' అంటున్నాడు గట్టిగా పిచ్చివాడు.

'ఏమిటీ పిచ్చివాడి వింతధోరణి' అని ఆశ్చర్యపడింది సుజాత.

'చదువుకున్నవాడికిమల్లేనే వున్నాడు. ఏం చేస్తాం విధిరాత!' అని సమాధానపరుచుకుంది.

రోజులు గడుస్తున్నాయి. ఆవేళ ఆదివారం. కాలేజీ లేదు. ఇంట్లోనే వుంది సుజాత. ఏమీ తోచటంలేదు. అట్లా కమలా వాళ్ళింటికి వెళ్ళి అటునుంచి మ్యాటనీకన్నా వెళదామా అనుకొంది. ఇంతలోనే ఆకాశం మేఘావృతమైంది. కారుమబ్బులు దట్టంగా వ్యాపించినాయి. జల్లుగా ప్రారంభమైన వాన కుండపోతగా కురవటం ప్రారంభించింది.

ఏడైంది. వాన కురుస్తూనే వుంది ఏకధాటిగా. వీధులన్నీ జలమయం. లైట్లులేవు. అంధకారబంధురంగా వుంది.

'అమ్మా' అన్న కేక వెంటనే పెద్ద పెట్టున మూల్గు వినవచ్చింది. సుజాత నాన్నగారు ప్రక్కభాగంలో ఉన్నాయన బయటికి పరుగెత్తుకొచ్చారు. తమయింటి పిట్టగోడ విరిగి దారిన పోతున్న మనిషిపై బడింది. తలకు బలమైన గాయం తగిలింది. నెత్తురు వరదలై వాననీటి ఎరుపుదనాన్ని ఎక్కువ చేస్తోంది. ఇంటిలోపలికి తీసుకొచ్చి పడుకోబెట్టారు. స్పృహలేదు. పరుగెత్తుకుంటూ వెళ్ళి డాక్టరును తీసుకొచ్చారు. ఇంజక్షను యిచ్చి గాయమునకు కట్టు కట్టాడు డాక్టరు.

'కొత్తగా ఎక్కువగా పోవటంవలన స్పృహ రావటానికి రెండు మూడు గంటలు పట్టవచ్చు. ప్రాణానికి వచ్చిన భయంలేదు. జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూ వుండండి. మళ్ళీ ఉదయమే వస్తాను. అవసరమైతే కబురు పంపించండి' అని లేచాడు డాక్టరు.

అందరు కనిపెట్టుకొని కూర్చున్నారు ఆదుర్దాగా. ఇంకా స్పృహ రాలేదు. 'సుజా నువ్వు కాసేపు ఇక్కడ కూర్చోమ్మా. కొంచెము ఎంగిలిపడి వస్తా'మని లేచారు అయిష్టంగానే.

సుజాత పరిశీలనగా అతనివంక చూచింది.

'అవును. అతనే–ఆ పిచ్చివాడే. ఏమిటీ విచిత్రసంఘటన' అనుకొంది. ఏమీ పాలు పోవటంలేదు. అతనిని చూస్తుంటే పరిచయ స్తులను చూస్తున్నట్లేవుంది. ఏమీ అర్థం కావ టంలేదు. అయోమయంగావుంది.

'ఎట్లాగైనా అతనిని బ్రతికించు దేవుడా' అని ప్రార్థించింది. ఎందుకో తనకు తెలియదు.

'ఏమండీ వెంటనేవచ్చి తీసుకొని వెళతా నని చెప్పి యిప్పుడా రావటం' అంది కోపం అభినయిస్తూ.

'అదికాదు సుజా. ఇల్లు దొరకాల. సెలవు యివ్వాల' అంటూ వడిలోకి తీసు కొన్నాడు.

మూర్తిఒడిలో ఒరిగిపోయింది.

కల కరిగిపోయింది. త్రుళ్ళిపడిలేచింది సుజాత. కళ్ళు చెమర్చినాయి. ప్రక్క గదిలోనుంచి మూలుగు వినపడుతోంది. 'హమ్మయ్య' అనుకొంది. టైము చూస్తే నాలుగైంది.

తెల్లవారింది. వాన పూర్తిగా వెలిసింది. మరుగునపడిన సూర్యభగవానుడు బయల్పడ టానికి ప్రయత్నిస్తున్నాడు.

'అ అబ్బాయి! తెల్లవారుఝామునే నిద్రపట్టింది. దూదమ్మా లేచావేమో. కొంచెము కాఫీ తీసుకొనివెళ్ళి యిద్దువుగాని' అంది సుజాతతల్లి.

గదిలోకి అడుగుపెట్టింది. అతను గోడ వైపుతిరిగి పడుకున్నాడు.

'ఏమండీ' అంది మెల్లగా.

ప్రక్కకు వత్తిగిలి యిటు తిరిగాడు. సుజాత ముఖంలోకి క్షణకాలం చూచాడు.

'సుజా' అన్నాడు గాద్గదికంగా.

సుజాత తెల్లపోయింది. పరిచయమైన గొంతు వినిపించింది.

'నె–నె–నేను నీము–మూర్తిని' అన్నాడు పెకల్చుకుంటూ.

అంతా అయోమయంగా వుంది. ఏమీ అర్థం కావటంలేదు. 'ఎందుకీపరీక్ష. ఇం కెక్కడి నా మూర్తి' అనుకొంది సుజాత. అప్రయత్నంగా కన్నీటిబిందువులు రెండు రాలాయి.

'ఏమిటి సుజా. ఎందుకు కన్నీరు కారు స్తావు? నేనిప్పుడు ఎక్కడ వున్నాను? ఇక్కడికెలా వచ్చాను? అబ్బా ఏమిటీ గాయం?,అన్నాడు మూలుగుతూ.

ఇంతలో సుజాత తల్లిదండ్రులు వచ్చా రక్కడికి.

'మామగారు' అన్నాడు బాధతో.

అంతా నిర్విణ్ణులైనారు. తెల్లబోయి ఒకరి మొగము ఒకరు చూచుకొన్నారు. ఎవరికీ ఏమీ అర్థంకాలేదు.

'ఎవరీతను. ఇట్లా మాట్లాడుతాడేమిటి. పాపం ఎవరనో పొరబడ్డాడు. మతి భ్రమించి వుంటుంది.'

'ఏమిటీ నేను పొరబడ్డాను. ఈమె నా భార్య సుజాతకాదు' అన్నాడు తీక్షణంగా.

గాలికి గదిలో క్యాలెండరు రెప రెప లాడింది. అటువైపు చూచాడు.

'ఆ...ఏప్రిల్ అరవైయ్యా...జాన్ పద్ది నిమిదినిగదా మద్రాసుకు బయలుదేరింది... రైలుప్రమాదంనుంచి బ్రతికి బయటపడ్డానా– నాకు తెలియకుండానే అరవై వచ్చేసిందా– ఇదంతాకల కాదుగదా' అని గొణుక్కో సాగాడు.

సుజాతలో ఆవేదన ఎక్కువైంది. కన్నీరు ధారలు గట్టింది. పరిస్థితి అగమ్యగోచరంగా వుంది.

'ఆ అర్థమైంది' అన్నారు అప్పుడే అక్కడకు వచ్చి సంభాషణ వింటూన్న డాక్టరుగారు.

'ఇతనికి రైలు ప్రమాదంలో మెదడునకు బలమైనగాయము తగిలి వుంటుంది. బ్రతికి బైటపడ్డాడు గాని పూర్వస్మృతిని గోల్పోయి వుంటాడు. మళ్ళీ అక్కడే యిప్పుడు దెబ్బతగిలి వుండటంవల్ల పూర్వ స్మృతి పొందినట్లు కనబడుతున్నాడు.' అన్నారు డాక్టరు.

'నిజమే కావచ్చు. కాని యితను మా మూర్తి ఎట్లా అవుతాడు. పొరబడుతున్న ట్లున్నాడు. ఈ నాచేతులతో నేనే గదా దహనసంస్కారము చేసి వచ్చాను'అన్నాడు సుజాత తండ్రి.

'నేను బ్రతికి వుండగానే నాకు దహన సంస్కారము చేశారా'అన్నాడు విరక్తిగా.

'అంతా విచిత్రంగా వుంది. రైలు ప్రమాదం సంగతి తెలియగానే ప్రమాదం జరిగినచోటికి వెళ్ళాను. ప్రాణాలు కోల్పోయిన వారినందరిని వారి బంధువు లెవ రైనా వస్తే అందచేయటానికి అక్కడే వుంచారు. అటు వెళ్లి చూచాను. గుండె ఆగి పోయింది. మా మూర్తికోటును ఆనవాలు పట్టాను. ముఖము పూర్తిగా వికలమై రూపు మారిపోయింది ఆనవాలు పటలేనంతగా.కోటు జేబులో పర్సుదొరికింది. అందులో మూర్తి ఎడ్రసుకార్డు వుంది. ఒక కాలు ఒక చెయ్యి పోయినాయి. గుండె దిటవుచేసుకొని దహన సంస్కారముచేసి తిరిగి వచ్చాను. మన పిచ్చిగాని యింకా మూర్తి బ్రతికివున్నాడా' అన్నాడాయన.

'అవును తప్పకుండా మీాపిచ్చే. పరిస్థితి యిపుడర్థమైంది' అని చెప్పటం ప్రారం భించాడు మెల్లగా.

నె నెక్కిన కంపార్టుమెంటులో ఎవ్వరూ లేరు. రోజంతా అటు యిటూ తిరిగి అలసి పోయి వుండటంవల్ల నిద్ర తూగుతోంది. ఉక్కగా వుండటంవల్ల కోటుతీసి ప్రక్కన పెట్టి కూర్చోన్నాను. ఇంతలో కునుకు పట్టింది. మెలుకువ వచ్చేటప్పటికి క్రొత్తగా ఎక్కిన ప్రయాణీకులతో కోలాహలంగా వుంది. ప్రక్కకు చూచాను. కోటు కనబడ లేదు. గాబరాగా అంతా కలయచూసాను. ఫలితం శూన్యం. ఇంతలో పెద్ద చప్పుడు. భూమి తలక్రిందులౌతున్నట్లని పించింది. పెట్టెలోనుంచిదూకటానికిప్రయత్నించాను. తలకుబలమైన దెబ్బతగలటం మాత్రము లీలగా గుర్తుంది. తరువాత నాకు ఏమి జరిగిందో తెలియదు. స్పృహ వచ్చేటప్పటికి యిక్కడ వున్నాను.

ఒక అభాగ్య జీవికి దహన సంస్కారము చేసి పుణ్యంకట్టుకొన్నారన్న మాట'అన్నారు డాక్టరు సుజాత తండ్రివైపు తిరిగి.

ఆనందంతో అందరికళ్లు చమర్చాయి.

'సుజా' అన్నాడు జుట్టు నిమురుతూ మూర్తి.

కర్మసాక్షి తన ధవళకిరణములతో వారి నాశీర్వదించాడు.



మాస్టారు— ఒకడు మన గూడెంనుంచి సైకిల్ మీద నల్ల జర్ల వెళ్ళడానికి 80 నిమిషాలు పట్టింది. మన గూడెముకు తిరిగి రావడానికి గంటా ఇరవై నిమిషాలు పట్టింది. ఎందుచేతనో చెప్పు.

గోపి—వెళ్ళేటప్పుడు వాలు గాలి, వచ్చేటప్పుడు ఎదరగాలి కారణమండీ.

మాస్టారు—రాముా, నువ్వు చెప్పరా?

రాముా— సైకిల్ చెయిను వదులు అయి ఉంటుంది సార్ !

– కాదూరి దుర్గాప్రసాద్
(తాడేపల్లిగూడెం).




**8-8-60 బుధవారం మొదలు**
**9-8-60 మంగళవారం వరకు.**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ సమయంలో ఏ సందర్భంలో మాట్లాడబోయినా తగాదాలు వస్తవి. అధికారులతో స్నేహం లభిస్తుంది. బంధువుల కార్యభారం మిమ్ములను చికాకుపరుస్తుంటుంది. వృత్తికి సంబంధించిన పనులలో ఒక సమయంలో ఉన్న ఉత్సాహం మరొక సమయంలో కనుపించదు. మొత్తంమీద దైవబలంవల్ల అనుకూలంగా జరుగుతవి. ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందగలవు. మీకు సంపూర్ణమైన తృప్తి లేకపోయినా ధనం పెట్టుబడి పెట్టవలసిన అవసరం కలుగుతుంది. ఆస్తి కొనే ప్రయత్నాలు సుముఖంగా జరుగుతవి. కుటుంబంలోనివారికి తీవ్రమైన అనారోగ్యం కనుపిస్తుంది. వారాంతంలో శుభసంబంధమైన ఖర్చులు వస్తవి. 4, 5 తేదులలో సౌఖ్యలోపం. అపవాదులు, మిత్ర లాభం.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

కుటుంబ కార్యనిర్వహణ శ్రమకరంగా తోస్తూ ఉంటుంది. అయితే ఉత్సాహంతో బాధ్యతలను నెరవేర్చుకోగలుగుతారు. ధనాదాయం పెరుగుతుంది. అవతలివారి అభిప్రాయాన్ని తెలుసుకోలేక తొందరపడటంవల్ల పశ్చాత్తాపపడవలసి వస్తుంది. వ్యవహారరంగంలో మీ యోచనలు కార్యరూపం పొందగలవు. త్రిప్పట, ధనవ్యయము విశేషంగా ఉంటవి. సంఘంలో మంచి పేరు సంపాదించుకుని స్థిమితంగా ఉండగలుగుతారు. వారం రెండవ భాగంలో మిత్రుల సలహావల్ల చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది. విలాసకార్యాలకై ధనవ్యయం చేస్తారు. ముఖ్యమైన వస్తువులు పోయే అవకాశాలున్నవి. 6, 7 లలో విశేష ధన లాభం. ధర్మకార్యాలు. వృత్తి వ్యాపారాలలో మంచి మార్పులు.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రస్తుతం మీ ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. స్వంతపనులలో శ్రమ కనుపించినా జయప్రదంగానే నెరవేరుతవి. విరోధులు మిమ్ములను ముందుకుపోకుండా చేయడానికి పూనుకోవచ్చు. స్నేహితుల సహాయం బాగా లభిస్తుంది. నౌకరులు మొదలయినవారివల్ల కార్యసానుకూలత ఉంటుంది. ప్రయాణాలు చేయవలసివస్తుంది. దూరమందున్న బంధుమిత్రులకు వ్రాసే ఉత్తరాలవల్ల ముందుముందు విరోధాలు రాకుండా చూచుకోనండి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనము, విలువగల వస్తువులు మొదలయినవాటినిగురించి తొందరపడటం మంచిది కాదు. వారాంతంలో అకస్మాత్తుగా దేహబాధలు కలిగే అవకాశాలున్నవి. 3, 4, 5 లలో స్వశక్తివల్ల సంఘంలో ఉన్నతస్థితి, వ్యవహారాలలో మధ్యవర్తిత్వం.

## గ్రహస్థితి

వృషభంలో అంగారకుడు, మిథున కర్కాటకాలలో బుధుడు, కర్కాటకంలో సూర్యుడు, కర్కాటక సింహాలలో శుక్రుడు, సింహంలో రాహువు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు, వృశ్చిక ధనుర్మకర కుంభాలలో చంద్రుడు.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఇంతకుముందు ఉన్నటువంటి భయాందోళనలు తొలగిపోయి వృత్తి ఉద్యోగాలలో అభివృద్ధిని పొందగలుగుతారు. ఇతరులు మిమ్ములను కవ్వించినా నిబ్బరంతో ఉండి మీ పనిని సాధించుకుంటారు. ముందు ఖర్చు చేయటంవల్ల, ఎంత ఆదాయం వచ్చినా చేతిలో కానీ మిగలకుండా పోతుంది. పిల్లలమూలంగా సుఖశాంతులు లభిస్తవి. అన్ని మార్గాలలోను బుద్ధి చురుకుగా పనిచేయటంవల్ల ఇతరులు మిమ్ములనుగురించి సందేహం పడకుండా జాగ్రత్తపడగలుగుతారు. విలువగల వస్తువులు కొంటారు. డబ్బు విశేషంగా పెట్టుబడి పెట్టి చేయదలచుకున్న పనులు మొదట్లో చురుకుగా సాగినా వారాంతంలో ఆటంకాలు కనుపిస్తవి. మీకు సహాయం చేస్తామని చెప్పేవారి మాటలను నమ్మి డబ్బు చేతికి ఇవ్వవద్దు. 6, 7 లలో ఇతరులతో కలసి చేయు పనులలో అనుకూలత. శుభవార్తలు. అధికారుల మైత్రి.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ముందుగా నిర్ణయించుకోకుండా కార్యరంగంలో ప్రవేశించవలసి వస్తుంది. ఒకప్రక్క ప్రోత్సాహం కనుపిస్తున్నా మరొకప్రక్క డబ్బు ఇబ్బందివల్ల కార్యకలాపాలలో మందం కనిపిస్తుంది. కొన్ని సందర్భాలలో అవతలివారితో రాజీమార్గంలో పోవలసివస్తుంది. ముఖ్యమైన సమయంలో మిత్రుల సలహా లభించటంవల్ల చిక్కులలో పడకుండా తప్పించుకోగలుగుతారు. మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. బంధువుల రాకపోకలు అధికం అవుతవి. పదిమందికి సంబంధించిన పనులలో మీ బాధ్యత పెరుగుతుంది. ప్రస్తుతం పేరు ప్రతిష్ఠలకోసం ప్రాకులాడతగిన సమయం కాదు. 8, 9 లలో ఆత్మీయులవద్దనుంచి కష్టవార్తలు. కలిసిమెలిసివుండేవారితో విరోధం.

* * *

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈ వారం మీ శక్తిసామర్థ్యాలను వినియోగించుకొని సాటివారిలో గౌరవం పొందగలుగుతారు. ఆదాయం పెరుగుతుంది. మీ మాట నేర్పువల్ల ఇతరులను ఆకర్షించగలుగుతారు. ప్రయాణాలు సకాలంలో జరిగి సక్రమంగా ఫలితం పొందగలుగుతారు. నూతన కార్యక్రమాలు ఆరంభించతగిన సమయం. అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. మీ న్యాయప్రవర్తన వల్ల మొదట కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసివచ్చినా పర్యవసా

## ఈవారము ధరలు:—

బంగారు ధర 4, 5 తేదులలో పెరిగి పిమ్మట తగ్గుతుంది. వెండి ధర 6, 7 తేదులలో తగ్గుదలలో ఉంటుంది.

పసుపు ధర క్రమంగా పెరుగుతుంది. మందీరాదు. వేరుశెనగపప్పు ధర గత వారం మాదిరిగానే యుండి 8, 9 లలో పెరగవచ్చు. శెనగనూనె, నూవుల నూనె ధరలు గిరాకీలో ఉంటవి.

గోధుమ ధర తేజీ అవుతుంది. శెనగలు ధర కొద్ది మందీ, మిర్చి ధర తేజీలో నిలకడ.

నంలో జయం పొందగలుగుతారు. ఎంత స్నేహితులైనా వారు చెప్పే ప్రతి విషయాన్ని నమ్మవద్దు. మీకు మీ బంధువులకు మధ్య విరోధాలు ప్రబలకుండా చూచుకోనండి. చట్టా వ్యాపారంవంటి పనులలో దిగవద్దు. వస్త్రాలు, అలంకారాలు మొదలయినవి కొనటం జరుగుతుంది. 3,4, తేదీలలో విశ్రాంతి, పుణ్యకాలక్షేపం, సంఘ కార్యాలు, దక్షిణ దిక్కునుంచి లాభవార్తలు.

* * *

### తులా :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

మిమ్మల్ని చికాకుపరచి ముందుకు వెనుకకు ఊగించగల సమస్యలు వచ్చేసమయం. అన్నీ శుభసూచనలే. కాని, మీధర్మాన్ని ఎలా నిర్వర్తించుకోవలెనో తెలియక ఆందోళన కలుగుతుంది. వృత్తివ్యాపారాలలో అభివృద్ధికరమైన సమయం. సకాలంలో పనులు నెరవేరి సంతృప్తికరమైన ఫలితం లభిస్తుంది. బంధువులవల్ల ఖర్చులు పెరిగే అవకాశాలున్నవి. సమయంలో మిత్రులు అన్ని విధాలా సహాయంచేస్తారు. ఇతరుల మెప్పుదలకోసం వృధాగా శ్రమను పైనవేసుకోవద్దు. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. ఇతరులకు సలహా చెప్పటం, వ్యవహారాలు పరిష్కరించటంవంటి పనులు తప్పనిసరికావచ్చు. వారాంతంలో దేహబాధలు వస్తవి. 5,6,7 తేదులలో ధనప్రాప్తి, మిత్రుల వల్ల కార్యసాఫల్యం.

* * *

### వృశ్చికం:

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీమాట ప్రకారం నడుచుకోవలసినవారు కూడా చాటుగా మిమ్మల్ని ఇబ్బంది పెట్టటానికి పూనుకుంటారు. బుద్ధిబలంతో చిక్కులను తొలగించుకుంటు మీ నిర్ణయంప్రకారం కార్యం సాధించుకోగలుగుతారు. అయితే పనులలో ఆలస్యం మాత్రం కనుపిస్తుంది. మీశక్తిసామర్థ్యాలతో సాటివారిలో ఉన్నతస్థితిని అందుకోగలుగుతారు. ఇంతకుముందు వదలి ఉన్న ప్రయత్నాలు తిరిగి ఆరంభించగలుగుతారు. ఉష్ణాధిక్యతవల్ల దేహసౌఖ్యం లోపిస్తుంది. ప్రస్తుతం వ్యవహారరంగంలో సాహసం పనికిరాదు. ఈ సమయంలో జరిగే ధనవ్యయంవల్ల తగినంత ఉపయోగం పొందలేకపోతారు. విశ్రాంతిగా ఉండామని ప్రయత్నిస్తారు. కాని సాధ్యం అయేటట్లు తోచదు. 6, 7 తేదులలో వృత్తిలో అనుకూల సూచనలు, అధికారుల ఆదరణ.

* * *

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా 1)

శ్రమను భరించగల ఓర్పు, పదిమందికి అనుకూలమైన చాకచక్యము వీటివల్ల సంఘంలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకోగలుగుతారు. మీ విరోధివర్గంలోనివారు కూడా మిమ్మల్ని అనుసరిస్తారు. స్వశక్తివల్ల ఒకానొక ఘనకార్యం సాధించగలిగామనే సంతృప్తి పొందగలుగుతారు. విశేష ధనంతో జరుగవలసినపనులు నెరవేరి మనస్సుకు విశ్రాంతి లభిస్తుంది. పడమరదిక్కునుంచి కష్టవార్తలు తెలియవచ్చు. కుటుంబంలో మాత్రం మీరు అనుకున్నట్లు సుఖశాంతులు లభించకపోవచ్చు. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం నిదానంగా లభిస్తుంది. ధర్మకార్యాలు నెరవేరుతవి, జీర్ణకోశ సంబంధమైన బాధలు కనుపిస్తవి. 8, 9 లలో మీ యోచనలకు ప్రతిబంధకాలు వస్తునష్టం.

* * *

### మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

మీరు ఎదురుచూస్తున్న పనులు ఎటు తేలవు. దైవికంగా కొత్త మనుష్యులతో లావాదేవీలు ఆరంభం కాగలసూచన లున్నవి. క్రమంగా ఆదాయం పెరుగుతుంది. మధ్య మధ్య నిరుపయోగమైన పనులుకూడా కొన్ని చేయవలసివస్తుంది. అధికారులవల్ల ఉపయోగం పొందగలుగుతారు. బంధువులవద్దనుంచి అనుకూలవార్తలు వస్తవి. ధనసంబంధమైన చిక్కులు చాలాభాగం తీరిపోయి మనశ్శాంతి లభిస్తుంది. వృత్తి వ్యాపారాలలో తలవనితలంపుగా కలహప్రసంగాలు వచ్చి కొంచెం చికాకు కలిగినా వెంటనే తీరిపోతవి. ఖర్చులు పెరగటంవల్ల చికాకుపడుతు ఇతరులకు సహాయంచేయవలసిన అవసరం ఏర్పడటంవల్ల విశేషంగా బాధపడవలసి వస్తుంది. 4,5,6 తేదులలో ప్రయాణ సూచనలు, విశేషంగా ధనవ్యయం.

* * *

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఇంతకుముందు మీరుపడిన ఆందోళనకు ఒక పరిష్కారమార్గం లభిస్తుంది. బంధువుల సహాయం బాగుంటుంది. వృత్తిలో చురుకుగా ముందుకుపోగల అవకాశాలు లభిస్తవి. మీకు రావలసినధనం సకాలంలో వస్తుంది. మీ కార్యకలాపాలలో పొరపాట్లు రాకుండా చూచుకోవటం అవసరం. సాధ్యమైనంతవరకు ప్రయాణాలు మానటం మంచిది. కుటుంబ సమస్యలు చాలావరకు సర్దుబాటుకావటంవల్ల మనశ్శాంతి లభిస్తుంది. మిమ్మల్నుగురించి కొంతమంది తప్పుగా అభిప్రాయపడటంవల్ల కలహప్రసంగాలు వచ్చి సమసిపోగలవు. ఈశ్వరారాధన జరుపుకోనటం మంచిది. ఆరోగ్యాభివృద్ధి, మనశ్శాంతి లభిస్తవి. 7, 8 తేదులలో ఖర్చులు, త్రిప్పట, కారణంలేని కలహాలు.

### మీనం

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

* * *

ఈ వారం గ్రహబలం బాగుంది. పర్యవసానంలో అనుకూలం జరిగినా ఆరంభంలో మీ ధైర్యాన్ని పరీక్షిస్తేనే గాని ఆ పనులు నెరవేరవు. వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతమైనకాలం. సాటివారిలో పేరుసంపాదించుకుంటారు. ఉద్రేకం పెరగకుండా చూచుకోనండి. ఇంతకుముందుకన్నా ఆదాయం పెరుగుతుంది. మీమాటకు విలువ లభిస్తుంది. కుటుంబంలో శుభసంతోషాలు లభిస్తవి. ధనసంబంధమైనసమస్యలు తొలగిపోతవి. ఉత్తరదిక్కునుంచి అనుకూలవార్తలు తెలుస్తవి. శత్రుబాధలు తొలగిపోతవి. వ్యవహారకార్యాలలో తొందరపడవద్దు. వారం రెండవ భాగంలో ఆప్తమిత్రులతో ఎడబాటు కలుగవచ్చు. 6, 7 తేదులలో కార్యసిద్ధి. పెద్దవారితో పరిచయం.

—దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

# పూర్ణయామిని

౩౦

(23 వ పేజీ చూడండి)

ఆవిడ యామినిప్రవర్తనకు ఆశ్చర్యపడుతూ, తనరక్తం తీసుకుని నాకు ఎక్కించారట. రక్తం తీయడంవల్ల బలహీనం అయిపోయి రాత్రంతా యామిని నన్నుగురించే కలవరిస్తూ సరిగ్గానిద్రపోలేదట. తనకి ప్రొద్దున్నే కాస్త నిద్రపట్టిందిట. ఆతర్వాత మాయిద్దరినీ జాగ్రత్తగా చూడమని చెప్పి మా వార్డను వెళ్ళిపోయారు. డాక్టరుగారు కూడా ఏదో సీరియస్ కేస్ చూడాలని అక్కడనుండి వెళ్ళిపోయారు.

నేను మెల్లిగా కళ్ళుతెరచి నాప్రక్కనే వున్న బెడ్ చూసాను. యామిని ఎంతో ప్రశాంతంగా నిద్రపోతూ కన్పించింది. నిద్రలోకూడా నవ్వుతోంది ఏదో కమ్మని కలగన్నట్లు – వెంటనే లేచి వెళ్ళి తనని కౌగిలించుకోవాలనిపించింది. అన్నాళ్ళుగా నాలో పేరుకొనిపోయిననిర్లక్ష్యం, అయిష్టత, కోపం మంచులా కరిగిపోయింది. యామిని నా కోసం అంత త్యాగం చెయ్యడానికి కారణంకొంతమందికి తనుచేసినది త్యాగంలా కనుపించకపోవచ్చు. కాని నేను తనని ఎంతగా కసరికొట్టినాసరే, ఆపదలో నాకు తనుచేసినసహాయాన్ని ఏమనాలి? నేను అప్పటికైనా కళ్ళు తెరచినందువల్ల తన సహాయాన్నే కాకుండా, తన మనస్సుని అర్థం చేసికోగలాను. ఇన్నాళ్ళూ తన స్నేహామాధురిని కాళ్ళతన్నినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. తను మేల్కొన్నతరువాత ఎట్లా పల్కరించడమా అని ఎంతో సిగ్గుపడ్డాను. అంతలో యామిని మేల్కొంది. నేను మెలకువగానూ, కాస్త కులాసాగానూ వుండటం చూసి తన మొహం పుచ్చపువ్వులా వికసించింది. నా మొహంలో మార్పునుకూడా గుర్తించగలిందనుకుంటా మెల్లిగా లేచి వచ్చి నాప్రక్కన కూర్చుంది. తనని ఎట్లా క్షమార్పణ అడగాలో అంతవరకూ ప్లాను వేసుకున్న నేను అప్పుడు అసలు నోరు విప్పలేకపోయాను. కాని మాకళ్ళూ, మనస్సులూ మూగగా ఏమో మాట్లాడుకున్నాయి. నర్సు వచ్చి పిలిచేంతవరకు మేమిద్దరం అసలు యీలోకంలో లేము. నర్సు నా తలకు బాండేజ్ సరిగ్గా కట్టేసి వెళ్ళిపోయింది.

అంతలో యామిని తన పర్సులోనుండి డైరీతీసి ఏదో వ్రాసి మళ్ళీ వచ్చి నాదగ్గర కూర్చుంది. అంతవరకూ మేమిద్దరం అసలు మాట్లాడుకోలేదు. నా కెందుకో తనడైరీ చదవాలనిపించింది. నాకుకూడా డైరీ వ్రాసే అలవాటుంది. ముఖ్యంగా పూర్ణవిషయంలో నాభావాలూ, అనుభవాలూ వ్రాసుకునే

దాన్ని డైరీలో. అందువల్ల యామిని డైరీలో నాగురించి వ్రాసుకొనివుండాలని వూహించి తనని అడిగాను డైరీ యిమ్మని. యామిని ఒక్క నిమిషం ఆలోచించి లేచివెళ్లి డైరీ తెచ్చి నాకిచ్చింది. ఒక్కొక్క పేజీ చదువుతూ వుంటే యామినిమీద జాలి, నామీద నాకే కోపం పెరగసాగాయి. నేను నా డైరీలో ఏమి వ్రాసుకున్నానో అవే భావాలు. నేను పూర్ణ కనుపించకపోతే ఎంతబాధపడేదాన్నో నేను కన్పించకపోతే యామిని అంతబాధపడేదట. నాకిష్టంఅయినఅమ్మాయికి నేనంటే ఇష్టం లేదని తెలిస్తే నాకు ఎంతకష్టంగా వుంటుందో తెల్సు. ఆసంగతిమాత్రం నేను కలలోగూడ వూహించలేను. అదేవిధంగా నాకు తనంటే యిష్టంలేదని తెల్సి యామిని ఎంత బాధపడి వుంటుందో అప్పుడే తెల్సుకోగలిగాను. నన్ను పూర్ణ నిర్లక్ష్యంచేసినా ప్రేమనుగుర్తించకుండావుంటే నా కెంతబాధ కల్గేదో ఒక్కసారి ఆలోచిస్తే, యామినిబాధ నాకు అర్థం అయివుండేది మొదటనే. మనలను మన స్ఫూర్తిగా ప్రేమించే వ్యక్తులు దొరకడం చాలా అరుదు. అందులోనూ మనం అంటే ఎవరికైనా ఎంతో యిష్టమని తెలిస్తే మనం ఎంత సంతోషపడతాం? నేను పూర్ణని ఎట్లా ప్రేమించానో అట్లాగేయామిని నన్ను ప్రేమిస్తుందంటే; ఆవిలువ, ప్రేమ నాకొక్కదానికే అర్థంఅవుతాయి. నన్ను సంతోషపెట్టాలనీ, అదే తనకు ఆనందమనీ భావించే యామినిని నేను తిరిగి సంతోషపెట్టడంకంటె చెయ్యవలసిందేముంటుంది? అంతవరకూ తనని నిర్లక్ష్యం చేసినందుకు నన్ను నేనే నిందించుకుని మిగిలిన కాలం తనతో ఎట్లా గడిపానో చెప్పనవసరం లేదనుకుంటా.

నేను ఒక ఫోటో ఫ్రేములో మధ్య నా ఫోటో పెట్టి, అటూ ఇటూ యామినీ పూర్ణల ఫోటోలుపెట్టుకున్నాను. అది చూసి ఒకసారి రుక్కు, వాళ్లిద్దరిలో ఎవరంటే నా కెక్కువ యిష్టం? అని అడిగింది. ఎవరినైనా మల్లె గులాబీలలో నీకు ఏది ఇష్టమంటే ఏంచెబుతారు? మల్లె పరిమళానికీ, గులాబీ మృదుత్వానికీ సాటిలేనివి. యామినీ పూర్ణలలో ఒకరు మనస్సున మల్లెలు విరియిస్తారు. ఇంకొకరు గులాబీలను గుబాళింప చేస్తారు. అందువల్ల రుక్కు ప్రశ్న జవాబులేని ప్రశ్నే అయ్యింది. నేనెప్పుడూ మా ముగ్గుర్నీ విడదీసి ఎవరెక్కువ అని ఆలోచించలేను.

ఆ సంవత్సరం నేను, యామినీ, పూర్ణ ఎట్లా గడిపామో చెప్పాలంటే, మాస్నేహాన్ని చూసి చాలామంది ఈర్ష్యపడేవారంటే అతిశయోక్తి కాదు. ఆ తర్వాత ముగ్గురం విడిపోవాల్సి వచ్చింది. కాని మనుష్యులు దూరమైనంతమాత్రాన మనసులు దూరమౌతాయా? ఎవరికి వీలు కల్గినప్పుడు వాళ్ళం ఉత్తరాలు వ్రాసుకుంటూనే ఉన్నాము. కాని అంతా తలోమూలా ఉండడంవల్ల మేం ముగ్గురం కల్సుకోవడాన్కి ఇంతవరకూ వీలు కాలేదు. కాలగర్భంలో ఎన్ని కలిసిపోయినా, మా ఆనాటి స్నేహమ్మాత్రం చెక్కుచెదరకుండా వుండడం నాకు నిజంగా గర్వించదగ్గ విషయమే. ఆ గడచిపోయిన రోజులు తిరిగి రాకపోయినా, బాల్య మధుర స్మృతులను దృష్టికితెచ్చే ఆ జ్ఞాపకాలు మాత్రం ఎన్నటికీ మాయవు. యామినీ పూర్ణలను జ్ఞాపకంచేసేపూర్ణ చంద్రుడంటే అందుకే నాకంత ఇష్టం. మేం ముగ్గురం కల్సుకొనే మధురక్షణం ఎప్పుడొస్తుందో నని ఒక నిట్టూర్పు విడిచాను.

అంతలో "ఊహాలోకంనుండి ఇప్పటికి ఊడిపడ్డావా?" అంటున్న అక్కయ్య మాటలు నన్ను పూర్తిగా ఈ లోకానికి తీసుకొచ్చాయి. ప్రక్కనే మెల్లగా పారుతున్న గోదావరీ, ఆ ఇసుక తిన్నెలూ, ఆ చందమామా, అంతా అట్లాగే ఉన్నారు. "నిన్ను నవరసాలూ ప్రదర్శింపజేసిన ఆ ఊహా గానమేదో మాక్కూడా విన్పించకూడదూ?" అన్నాడు అన్నయ్య. కాని, కథల్లోతప్ప మాలాంటి మనుష్యులున్నారంటే నమ్మలేని వారికి నా భావాలేం అర్థం అవుతాయి? అటువంటివాళ్ళకి నా చిరునవ్వే సమాధానం. ★











# వనితాలోకం

## పూసలలో దారంగా దంపతులు పరస్పరం...

మా పిన్ని కుమారుడు బాగా చదువుకొన్నాడు. మంచి ఉద్యోగంకూడా దొరికింది. పెండ్లి సంబంధాలు ఎన్నో వచ్చాయి. కాని మా వాడికి ఏసంబంధము నచ్చలేదు. అమ్మాయి అందంగా వుంటే, గుణంవుండొద్దా అనేవాడు. మంచికుటుంబానికి చెందిన అమ్మాయిని చూపించితే గుణంతోబాటు అందంకూడా వుండొద్దా అని అనేవాడు. చివరికివిరికోరి తనకునచ్చిన అమ్మాయిని తన యిష్టప్రకారం పెండ్లి చేసుకొన్నాడు. పెండ్లికాగానే భార్యను తీసుకొని వెళ్ళిపోయాడు. మంచి రాబడిగల ఉద్యోగం. సుఖంగా వుంటారని అంతా అనుకొన్నారు. ఒక సంవత్సరం గడిచింది. సెలవలకు అంతా ఇంటికివచ్చారు. కాని మా వాడికి వెనుకటి ఉత్సాహంగాని, సంతోషంగాని ఏమీవున్నట్లు కనపడలేదు. పెండ్లి ఎందుకు చేసుకున్నానా అని బాధపడడం కూడా ప్రారంభించాడు. అంతటితో ఆగక 'తెచ్చినడబ్బంతా దానికే యిస్తున్నాను. ఇంటి పెత్తనమంతా అదే చెలాయిస్తూవుంది. అయినా పూరుకుంటేనా? చీటికీమాటికీ ఒకటేగోల. కొంచెం అలుసుయిస్తే నెత్తికెక్కేలావుంది. అసలు యీ ఆడవాళ్ళంతా ఇంతే. వీళ్ళను అర్థంచేసుకోవడం కష్టం. పెండ్లిఅయినతరువాత జీవితం హాయిగా గడుస్తుందికదా అని అనుకొన్నాను. కాని కాపురంఅంటే పెద్దముళ్ళకంప అని ఇప్పుడు అర్థమైంది" అంటూ విమర్శ మొదలుపెట్టాడు.

ఈవిధంగా అంటూవుండే మగవారిని చాలామందిని చూస్తూవుంటాం. ఇందుకు కారణం మగవారు మగువలమనస్సును అర్థంచేసుకొని వ్యవహరించకపోవడమేనని తోస్తుంది. పెండ్లి అయినతరువాత తన భార్య ఆదర్శగృహిణిగాను, మాతృదేవతగాను, సదాచారసంపన్నురాలుగానువుండి తన ఆజ్ఞలను శిరసావహిస్తూ వినమ్రతతో ఆదర్శపత్నిగా వ్యవహరించాలని సామాన్యంగా మగవారంతా ఆశిస్తూవుంటారు. ఇదంతా బాగానేవున్నది. కాని స్త్రీకికూడాహృదయమంటూ ఒకటి వుంటుందని, అది ప్రేమతో నిండివుంటుందని, ఆప్రేమనంతటిని తనను మనసారా ప్రేమించే భర్తకు సమర్పించాలని ఆమె ఆశిస్తూవుంటుందని, కేవలం తన శరీరాన్ని మాత్రమే ఆశించేభర్తకు తన ప్రేమమయమైన హృదయాన్ని సమర్పించజాలదని పురుషులు కొంచమైనా గ్రహించరు. పురుషుని జీవితంలో తల్లిగాను, సోదరిగాను, భార్యగాను పాల్గొని స్త్రీ అనేకరకాలుగా సేవచేస్తూవుంటుంది. అయినా స్త్రీలను అర్థంచేసుకోలేక యిష్టంవచ్చినట్లు వ్యవహరించి స్త్రీలను రెచ్చగొట్టి పురుషులు వారిని పెడత్రోవల పెడుతూవుంటారు. స్త్రీ ఎంతశ్రమ అయినా పడుతుంది. తన సర్వస్వము భర్తకు సమర్పించివేస్తుంది. కాని అందుకుబదులుగా భర్తయొక్క చల్లనిచూపును ఆశిస్తుంది. తనయెడ భర్త హృదయపూర్తిగా సానుభూతిని చూపితే, తన గుణగణాలను భర్త ప్రశంసించితే, కొంతవరకైనా భర్త సహకరించితే, భార్య పొంగిపోతుంది. సామాన్యంగా స్త్రీ పురుషుని శరీరసామీప్యంకంటె హృదయసామీప్యాన్ని ఆశిస్తుంది. అది లభించనప్పుడు ఆమె అహం దెబ్బ తింటుంది. దానితో ఎడమొహాలు పెడమొహాలు ప్రారంభం అవుతాయి.

ఇక మా స్నేహితురాలికథ వినండి. కాలేజీలో చదువుకున్నది. కావాలని పట్టుబట్టి ఒకబ్బాయిని ప్రేమించి పెండ్లి చేసుకొన్నది. కాపురానికి వెళ్ళింది. చాలా రోజులకు యిద్దరం ఒకరికొకరు కలుసుకున్నాం. మాటల సందర్భంలో కాపురాల సంగతి కూడా వచ్చింది. ఆమె ధోరణి చాలా మారిపోయింది. "ప్రేమ, హృదయాల కలయిక అంటూ ఏమేమో కలలు కన్నాను.

వెమూరి శాంతాదేవి

కాని అవన్నీ చివరకు కల్లలేనని తేలిపోయింది. ఆయనకోసం ఎంతో త్యాగం చేశాను. అమ్మ నాన్నకు కూడా ఎదురుతిరిగాను. ఆయనే నా సర్వస్వం అనుకున్నాను. కాని నేను అనుకొన్నదంతా తప్పేనని తేలిపోయింది. జీవితంలో మంచి దెబ్బ తిన్నాను. ఇక మా యిద్దరికీ కుదిరేలా లేదు. ఎవరి త్రోవ వారిదే" నంటూ ప్రారంభించింది.

అసలు ఏం జరిగిందో చెప్పమని ప్రశ్నించాను. ఆమె కండ్లనుండి కన్నీరు కారసాగింది. ఇలా అన్నది—"పగిలిపోయిన అద్దం ముక్కలు తిరిగి కలుస్తాయా చెప్పు! స్త్రీల హృదయంలోనికి ప్రవేశించిచూస్తే వారి హృదయంలో ఎన్ని గాయాలు వున్నాయో, ఎన్ని బాధలు వున్నాయో బోధపడుతుంది యీ పురుషులకు. స్త్రీ చేసే త్యాగమంతా తిండీ బట్ట కోసమేనా! జీవితంలో అనేక వస్తువుల అవసరం వుంటుంది. అందులో ప్రేమ కూడా ఒకటి అని పురుషుల భావం. కాని స్త్రీకి మాత్రం ప్రేమే ప్రధానం. స్త్రీలకు, పురుషులకు అసలు దృక్పథంలోవున్న తేడా యిదే."

ఆమె మాటలు విని కొంచెం ఆలోచించి యిలా అన్నాను: "నీవు చెప్పింది నిజమే. కాని పురుషులవాదం కూడా గమనించాలికదా? స్త్రీలు పురుషులమీద హద్దుమీరి అధికారం చెలాయించాలని చూస్తారు. రోజురోజుకు స్త్రీల పట్టుదల పెరిగిపోతూవుంటుంది. దానితో స్త్రీ అంటే వుండే గౌరవం కాస్తా పోతుంది. ఇదీ పురుషులు స్త్రీలపై చేసే ఆరోపణ. ఇంతేగాక మరొక్క విషయం కూడా ఆలోచించాలి. స్త్రీ యింటిలోపలే వుండి పని చూచుకొంటుంది. కాని పురుషుని వ్యవహారం అలా కాదు. వాళ్ళకు అనేకపనులువుంటాయి. పెద్ద పెద్ద త్రాళ్ళను ముడివేసి ఆ ముడిని వూడదీయమంటే తీస్తాడుగాని చిక్కుబడిపోయిన దారాన్ని తెచ్చి చిక్కు విడదీయమంటే విసుక్కుంటాడు. తన భార్యనుగురించి భర్తకు తేలికభావం ఏర్ప




ఉందా, యిక పరాయి స్త్రీ దగ్గరకు వెడతాడు. కొంతకాలం ఆమె దగ్గర శాంతి సౌఖ్యాలు లభిస్తాయి. కాని ఆమె కూడా అధికారం చలాయించడానికి ప్రయత్నిస్తుంది. దానితో ఆమెను వదిలి మరోచోటకు వెళుతూ వుంటాడు. ఈ విషయాన్ని గమనించి స్త్రీలు నడుచుకోవద్దా?"

వెంటనే ఆమె అందుకొన్నది. "నీవు చెప్పింది సరికాదు. అసలు మొగవాళ్ళకు ప్రేమ అంటే ఏమిటో, మమత్వం అంటే ఏమిటో తెలుసా అని? అతడు కేవలం భ్రమరం వంటివాడు. రంగు రంగుల పుష్పాలదగ్గరకు వెళుతూవుంటాడు అతనికి కావలసింది విభిన్నత్వం. ఇందువల్లనే వివాహానికి విలువపోతూవుంది. ఆదర్శవాది యగుభర్త, ఆదర్శవాదియగు తండ్రి అని లెక్కించతగిన పురుషులు బహుకొద్దిగా కనబడుతూవుంటాయి. ఆదర్శప్రాయంగా వ్యవహరిద్దామనే భావమే వారికి వుండదు. కనీసం భార్యను సంతోషపెడదామని కూడా వారు అనుకోరు."

ఆమె మాటలకు జవాబుగా - "అందుకు కారణం ఒక్కటే పెండ్లికానంతవరకు స్త్రీని పురుషుడు ప్రేయసిగా గౌరవిస్తాడు. పెండ్లి అయిన తరువాత వాళ్ల తత్వం మారిపోతుంది. ఇల్లు వాకిలి, పిల జెల్ల మొదలుగాగల కుటుంబబాధ్యతలు వారిపైన పడతాయి. దానితో ప్రేమ వ్యవహారాలు మరుగున పడిపోతాయి" అని అన్నాను.

కాని నావాదనను ఆమె అంగీకరించలేదు. కుటుంబబాధ్యతలకు పురుషుని ప్రేమ తత్వానికి ముడిపెట్టవద్దు. అది గౌణవిషయం. తెలివిగలపురుషుడు ఆదర్శవంతుడగు భర్తగాను, ప్రియుడుగాను వ్యవహరిస్తాడు. ఉదాహరణకు మాపిన్నిని చూడు. వయస్సు మళ్లినా భార్యాభర్తలిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుంటారు. ఆ వుత్సాహం ముందు వయస్సులోవున్న స్త్రీలుకూడా ఎందుకూ పనికిరారు. ఆమె తన జీవితంలో చాలా కష్టాలు అనుభవించింది. అత్త, ఆడబిడ్డలు, ఆమెను చాలా బాధలుపెట్టారు. కాని మాబాబాయి చాలా మంచివాడు. స్త్రీ హృదయాన్ని బాగా అర్థం చేసుకున్నాడు. ఆయనే మాపిన్నికి బాగా ధైర్యం చెబుతూ, ఆమెకు ఆత్మవిశ్వాసం పురికొల్పి కష్టాలను ఎదుర్కొనేలా ఆమెను సిద్ధపరచాడు. దానిలో ఆమె ధైర్యం నిలబడిపోయింది. మావారే లేకపోతే జీవితంలో నేను ఎప్పుడో దెబ్బతినిపోయే దానినని మాపిన్ని యిప్పటికీ చెబుతూ వుంటుంది. ఒక పర్యాయం మా బాబాయిని కూడా యీ విషయమై అడిగాను. ఆయన "అమ్మాయీ! పురుషునికంటె స్త్రీకి సహనశక్తి, ధైర్యం, పట్టుదల ఎక్కువగావుంటాయి. మీ పిన్నిలో వున్న యీ సుగుణాలను నేను గుర్తించాను. ఆమెలో అంతర్నిహితమైయున్న త్యాగభావాన్ని ప్రశంసించాను. కష్టాలను ఎదుర్కొని జీవితంలో నాకు తోడునీడగా వుండమని కోరాను. అనేక విషయాలలో నాకంటె ఆమెకు యోగ్యత ఎక్కువగా వుందని గుర్తించాను. నిజంగా ఆమెను అర్ధాంగిగాభావించి వ్యవహరించాను. అందువల్లనే గృహకలహం అంటే ఏమిటో నేను ఎరుగను. తన త్యాగభావాన్ని నేను గుర్తించానని, తనను నేను గౌరవిస్తున్నానని, మీ పిన్ని గ్రహించింది. అప్పటినుండి ఆమె దేవతగా మారిపోయింది. అందువల్ల పురుషుడు స్త్రీకి సాయంచేసినా చేయకపోయినా ఫరవాలేదుకాని, ఆమె యెడ సానుభూతితో వ్యవహరించి ఆమె సుగుణాలను గుర్తించి ప్రశంసించడంమాత్రం అత్యవసరం. స్త్రీ పురుషుణ్ణి అదుపులో వుంచుకోవాలని భావిస్తూవుంటే అందుకు పురుషుడు భయపడకూడదు. నేనంటే నా భర్తకు అమితమైన ప్రేమ, విశ్వాసంవున్న

(44-వ పేజీ చూడండి)

# అసలువారికి ఎసరు అయినా కానివారికి కాలక్షేపం-

## నేటి పెళ్లిచూపులు!

ఇటీవల పెళ్ళయిన నా స్నేహితురాలు ఒకామె తన అనుభవాలు నాకు చెబుతూ పెళ్ళిచూపుల సమయంలో ఆయనను చూడటానికి అందరూ ఉంటారని భయపడి ఆయన గేటులోంచి యింట్లోకి వస్తున్నప్పుడు ఇంటి కిటికీలోంచే చూసి చూచాయగా ఆయన రూపగుణాలు అర్థం చేసుకున్నానని చెప్పింది. ఆడపిల్ల గుడ్డిగా కళ్ళుమూసుకు పెళ్ళిచేసుకోలేదు. పెళ్ళికి వరుడెంతో వధువూ అంతే, ఇరువురూ ముఖ్యులే. అందుకని పెళ్ళికూతురు అబ్బాయికి నచ్చడమేకాక, పెళ్ళికొడుకు అమ్మాయికి నచ్చడం కూడా ముఖ్యమే. వధూవరులకు అలాంటి అవకాశం కల్పించాలి.

నేటి మనఅబలలధోరణిచూసి నేను చాలా విసుపోయాను. మహిళా సమాజంలో లేదు అనవసరమైన ఆలోచనలు, భయాందోళనలు ఎక్కువగా ఉన్నట్లు నానాటికీ తీసికట్టుగా స్వతంత్రదృక్పథం సన్నగిలుతున్నట్లు నాకు తోస్తోంది.

అలనాటి నా 'పెళ్లిచూపుల' సలహాని ఈ నాటివరకూ నాటి సోదరీమణులు పట్టి వల్లార్చడం చూస్తే వచ్చేజాబులు నిజంగా స్త్రీలేనా వ్రాసింది అనిపిస్తూంది. కొన్ని అగా అభిశంసనలూ, కొన్ని అభినందనలూ వచ్చాయి. అయితే వింతలో వింతల్లా నన్ను తిట్టినవాళ్లు విద్యావంతులయిన యువతులు కావడం!

అది నిజానికి నా సలహా లోపమనుకోవాలో- వారి ఆలోచనలో దూరం లేదనుకోవాలో కూడా యిప్పటికీ తెలియడంలేదు. అయితే మంచిగాని చెడుగాని ఈ లోకంలో అనవాళ్ళన్నిబట్టి మంచీ చెడూ అవుతూవుంటాయి. 'పదుగురాడుమాట పాటియై ధరజెల్లు' అనేది మన నిత్యానుభవం. 'ఏ ట్రూత్ విల్ బికం ఎ లై ఇఫ్ పెర్సిస్టెంట్లీ రిపీటెడ్' అన్నాడు ఒక జగమెఱిగిన వేత్త.

ఆ సంగతి పూర్తిగా గ్రహించికూడా నా ఆత్మవిశ్వాసం అర్జంటుగా చంపేసుకోలేక ఈ వ్యాసార్థం వ్రాయవలసి వస్తోంది.

ముఖ్యంగా నా సలహాను దారుణంగా విమర్శిస్తున్న విద్యాధికులయిన యువతీమణులకే నా సమాధానం. దానికిముందు మూడుప్రశ్నలు.

అయితే మీలో అవివాహితు లందరూ పెళ్లిచూపులు లేకుండానే పెళ్లిళ్లు చేసుకోవా లనుకుంటున్నారా? ఒకవేళ పెళ్లి చూపులు ఏర్పాటుచేసినా మీరు నిమిత్తమాత్రంగా తలవంచేను తక్కూర్చుని పెద్దలు సరేఅంటే ఒప్పేసుకుంటారా? వరుడిని మీరు నచ్చితే అదే పదివేలని వరుడి రూపగుణ మన స్తత్వాలు తెలుసుకోవాలనే కనీసపు వాంఛ అయినా లేకుండా మీరు వివాహమయితే చాలు అనే ధోరణిలో ఉన్నారా? ఈ మూడు ప్రశ్నలకీ 'అవును' అని జీవితంలో సమాధానం చెప్పేవారు ఎంతమంది? వాదానికి 'అవును' అనడం కాదు నాకు కావలసింది.

### పరీక్ష

అమాటకొస్తే అసలు ఈ కాలంలో వరుడికన్నా మనోభావ పరిశీలనావాంఛ వధువులోనే ఎక్కువగా ఉందనేది నిర్వివాదం. వరుణ్ణిగురించి పెద్దవాళ్ళు చెప్పుకునే ఆ మాటా ఈ మాటా తలుపులవెనకో, కిటికీల చాటునో నక్కి నక్కి వినేది ఆడపిల్లలే. అంత శ్రద్ధ, చొరవ మగపిల్లలో నాకు కనపడలేదు. తనకు లభించేభర్త ఎలాటివాడో అతని జీవనధోరణి, అభిరుచులేమిటో, తన కలలు పండిస్తాడో లేదో అనే యోచనకు అది సూచన కాదంటారా? ఆ యోచన ఈడువచ్చిన పిల్లలకు ఉండదని మీరంటారా? వయస్సహజ మయిన ఆలోచనలు లేని జీవితాలుంటాయా? అయితే ఆ ఆలోచనలన్నీ అలాగే గుండెలో ఉండిపోవాలనడం సమంజసమా?

లాంఛనంగా జరిగే 'పెళ్లిచూపులు' పరస్పర అంగీకారంకోసం అంటారు పెద్దవాళ్లు. అయితే అంగీకారం ఏ విషయంలో? ఈ పెళ్లిచూపులలో ఏ విషయం తెలుసుకునే అవకాశం ఉంది? ఏం అంగీకారం సాధ్యం అవుతుంది. పెళ్లిచూపులని పేరుపెట్టి, పిల్లనీ పిల్లవాణ్ణీ హాల్లో కూర్చోబెట్టి అటువారూ ఇటువారూ కళ్లు ఎరువు తెచ్చుకొని వాళ్లిద్దరి మొహాలూ తనిఖీ చేయడమేనా పెళ్లిచూపులు? అంతకాక నేడు జరుగుతున్నదేమిటి? స్వతఃగా లజ్జావివశఅయిన వధువు ఈ నలుగురిలోనూ వరుడి మొహం చూడగలుగుతుందా? చూసిందే అనుకోండి. ఆ ఏర్పడిన అభిప్రాయం వరుడి రూపాన్ని గురించింది అవుతుందే గాని అంతకన్నా ముఖ్యమయిన గుణశీల మనస్తత్వాలకు చెందిందికాదు.

పెళ్లిచూపులు సంస్కరించగానే సరిపోదు. పెళ్లికావలసిన వాళ్ల మనోభావాలను డబ్బుతో, ఆచార సాంప్రదాయాలతో కేవలం తులాభారం తూచకుండా వారి అంగీకారానికి విలువ యిచ్చినప్పుడే పెళ్ళిచూపుల సంస్కరణలో అర్థం వుంటుంది.

నాకు వచ్చిన అనేక ఉత్తరాలలో మగువలు మగవారిని అపారంగా అపార్థం చేసుకుంటున్నవి అనేకం. నిస్సందేహంగా మగవారు మగువలకన్న ఉదారులని కొన్ని విషయాలలో మనం ఒప్పుకోవాలి. 'పెళ్ళి' వంటి కొన్ని జీవితసమస్యలపట్ల వారికి ఉన్న వివేచన అద్వితీయం. ఏకాంతం కల్పించగానే మగవాడు పగవాడు అవుతాడనుకోవడం అవివేకం. ఈ అనుమానాలు మన స్త్రీసహజాలోచనలకు సాక్షి. అంతకన్న ఏమీ లేదు. ఎవరి శీలరక్షణ వారికి అవసరమే. వరుడు మితిమీరి ప్రవర్తిస్తే అతని శీలానికే తీరని కళంకమని గ్రహించినవారు అలా వ్రాయరు. కాగా శీలం అనేది స్త్రీలకే సొంతంకాదనీ, పురుషులకూ ఉందనీ, ముఖ్యమనీ, సజావుగా బ్రతికి సంసారం చేయాలనే కోరిక మగవాళ్ళకే కాక మగవారికీ ఉందనీ మగువలు గ్రహించాలి. ఇప్పటికే ఆలస్యం అయింది. ఇప్పటికయినా గ్రహిస్తే ఈ లేనిపోని అనుమానాలు ఉండవు.

పెళ్లిచూపులు వధూవరుల సమష్టి శ్రేయస్సుకోసం. సమష్టి అంగీకారంతో సమష్టి సుఖంకోసం. శుభంకోసం. అలాటప్పుడు ద్వంద్వభావనకు చోటులేదు. ఆ యిద్దరిలో ఏ ఒకరికి చెడు జరిగినా రెండో వారికి చేటే. మంచిజరిగితే మంచే.

మగవారిపట్ల మగువలకున్న భయాలు పోవడం ముందు ముఖ్యం.

అయినా నేను చెప్పిన ఏకాంతం ఆడవారిని ఏకాంతారంలోనో పడవేసేది మాత్రం కాదు. దానికీ హద్దూ పద్దూ వున్నాయి. కాలపరిమితీ ఉంది. అందుకు ముందు అమ్మాయి అంగీకారం కావాలనే మరతూ ఉంది. ఏకాంతం అంటే ఆ చుట్టుపట్ల ఎవరూ మసలరాదని నేను చెప్పలేదు.

# ఆలయంలో అతివలు

పార్వతీ! పార్వతీ? ఇంకా నీ సింగారం కాలేదా? అబ్బ అప్పుడే ఆరవుతోంది. అని నేను చిరాకుపడ్డాను. అప్పుడే జడ సవరించుకుంటూ బయటికొచ్చింది మా పార్వతి. దాన్ని చూసి నేనొక్క నిమిషం నిర్ఘాంతపోయాను. దాని డ్రస్సంతా ఈవాళ నైలానులోనే మునిగిపోయింది. కోవెలకు కూడా ఇంత ఆర్భాటంగా సింగారమెందుకో నాకర్థమవలేదు. దానికితోడు చేతిలో హేండ్ బేగ్ కూడ పట్టుకొంది. అదెందుకంటె హారతిపళ్ళెంలో వేయడానికట! సరే అని ఇద్దరము ఎట్లాగో చేరువలో నున్న శివునిగుడి చేరుకొన్నాము. ఆలయప్రాంతంలో అడుగుపెట్టగానే అందరి కళ్ళు మా పార్వతి మీదే పడ్డాయి. నాకు చచ్చేంత సిగ్గనిపించింది. మనం కోవెలకెందుకు వెళతాము. అందర్నీ ఆకర్షించుకోవడానికా? లేక స్వామిని కొలవడానికా? అయినా నేటి యువతీమణులకు నాగరికత పెచ్చుమీరి పోతున్నది. వీరిలో రెండు రకాలవారున్నారు. మొదటి వారు తమమీద తప్పకుండా ప్రతి శుక్రవారం గుడికి వెళ్తుంటారు. అయితేనేమి? వారు దేవుని కొరకు మాత్రము వెళ్ళరు. మొదటి తరగతికి చెందినది మా పార్వతి. ఇక రెండవతరగతివారు అసలు వీరు కోవెలకి వెళ్ళడానికే భయపడతారు. అదేమి ఖర్మమో! వెళితే వారికి పరువు నష్టమంటారు. మొన్న నాకిలాంటి సంఘటనే ఎదురయింది. మా స్నేహితురాలితో కూడ ఒకమ్మాయి వచ్చింది. అవాళ మేమంతా కలిసి అలాగుడికి వెళ్దామని ప్రోగ్రాం చేశాము. మొదట మొహమాటానికి ఆ అమ్మాయి ఒప్పుకొంది. కాని ఇంక చూసుకోండి ఆ అమ్మాయి అవస్థ! తన ఫ్రెండ్సు ఎవరైనా కనపడతారేమోనని ఎదురు చూపులు చూస్తూ, ఏదో తప్పు చేసిన దానిలాగా మొహంపెట్టి నడుస్తోంది. అలా ఎవరైన తనస్నేహితులు కనబడితే, వాళ్ళకి కనపడకుండా జాగ్రత్త పడుతోంది. నాకు నవ్వు ఆశ్చర్యము రెండు ఒక్కమారే కలిగాయి. నవ్వితే ఏమనుకుంటుందో అని ఏమిటి విషయమని మా స్నేహితురాలిని అడిగాను. ఆ అమ్మాయి ఈవాళ వచ్చిందే ఆశ్చర్యకరమైన విషయం. ఏమిటంటే ఈ అమ్మాయి గుడికి వెళ్ళటంచూస్తే వాళ్ల ఫ్రెండ్సు హేళన చేస్తారట! అదేగాక ఈ అమ్మాయికూడ అంత నమ్మకం లేదట అని చెప్పింది. అది విని నాకు విచారం వేసింది. ఎంతనాగరికతగా వున్నా కొంత ఆధ్యాత్మికచింతన అవసరం. కేవలం దేవునికి నమస్కరిస్తే పరువుపోతుందని భయపడటం అవివేకం. ఎప్పుడు దేవుని నామస్మరణే కాకపోయినా ఒక పదినిముషాలయినా దేవుని ప్రార్థించటం పూజించడం అవసరం. ఆపదినిమిషాలవల్ల ఏది నష్టమువదు. కాకపోతే మీ ఫ్రెండ్సుతో కాలంగడపడమో అలంకారం చేసుకోవటమో వెనకపడుతుంది అంతే! ఇంకేమీ ప్రమాదముండదులెండి! మనముందరము దేవునియందు భక్తిచూపించటము మంచిది. పోనీ కోవెలకు వెళ్ళడం అవమానకరమైన విషయమని భావిస్తే ఇంట్లోనే దేవునికి ప్రత్యేకస్థలము ఏర్పరచి రోజూ ఒకపదినిమిషాలు దేవునిసాన్నిధ్యంలో గడపటము మంచిదని నా అభిప్రాయము.

—పి. కనకరత్నావళి

## సరళ సలహా!

మగపిల్లలకన్న ఆడపిల్లలు చురుకయిన వారు. శ్రద్ధగలవారు, చేసే కృషి చిత్తశుద్ధితో చేయగలవారు. పట్టుదల గలవారు. అందుకే చదువులో అబ్బాయిల కన్న ముందడుగులో ఉన్నారు. అభినందంలు.

అయితే మగపిల్లలు వెనకపడడానికి కారణాలు అనేకం ఉండవచ్చు. అందులో అసలు కారణం సహవిద్య. సహవిద్య చక్కని ఆదర్శమయినా ఆచరణలో చెడిపోతోంది. మగపిల్లల క్రమశిక్షణ, చదువూ చెడుతోంది. కళాశాలలు పాఠశాలలు ప్రేమకలాపాలకి తావులవుతున్నాయి. సంఘానికి చేయి తెగని సమస్యలు సహవిద్య తెస్తోంది. ఇప్పుడిప్పుడే సహవిద్య మనకు పనికిరాదు.

పెద్దల పర్యవేక్షణ అవసరం. దక్షత వుంటే తండ్రివంటి పెద్దవారు ఎవరైనా యిటు అమ్మాయికి ధైర్యంచెప్పి సిగ్గుపోగొట్టి అటు అబ్బాయికీ చనువుగా వుండే వాళ్లు మనోభావాలు పరస్పరం అందించవచ్చు కూడా. అది వారి ఏకాంతానికి భంగంకాదు. నేను చెప్పిన ఏకాంతం సంఘంలో సంసారరంగంలో ప్రవేశించడానికి మనం సముజ్జీలమా కాదా అని సమశీలస్వభావాలు చూసుకునే చిన్న పరీక్షకు ఆస్కారం కలిగించేదే కాని మరోటికాదు. అది మన సంస్కృతికి విరుద్ధంకాదు.

పూర్వం మరీ ఆచారాల కాలంలోనే స్వయంవరాలు ఎలా జరిగాయంటారు? స్వయంవరాలకన్న 'పెళ్లి చూపులు' ఏ విధంగా అనాచారం? అనార్యం? అసలు ఆచారం అంటే ఏమిటి? శుభదమూ, సుఖదమూ అయిన జీవనపద్ధతే కదా? 'బహుజన హితాయ, బహుజన సుఖాయ' ఏదయినా సదాచారమే.

అలాగే పెళ్లిచూపులు రూపొందించాలనీ చిరకాలంగా పురుషుల యిష్టానిష్టాలతోనే ముడివేసుకున్న స్త్రీకి సైతం పురుషుడితో సామ్యం కలిగించే రీతిని ఆడపిల్ల యిష్టం కూడా తెలుసుకొని పెళ్ళిఏర్పాటు చేయడం ఉచితమని నాభావం. అదే నా సలహా. తప్పయితే ఉపసంహరించుకుంటాను. ★



చీర అంచు బోర్డరు

జి. రామసూర్య భాస్కరం (ఇంగువల్లి)

# ఒక స్వీటు, మరో హాటు!

## పూరీలడ్డు

పూరీలడ్డుకి కావలసిన సామానులు:– 1 శేరు మైదాపిండి, ½ శే.(పావుశేరు) పంచదార, ⅛ శే. (అర్ధపావు) జీడిపప్పు, ½ శే. (అర్ధశేరు) నెయ్యి, 10 ఏలకులు.

శేరు మైదాపిండి జల్లించి పూరీలపిండి మాదిరి కలిపి, వుసిరికాయలంత వుండలు చేసి కొంచెం పలుచగా పూరీలు వత్తుకోవాలి. నెయ్యి మరిగాక పూరీ ఒక్కొక్కటె కరకరలాడేటట్టు వేయించాలి. అంటె వేయించాక గట్టిగా వుంటాయన్నమాట.

వేయించిన పూరీలన్నీ ఒక పెద్దపళ్లెంలో వేసి ముక్కలుచేసి పెట్టుకోవాలి. రోలు బాగా తడిలేకుండా తుడిచి అందులో యీ పూరీముక్కలువేసి దంచాలి. మెత్తగా అయ్యాక తీసి పెద్దపళ్లెంలో పెట్టుకోవాలి. అలాగే పంచదారకూడా మెత్తగా గుండ కొట్టుకోవాలి. జీడిపప్పుకూడా వేయించి కచ్చాపచ్చాగా గుండ కొట్టుకోవాలి. ఏలకులు వొలిచి పొడిచేసి పెట్టుకోవాలి.

పూరీలగుండలో పంచదార, జీడిపప్పు, ఏలకుపొడి, అన్నీ వేసి బాగా కలిసేటట్టు కలపాలి.

అన్నీ బాగా కలిసినతరువాత మనకి కావలసిన సైజులో వుండలు కట్టుకోవాలి. యివి ఒక 15 రోజులు పాడవకుండా వుంటాయి. ఎంతో రుచిగావుంటాయి. ఎన్ని తిన్నా జబ్బుచెయ్యదు. నెయ్యిబదులు వనస్పతి వాడవచ్చు.

* * *

## ఆలుచోలె

తీపి ఒక్కటె తింటే మొహం మొత్తుతుంది. అందుకు యీ "ఆలుచోలె" కూడా చెప్తున్నాను. ఇది నేను చేసేను. చాలా బాగా కుదిరింది. ఇది చపాతీల్లోనైనా, అన్నంలోనైనా లేక పుట్టిదే టిఫిన్‌గాతిన్నా బాగుంటుంది. దీనికి "కాబులీ చనా" అనగా కాబులి సెనగలు కావాలి. ఈ సెనగలు మామూలు సెనగలలాగే వుంటాయిగాని, రంగుగోధుమరంగుగా వుంటుంది. చూడటానికి బాగుంటాయి. కాబులి సెనగలు దొరక్కపోతే మామూలు సెనగలతోనే చెయ్యవచ్చు.

దీనికి కావలసిన సామానులు: ¼ శేరు (పావుశేరు) సెనగలు, 4 పెద్ద బంగాళాదుంపలు, 4 పచ్చిమిరపకాయలు, 4, పెద్ద వుల్లిపాయలు, చిన్న అల్లంముక్క, 1 టేబుల్‌స్పూన్ ధనియాలు, 2 నిమ్మకాయలు, 1 టీస్పూన్ పొడికారం, 1 కట్ట కొత్తిమిరి, 1 టీస్పూన్ గరమ్‌మసాలా, తగినంత ఉప్పు, 1 టీస్పూన్ సోడా, చిటికెడు పసుపు.

సెనగలు బాగా కడిగి తగినన్ని నీళ్లుపోసి టీస్పూన్ సోడావేసి మెత్తగా వుడికించాలి. పెద్ద బంగాళాదుంపలు ఒక్కొక్కటి 16 ముక్కలుచొప్పున తొక్కతీసి, కడిగి పెట్టుకోవాలి. వుల్లిపాయలుకూడా తరుక్కోవాలి. అల్లం నూరిపెట్టుకోవాలి. వుల్లిపాయ ముక్కలు, ధనియాలు మెత్తగా నూరాలి. గిన్నె కాలవేసి కొద్దిగా నెయ్యివేసి, వుల్లి ముద్ద వేయించాలి. అది వేగాక అందులో పసుపు, గరమ్‌మసాలా, పొడికారం, వేసి కొంచెంసేపు వేయించాలి. ఆతరువాత తరిగి వుంచుకున్న బంగాళాదుంప ముక్కలు వేసి రెండునిమిషాలు వేయించాలి. ఆ తరువాత వుడికిన సెనగలు నీటితోటి (అవి ఏనీటిలో వుడికేయో ఆనీటితోటె) ఈ ముక్కల్లో పోసెయ్యాలి. అల్లం ముద్ద, పచ్చిమిర్చి ముక్కలు, వుప్పు, కొత్తిమిరవేసి బాగా కలిపి మూతపెట్టాలి. దుంపలు మెత్తబడ్డాక దించి నిమ్మరసం పెయ్యాలి. ఇది వేడిమీద తింటే ఎంతో రుచిగా వుంటుంది.

ఒకసారి ఈ స్వీట్ అండ్ హాట్ చేసి చూడండి, ఎంత బాగుంటాయో!

—పి. సీత

# పూసలలో దారంగా దంపతులు పరస్పరం...

(41-వ పేజీ తరువాయి)

పనీ, నేను చేసే సేవవల్ల ఆయన సంతృప్తి పడుతూ వున్నాడని, ఆయన నామీదనే ఆధారపడివున్నాడని, తన భర్త హృదయంలో తనకు దప్పమరెవ్వరికీ తావులేదని స్త్రీ విశ్వసించినప్పుడు, అట్టి విశ్వాసం స్త్రీకి పురుషుడు కల్పించ గలిగినప్పుడు, ప్రతి స్త్రీ అట్టి తన భర్తను దేవునిగా చూచుకుంటుంది. అట్టి భార్యాభర్తలజీవితం వడిగుడుకులు లేకుండా హాయిగా గడిచిపోతుంది." అని చెప్పాడు.

ఇట్టిస్థితి లేక పోవడంవల్లనే మన సమాజంలో స్త్రీలు ఎన్ని సుఖాలు అనుభవిస్తూ వున్నా తృప్తిలేక బాధపడుతూ వున్నారు. ధనిక కుటుంబాలకు చెందిన స్త్రీలు లోలోపల కుమిలి, తమకంటె కూలిసాలి చేసుకొని హాయిగా జీవితం గడుపుకొనే కూలి దంపతుల జీవితమే మిన్నఅని భావిస్తూ వుంటారు. మన సమాజంలో వివాహం అయిన తరువాతనే పురుషుని అర్థం చేసుకొనే అవకాశం స్త్రీకి లభిస్తుంది. వివాహం అయిన కొంతకాలంవరకు శరీర సంబంధమైన ఆకర్షణ వుంటుంది. కాని అసలు భార్యాభర్తల పరీక్ష జరిగేది వివాహం అయిన మూడు నాలుగు సంవత్సరాల తరువాతనే. అప్పుడే పురుషుని బాధ్యత పెరుగుతుంది. అట్టి సమయంలో పురుషుడు స్త్రీ సహకారాన్ని పొందడానికి ప్రయత్నించక, ఆమె పాలిటికి ఆమెను యింట్లో ఆడబిడ్డలు అత్తగారలమధ్య వదిలి పూరుకొంటే స్త్రీ హృదయం భయపడిపోతుంది. ఇక ఆమె హృదయంలో విప్లవం బయలుదేరుతుంది. నేను కేవలం ఆయనకు విలాస వస్తువును మాత్రమేనా? ఇంట్లో పనిచేసే దాసీ దాననేనా? పిల్లల్ని కనిపెంచి అందించే యంత్రాన్నేనా? ఆయనచూపిన ప్రేమంతా బూటకమేనా? అనుప్రశ్నలు ఆమెను రేకెత్తించి వేస్తాయి. తత్ఫలితంగా ఆమెహృదయం పెడమార్గం త్రొక్కుతుంది. త్రోవ తప్పిన తరువాత యిక సరియైన మార్గంలోనికి రావడం చాలా కష్టం. తరువాత ఎవరేమనుకొన్నా లాభం వుండదు. అని తనవాదనను ఆమె ముగించింది.

ఇదీ విషయం. మన సమాజంలో అనేకమంది స్త్రీలు యీ విధంగా బాధపడి పోతూ వున్నారు. లోకభీతి, సమాజ బంధనాలు, కుటుంబ బాధ్యతలు, ఆర్థిక బానిసత్వం, తన బిడ్డల భవిష్యత్తును సంబంధించిన చింతలతోపాటు స్త్రీ- పురుష మానసిక సంబంధమైన యిట్టి బాధలతో లోలోన నలిగిపోతూ వున్నారని చెప్పడం అతిశయోక్తి కాదను కొంటాను. ఇట్టి స్థితిని పురుషులు గమనించి, స్త్రీని నిరసించకుండా, ఆడవారిని అర్థం చేసుకోవడం కష్టం అని విమర్శించకుండా, వారి బాధలను సానుభూతితో అర్థంచేసుకొని వ్యవహరించడం అత్యవసరం. అప్పుడే కుటుంబ జీవితాలలో శాంతి సౌఖ్యాలు లభిస్తాయి. 

# వనితా వాణి



## ఎరువుపుస్తకాల బరువు

"వనితాలోకం"లో లక్ష్మిగారు వ్రాసిన "ఎరువు ఇచ్చే పుస్తకాల బరువు" అనే వ్యాసం ఎంతో విశదంగా ఎరువు ఇచ్చేవారి హృదయంలోని బరువును, అడుపుతీసుకొనే వారిలోని నిర్లక్ష్యాన్ని చక్కగా చాటిచెపుతుంది. సామాన్యంగా సంఘంలో అలముకొన్న ఈ బలహీనతను కొంతవరకైనా చూపించి, దీన్ని అరికట్టడానికి ఈ వ్యాసం ఎంతైనా పనిచేస్తుంది. రచయిత్రి ఇలాంటి నగ్నసత్యాన్ని పాఠకులకొని కందించినందుకు నా ధన్యవాదాలు.

సూర్ల భానుమతి
(బాపట్ల)

* * *

"ఎరువుయిచ్చే పుస్తకాల బరువు" అన్న వ్యాసం చాలా బాగుంది. సామాన్యంగా జరిగే ప్రతి విషయాన్నీ కన్నులకు కట్టినట్లు వ్రాశారు. "సహృదయులు ఒక్కరు ప్రయత్నించినా 'సరస్వతీ' దేవికి చేయూతే అవుతుంది" అన్న వాక్యం నాకు చాలా నచ్చింది. వారికి నా అభినందనలు."

వై. వెంకటేశ్వర్లు
(అనంతపురం)

* * *

## 'సరుకుపోవడం....'

'పనిపాట్లనుంచి పంచశీలవరకు సరుకుపోవడమే శరణ్యం' అనే 20-7-60 పత్రికలోని శ్రీమతి కృష్ణకుమారిగారి వ్యాసంతో నేను పూర్తిగా ఏకీభవించలేక పోతున్నాను. ఇంట్లోనూ, బంధువులతోనూ, స్నేహితులతోనూ, స్నేహదేశాలతోనూ అయితేనే సర్దుకుపోవడం చాలా చాలా మంచిది. బజార్లోనూ, రాజకీయాల్లోనూ ఇది మంచిది కాదని నా అభిప్రాయం. ఉదాహరణకు: రైల్వేకూలీకి పావులా ఇస్తే సరిపోయే దానికి అర్ధరూపాయి ఇమ్మని వలుగురిని తీసుకువచ్చి దబాయిస్తాడు. వాడి (రి) తో కూడా సర్దుకు పోవాలంటే అర్ధరూపాయి ఇవ్వవలసి వస్తుంది.

ఎ. సూర్యకుమారి
(రామచంద్రపురం)

* * *

సి. కృష్ణకుమారిగారి "సర్దుకు పోవడమే శరణ్యం" చాలా బావుంది. ఎంతో అనుభవంమీద వ్రాసినట్లువుంది. చాలామంది క్రొత్తచోట్లకువెళ్లి అసభ్యంగాప్రవర్తిస్తారు. సర్దుకుపోతే మనకూ గౌరవం ఇతరులకూ గౌరవంగా వుంటుంది. సర్దుకుపోవడానికి వెనుకంజవేసే మహిళలకు ఈ వ్యాసం గీటురాయివంటిది. వారితో నేను ఏకీభవిస్తున్నాను. సి. కృష్ణకుమారిగార్కి నా(మా) అభివందనాలు.

...మిస్ బి జాన్
(అమలాపురము)

* * *

## వనితల మనస్సు

'వనితల మనస్తత్వాలు' చాలా బాగుంది. భాగ్యంగారు మంచిఅనుభవజ్ఞులై ఉండాలి. ఈ వ్యాసం అనేకమంది స్త్రీలలో మార్పు తప్పక తెస్తుందని ఆశించవచ్చు. భాగ్యంగారు చక్కని వ్యాసం వ్రాసినందుకు వారికి ఈ పత్రికద్వారా నా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

ఎ. అమ్మాజీ
(కర్నూలు)

* * *

వ్యాసం చాలా బాగుంది. నేడు అట్టివారు నాకు చాలామంది కనిపించారు. ఈ వ్యాసం చదివిన ప్రతివారుకూడా వారి తత్వాలని మార్చుకుంటారని నా ఉద్దేశ్యం. 'భాగ్యం' గారికి ఆంధ్రసచిత్రవారపత్రిక ద్వారా మాఅభివందనాలు తెలుపవలసిందిగా కోరుచున్నాను.

లక్ష్మీశారద
(పొన్నూరు)

* * *

22-6-60 సంచికలో ప్రచురించిన సరళగారి సలహానుగురించి 18-7-60 సంచికలో కె. సత్య (నాగార్జున సాగర్ డాం) ఎంతో క్రుంగిపోవలసి వస్తుంది అనటం చాల శోచనీయం. మనపూర్వులు మన ఆనందానికి అడ్డు వచ్చే అంత మూర్ఖులుకారు. వారు సంసారం ఎటువంటి ఈతిబాధలులేక తమ సంతతి సుఖంగా వర్ధిల్లుటకే మూఢమి వట్టింపులు ఏర్పరచారు. వీటిని అత్యాచారాలు అనటం, అరికట్టుటకు పూనుకోవడం చాలపొరపాటు. సరళగారు మన ఆచార లన్నీ వట్టి దండుగ అనే భావంతో విమర్శించటం చాల శోచనీయం.

కె. సుజాత
(కర్నూలు)

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



ఎందు చేతననగా: ఒకసారి తోముకుంటేనే
కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగిపోతుందని, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమని, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది. అంతేకాదు. నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి.

కాల్గేట్‌నుంచి నురనురగా వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకువెళ్ళి, అక్కడ పళ్ళ పోయి ఉండే ఆహార పదార్థాల కణుములను బయటికి గిలా వేస్తుంది. పళ్ళు చాలా చెడిపోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ కణములే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకోవడమంటే పిల్లలకు చాలా సరదా. ఎందుకంటే దానినుంచి వచ్చి చాలా సేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వాళ్ళు చెవి కోసుకుంటారు.




మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ......ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది!

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

DCG. 1107 T

# కడవ గొడవ

జి. సన్యాసిరావు

అనగా వినగా కనగా విజయనగరము కనకమ్మవారి ఆలయములో ఒక అర్చకుడు దేవిని త్రికాలమందు నిరాహారముతో నారాధించుచుండెను. దినములు, నెలలు, వసంతములు గతించెను. పాపం! బ్రాహ్మణుని శరీరము కృశించెను. నిరుపేదయగు పూజారికి నల్గురు పిల్లలు కలరు. తినుటకు తిండి, కట్ట బట్ట లేక అష్టకష్టములకు గురియగుచుండిరి.

కొన్నాళ్లకు దేవి ప్రత్యక్షమై తపస్సునకు మెచ్చి మహిమగల మట్టి కడవను వానికిచ్చెను. "ఈ కడవను తలక్రిందు చేసిన మొదల పలురకములగు తీయని రొట్టెలు వచ్చును. మీకు సరిపడు రొట్టెలు తిని మిగిలినవి విక్రయించి ధనార్జన చేయుమని చెప్పి" దేవి యదృశ్య యయ్యెను. బ్రాహ్మణుడు పరమానందభరితుడై దేవికి సాష్టాంగనమస్కారము చేసి, పెద్ద అంగలు వేసుకుంటూ యింటి ముఖము పట్టెను. మార్గమధ్యమున నొకనది దాటవలసివచ్చెను. అందు స్నానమాచరించి యింటికి పోవచ్చునని బ్రాహ్మణుడు తలచెను. దగ్గరలో యున్న కుమ్మరివానివద్దకు వెళ్లి కడవను భద్రముగా చూడమనిచెప్పి స్నానమునకై నది చేరెను. "భద్రముగా చూడమ"ని చెప్పుటకు కారణమేమై యుండును అని కుమ్మరి మనస్సు పరిపరివిధముల పోయెను. కనుచూపు మేరదాటిన బ్రాహ్మణుని చూచి కడవను పరీక్షింపసాగెను. అనేక విధముల కుమ్మరి కడవను,



పరీక్షించెను. కాని యేమియు ప్రయోజనము లేకపోయెను. కడకు కడవను తల్లక్రిందుగా చేయగా పలురకములగు తీయని రొట్టెలు నపరిమితముగా పడసాగెను. కుమ్మరి "కడవ మహిమ"ను గ్రహించి తక్షణమే దానిని రహస్యముగా యింటిలో దాచి అదే మాదిరి కడవను దాని స్థానములో నుంచెను. పిమ్మట పూజారి వచ్చి కుమ్మరివద్ద కడవ పుచ్చుకొని యింటికి వెడలెను. కడవ తాను సంపాదించిన విధము, దాని మహిమ పూసగ్రుచ్చినట్లుభార్యతో చెప్పెను. బ్రాహ్మణుడు తల క్రిందుగా కడవను చేసినను యేమియు పడకుండెను. భర్తకు పిచ్చివచ్చినదేమో యని భార్య భయపడెను.

కుమ్మరిచేసిన మోసమైయుండు నని పూజారి తెలిసికొని తన కడవను యెట్లు పొందవలయునని యోచించెను. దేవిని మరల ప్రార్థించగా దేవి ప్రత్యక్షమై వేరొక జాడీని యిచ్చి యంతర్థానమయ్యెను. మార్గమధ్యమున యీ జాడీని పరీక్షింపతల్లక్రిందు చేయగా పెక్కు తేనెటీగలు వచ్చి కుట్టసాగెను. తక్షణమే జాడీని యథాప్రకారము చేసెను. తేనెటీగలు యదృశ్యమయ్యెను. ఈ దృశ్యము వింతగా కనిపించెను. కుమ్మరికి పాఠము చెప్పవలయునని జాడీని వానివద్దకు తీసికొనిపోయి పూర్వమువలె జాడీని భద్రపరచమని వానితో చెప్పి స్నానమునకై నదికి వెళ్లక చాటున దాగియుండెను. కుమ్మరి దీనిమహిమ తెలిసికొన ప్రయత్నించి జాడీని తల్లక్రిందు చేసెను. తక్షణమే గుంపులు గుంపులుగా తేనెటీగలు వచ్చి కుమ్మరిని కుట్టసాగెను. దాగుకొనియున్న పూజారి వచ్చి, జాడీని యథారీతిగా చేయగా తేనెటీగలు మాయమైనవి. కుమ్మరి తన తప్పును తెలిసికొని లెంపలువేసుకొని మొదట దాచిన రొట్టెలు కడవను పూజారికి యిచ్చి క్షమాపణ వేడుకొనెను. పూజారి తన కడవను తీసికొని కొన్నాళ్లకు ధనార్జనచేసి భార్య, పిల్లలతో హాయిగా చీకు, చింత లేకుండా కాలక్షేపము చేయుచుండెను.

★



"ఈ సినిమా ఛండాలంగా ఉంది,
చూడక్కర లేదన్నా రేమిటి?......
ఇంత బాగుంటేను?"

# చౌ చౌ

# ది హౌండ్ ఆఫ్ బాస్కర్ విల్స్
# ది నేకెడ్ ట్రూత్
# థండర్ రోడ్

హామర్ ఫిలింస్ వారి టెక్నికలర్ చిత్రం ది హౌండ్ ఆఫ్ ది బాస్కర్ విల్స్ కోనన్ డాయిల్ సమర్పించిన షెర్లక్ హోమ్స్ కథల్లో ఒకటి. సర్ ఆర్థర్ కోనన్ డాయిల్ అపరూపసృష్టి షెర్లక్ హోమ్స్—అపరాధ పరిశోధక చక్రవర్తి. ఆ పాత్రసృష్టించిన కోనన్ డాయిల్ చాలా మందికి తెలీదు. తెలిసినా షెర్లక్ హోమ్స్ మూలవల్లనే. అలాటి సజీవపాత్ర కథానాయకుడుగా కోనన్ డాయిల్ కథాసృష్టి చేశారు. అత్యద్భుతమైన ఆ సృష్టిలో ఒక అంశం తెరకు గురిఅయింది. కథ తెర కథగా మారటంతో కథగాసికథ అయి ఆశించినంతగా బాగులేదనిపిస్తుంది. షెర్లక్ హోమ్స్ తార్కిక లాఘవంపై ఆధారపడి అపరాధ పరిశోధన జరుగుతుంది. తర్కవితర్కాలను తెరకెక్కించడంతో తలనొప్పి రావడం కూడా జరుగుతుంది.

ఒకానొక ఎస్టేటు అధిపతి హఠాత్తుగా చిత్రంగా ఒక గుహలో చచ్చిపోతాడు. దానికి చిలవలు పలవలు కలిపి ఆ ఎస్టేటు వారసత్వానికి వచ్చే ఎవరికయినాసరే ఆ ఖర్మ తప్పదని శాపం ఏదో ఉందని అంతా నమ్ముతారు. ఆ గుహలో ఏదో పాతాళ భైరవి (భయంకరమైన నరకలోకపు కుక్క)

## సినిమా

వుందని అది అందర్నీ చీల్చి చెండాడుతోందని చుట్టుపట్ల వాడుక. ఈ రహస్యంలోకి షెర్లక్ హోమ్స్ అపరాధ పరిశోధనా కిరణం ప్రసరించి, ఆ ఎస్టేట్ వారసుడి చావును తప్పించి, పాతాళభైరవిని కూడా చంపినకథ చాలావరకు రక్తికట్టించడానికి ప్రయత్నించారు. చిత్రంలో 'సస్పెన్సు'కు పోషణలేదు. టెరెన్స్ ఫిషర్ డైరెక్ట్ చేసిన ఈ చిత్రంలో పీటర్ కషింగ్, ఆండ్రీ మోరిల్, క్రిష్టఫర్ లీ నటించారు. చిత్రంలో వేగం తక్కువ. తర్కం ఎక్కువ. కాలక్షేపం అంగుళోసం అందరికీ సుఖంగా వుండదు. చదివి ఆనందించదగిన తర్కలాఘవం దృశ్యకావ్యం కాలేదు. శ్రవ్యకావ్యం కావడానికి తగ్గ విశేషమూ లేదు. చలనచిత్ర కావ్యం ఇది అందుకనే కాలేదు. కమ్మగా లేదు.

* * *

రసపట్టయిన కథ ఉండగానే, పసగలనటన ఉండగానే చిత్రం జనరంజకమౌతుందనుకోవడం పొరపాటనేది ప్రత్యక్ష సత్యం. ఆ సత్యమే 'ది నేకెడ్ ట్రూత్' అనే చిత్రంగా విడుదల అయింది. అయితే గిరాకీ అట్టే కనిపించని యీ చిత్రం చూసినవాళ్ళందరినీ సంతోషపెడుతుంది. నీలివార్తా

(58-వ పేజీ చూడండి)



హైదరాబాద్ మూవీస్ వారి ఇల్లరికంలో జగ్గయ్య, జమున.



పక్షిరాజా వారి "విమల"లో సావిత్రి, సంధ్య,

# వార్తాభరణం

## మద్రాసు

శ్రీ కాంత్ ప్రొడక్షన్స్ వారు "సతీ సులోచన" పేర తీస్తూన్న పౌరాణిక చిత్రం మెజస్టిక్ స్టూడియోస్‌లో రజనీకాంత్ దర్శకత్వంలో తయారవుతున్నది. సులోచనగా అంజలీదేవి, ఇంద్రజిత్‌గా ఎన్. టి. రామారావు, రావణుడుగా ఎస్. వి. రంగారావు నటిస్తున్నారు.

* * *

ఎం. ఎ. వి. (ఆలుమగలు) పిక్చర్స్ వారు నిర్మిస్తున్న "మాంగల్యం" సేలం రత్నా స్టూడియోస్‌లో పూటాపూటిని పూర్తి కావస్తున్నది. ఆత్రేయ రచన.

* * *

అంజలీ పిక్చర్స్ వారు సాంఘిక చిత్రం ఒకటి తీస్తున్నారు. పేరు ఇంకా పెట్టలేదు. అంజలి, నాగేశ్వరరావు, హరనాథ్, గుమ్మడి, గిరిజ నటిస్తున్న ఈ చిత్రానికి వేదాంతం రాఘవయ్య దర్శకుడు. నృత్యాలన్నీ గేవా కలర్‌లో చిత్రీకరించారు. ఆదినారాయణ రావు సంగీతం.

* * *

శ్రీ వెంకట్రామా ఫిలిమ్స్ వారు నిర్మిస్తున్న "విష్ణుమాయ" గోల్డెన్ స్టూడియోలో ప్రస్తుతం తయారవుతున్నది. కాంతారావు, రాజనాల, రఘురామయ్య, మిక్కిలినేని, సత్యనారాయణ, శివరావు, పులిపాటి వెంకటేశ్వర్లు, కృష్ణకుమారి, కమలకుమారి ఇందులో నటిస్తున్నారు. జాగీర్దార్ ఛాయ, మల్లేశ్వరరావు సంగీతం, నమ్మాళ్వార్ దర్శకత్వం వహిస్తున్నారు.

* * *

లోకా ఫిలింస్ వారి "తల్లి-బిడ్డ" నిర్మాణం త్వరితగతిని జరుగుతున్నది. మెజస్టిక్ స్టూడియోలో ప్రస్తుతం నిర్మాణం జరుగుతోంది. నాగయ్య, లింగమూర్తి, బాలయ్య, హరనాథ్, కృష్ణకుమారి, హేమలత ఇందులో నటిస్తున్నారు. వి. శంకర్‌రావు అనే క్రొత్త సంగీత దర్శకుని వీరు పరిచయం చేస్తున్నారు. టి. యస్. శ్రీనివాసరావు దర్శకుడు. ఛాయాగ్రహణం కె. యస్. ప్రసాద్. రచన, నిర్మాణం యడవల్లి నిర్వహిస్తారు. నవంబరులో దీనిని విడుదల చేయాలని సంకల్పం.

* * *

"జంబో కమ్స్ టు టౌన్" అనే హోమీ వాడియా చిత్రం ఫిలింసెంటర్‌లో తెలుగు, తమిళ, కన్నడ భాషలలోకి 'డబ్' చేయబడుతోంది. తెలుగు అనువాదం శ్రీశ్రీ.

* * *

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ (ఇల్లరికం) తెలుగులో మరో చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. నాగేశ్వరరావు, కృష్ణకుమారి ప్రధాన పాత్రలు వహించే ఈ చిత్రం తమిళ చిత్రం 'పెణ్ మనం' కథకు అనుసరణ.

* * *

నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారి "సీతా

# వార్తాభరణం

రామ కళ్యాణం" వాహినీ స్టూడియోలో తయారు కావచ్చింది. రసనిర్భరంగా ఉండే యీ చిత్రం ప్రజానురంజకం కాగలదని వినికిడి. ఎన్. టి. రామారావు, హరనాథ్, నాగయ్య, బి. సరోజాదేవి మున్నగువారు ఇందులో పాల్గొంటున్నారు. శ్రీ గాలిపెంచల నరసింహారావు (బాలరాజా) సంగీత దర్శకత్వం వహిస్తున్నారు. భవానీ ఆలయం, మండోదరి పూజాఘట్టం ఇటీవలనే చిత్రీకరించారు. బి. సరోజాదేవి మండోదరి పాత్ర నిర్వహించింది.

* * *

తెలుగులో మంచి విజయం పొందిన "అపూర్వ చింతామణి" హిందీలోకి 'డబ్' చేయడానికి మాడరన్ థియేటర్స్ నిశ్చయించి సగం పైగా పూర్తిచేశారు. వచ్చే నెల ఉత్తర భారతంలో విడుదల అవుతుంది కూడా.

* * *

వల్లపరెడ్డి ప్రొడక్షన్స్ వారి సాంఘిక చిత్రం "కన్నకూతురు" 'లాజ్ వంతి' అనే హిందీ చిత్రానికి అనుసరణ. "ఎంగళ్ సెల్వి" అనే తమిళ చిత్రానికి తెనిగింపు. నాగేశ్వరరావు, అంజలి, బేబి ఉమ ముఖ్యనటులు. ఆగస్టు 15-కు విడుదల కావచ్చు.

* * *

అశ్వరాజ్ ప్రొడక్షన్స్ వారి తెలుగు చిత్రం "దీపావళి" అన్ని హంగులతోను ఆకర్షణీయంగా తయారయింది. రీరికార్డింగ్ పని జరుగుతోంది. సెప్టెంబర్ 30-వ తేదీకి విడుదల చేయాలనుకుంటున్నారు. ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, గుమ్మడి, కాంతారావు, రమణారెడ్డి, సావిత్రి, కృష్ణకుమారి, ఎస్. వరలక్ష్మి ఇందులో నటించారు. సంగీతం ఘంటసాల, దర్శకుడు రజనీకాంత్.

* * *

రవివర్మ ఫిలింస్ పేరిట మేకప్ నిపుణులు శివరామ్, ఎస్. ఎన్. గుప్త తెలుగు, తమిళ్ హిందీ భాషలలో ఒకేసారి నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో నాయికగా వైజయంతిమాల ఎన్నిక అయింది. తెలుగులో తదితర నటుల ఎన్నిక పూర్తి కాలేదు.



పక్షిరాజా వారి "విమల"లో ఎన్. టి. రామారావు

* * *

"నమ్మినబంటు" చిత్ర ప్రదర్శనకు శాన్ సెబాస్టియన్ (స్పెయిన్) వెళ్ళిన నటుడు శ్రీ యస్. వి. రంగారావు, బ్రిటన్, ఇటలీ, జర్మనీ దేశాలు పర్యటించి తిరిగి వస్తారని వార్త.

* * *

విశ్వరూపా ఫిలింస్ వారు మరో క్రొత్త చిత్రనిర్మాణానికి ఉపక్రమించారు. జూలై 25-వ. ఘంటసాల, పద్మప్రియ పాడిన ఒక పాటను రికార్డుచేశారు. సంగీతం వేణు. దర్శకుడు వి. మధుసూదనరావు. జమున, జగ్గయ్య దేవిక, కాంతారావు, సూర్యకాంతం, రమణారెడ్డి, రమణాచలం నటీనటులు. పేరు ఇంకా పెట్టలేదు.

* * *

జమున, ఎస్. వరలక్ష్మి, బాలయ్య, గిరిజ, రేలంగి, బాలకృష్ణ, పద్మనాభం నటిస్తున్న మహేంద్ర పిక్చర్స్ వారి "కృష్ణప్రేమ" ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో తయారు పూర్తి కావచ్చింది. పెండ్యాల నాగేశ్వరరావు సంగీతం చిత్రానికి ఒక ఆకర్షణ.

* * *

మంజీరా ఫిలింస్ వారి చిత్రం శరవేగంతో తయారవుతూంది. శ్రీ రామినీడు దర్శకుడు. సావిత్రి, బాలయ్య, కాంతారావు, రమణారెడ్డి, శోభ, డా॥ ప్రభాకరరెడ్డి అనే క్రొత్త నటుడు—ఇందు నటీనటులు.



శ్రీ ప్రొడక్షన్స్ వారి 'అభిమానం'లో నాయకుడు నాగేశ్వరరావు.

## కొసరు కథ

నేటి మేటినటులు ఒకరయినటువంటి, అందు లోనూ హీరో నాగేశ్వరరావు, ఓరంతా ఒక్కసారి పోలీస్ లాకప్‌లోకి వెళ్ళిపోయారంటే దేశం అట్టుడికినట్టు ఉడకాల్సింది—ఉపకరేదేమా అని ఆలోచనలోపడి—మన తప్పుడక లేద్దనికదుపుడకా అనుకునేసరికి కొసరుకథలో అసలుకథయిది అని అర్థం చెప్పిన ఒకానొక చిత్రమిత్రుడికి ‘థ్యాంక్స్’ చెప్పేసి ఇటుతిరగ్గానే......

## నకలు కథ

ప్రశాంత నదీతీరం—సాయం సమయం మాత్రంకాదు. మధ్యాహ్నం అయినా ఎండ చల్లగానేవుంది. రివ్వున ఏటిగాలి. నెప్ట్యూన్ స్టూడియో ప్రాంతంలో కాలు పెట్టగానే పరిచయస్తునిలా పరాయివారెవరో పలకరించారు. ‘అభిమానం’తో పలకరించిన ఆ వ్యక్తి వేణు వేషంలోవున్న శ్రీ అక్కినేని నాగేశ్వరరావు! సరదాగా కబుర్లు చెబుతుండగానే సెట్ మీదకు పిలుపువచ్చింది. అక్కినేని నిజంగా వేణు అయిపోయి ‘అమ్మా’ అనే ఆక్రందనతో కారు ప్రమాదంలో దెబ్బతిన్న లక్ష్మీకాంతమ్మను కౌగలించుకుని వాపోయాడు. అతనితో అతని చెల్లెలు కమల కూడా కంఠం శ్రుతి కలిపింది. సింగరాజా లింగరాజా, కౌసులు గుడ్లప్పచెప్పి చూస్తూ నుంచున్నారు. కథని యింతవరకు తెచ్చిన కథానాయకి రాధ మాత్రం యింకా రాలేదు. ‘అమాయకురాలు రాధ నిరపరాధ’ అంటుంది లక్ష్మీకాంతమ్మ. కాని వేణు హృదయంలో అగ్నిపర్వతాలు రగులుతున్నాయి. “కాదుఅది రాక్షసి, హృదయం లేని పాషాణం” (?) అన్నాడు ఆ ఉద్వేగంలో వేణు.

## అసలు కథ

తీరా చూస్తే అది ‘అభిమానం’లో క్లయిమాక్సు దృశ్య చిత్రీకరణ. ఇదేమిటి ఇంతలోనే అక్కినేని ఒక్కసారి వేణు అయిపోయి ఆ చాయలలేనివాళ్ళ ఆవిడను పట్టుకుని అంతంతమాటలంటున్నాడు ఏమిటింతకూ కథ? అని బిగ్గరగా అనుకునేసరికి ‘ఇదీ కథ’ అంటూ తెర కథని వాతెనకథగా చెప్పేసి ఊరుకున్నారొక చిత్రమిత్రులు.

వేణుగా నాగేశ్వరరావు, లక్ష్మీకాంతమ్మగా కన్నాంబ, సింగరాజు లింగరాజుగా కె. వి. యస్ శర్మ, కౌసులుగా చలం, కమలగా కృష్ణకుమారి రాధగా సావిత్రి నటిస్తున్న ఈచిత్రం శ్రీ ప్రొడక్షన్స్ వారి ‘అభిమానం’. శ్రీ సి. యస్. రావు శరవేగంతో చిత్రిస్తున్నారు. సంగీతం ఘంటసాల. మాటలూ, పాటలూ సముద్రాల (జూ). కళ అన్నామలై నృత్యం పసుమర్తి నిర్వహిస్తున్న ‘అభిమానం’ వినాయకచవితికి విడుదల అవుతుంది.

# వగైరా వగైరా

## హాస్యనటుడి ఆత్మకథ

“అనాడెలా ఉన్నానో ఈనాడూ అలాగే వున్నాను,” అనే మాటలు విని ఓంచి వెనుదిరిగి చూసేసరికి ‘నేనే’ అన్నారు రేలంగి. అయితే ‘నాటికి నేటికి భేదము?’ అన్నారు మరొకరు.

“ఏమీలేదు. వంద రూపాయలు సంపాదించుకునే రోజుల్లో ఎలా వున్నానో ఇంత వస్తున్న ఈరోజుల్లోనూ అలాగే వున్నాను. అప్పుడు చాలకపోలేదు—ఇప్పుడు ఎక్కువా కాలేదు. మొదట హార్మోనియంపాళ్ళు, ఆ తర్వాత డ్రామాలు, తర్వాత సినిమాలు, ఫుల్ స్టాప్.” అన్నారు ఆ హాస్యనట చక్రవర్తి.

‘సర్వసరేగాని ఇందులో మీ పాత్ర ఏమిటండీ’ అన్నదో పత్రికంఠం. “భంపారు. ధరే ప్రశ్న వేగాని కాబూ జంట్రానికి. ఇన్ని చిత్రాలలో నటనతో ఎక్కడికక్కడే మర్చిపోవటంగాఉంది” అని హాస్యఘుటికల్లాంటి రెండు గుటకలు మింగే సరికి ‘ఆయన పాత్ర ఓ. సన్యాసిరావు అండీ’ అంది మరో సహాయకంఠం. ‘యస్’ అన్నాడు రేలంగి.

అయితే విదేశ పర్యటనకు మీరు వెళ్ళలేదేం? అన్నారొకరు.

‘పిలవని పేరంటానికి పోయే అలవాటు లేదు కనుక’ అన్నది ముక్తసరిగా ఆయన కంఠం.

వస్తున్న రాబడితో తృప్తిగా జీవించే ఇన్సూరెన్స్ ఏజంట్ కమ్ హోమియోపతి డాక్టర్ వేషం (టి. యస్. రావుతోనూ, తనకు రెండోవైపు కుటుంబగా ఎస్. వరలక్ష్మి) నటిస్తున్నట్లు రేలంగి చెప్పారు. ఆ వ్యాదు సెట్టుపైన ఆయన కంపనిలేదు. హాస్యకథా కాలక్షేపం చేసి ‘పవమానాసుతుడు’ అంటున్నారు. ★



శ్రీ ప్రొడక్షన్స్‌వారి ‘అభిమానం’లో నాయిక సావిత్రి.

రాజకుటుంబానికి కలిగిన ఈ దురవస్థకు ప్రజలందరూ చాలా దుఃఖించారు. ప్రీతిపాత్రులైన వారి ప్రభువును, రాణినీ, యువరాజునూ తలచుకుని సంతతధారగా కన్నీళ్లు కార్చారు. కొంతమంది పౌరులు

## విగ్రహం విహంగం

ప్రధాన మాత్యుల వద్దకు వెళ్ళి, "అమాత్యులుగారూ, మన రాజూ, రాణీ యువరాజును చాలా ప్రేమించే వారు. యువరాజు చనిపోవడంవల్ల అతనిమీది బెంగతోనే వారూ చని పోయారు. యువరాజు చాలా మంచి వాడు. ఎప్పుడూ సంతోషంగా గడిపి వాడు. కాబట్టి, యువరాజు జ్ఞాప కార్థంగా అతని విగ్రహము ఒక

(62-వ పేజీ చూడండి)

# "భక్తశబరి"

# చిత్రసమీక్ష

'ఎంతని నే వర్ణింతును శబరీ భాగ్యము' అన్నాడు త్యాగరాజు. ఆమాటలో ఏకీభవిస్తూనే కొంతయినా శబరి కథను చిత్రించాలని సుఖీభవా ప్రొడక్షన్స్‌వారు చేసిన ప్రయత్నం పూర్తి అయింది. జులై 15న ఆంధ్రప్రదేశ్‌లో విడుదల అయింది. మొన్న 20వ తేదీని పత్రికలవారికి ఫిలిం



శ్రీకృష్ణచిత్రవారి 'బావ మరదళ్ళు'లో కృష్ణకుమారి.

సెంటర్ స్టూడియోలో ఈ చిత్రం ప్రదర్శించారు.

శబరికథ ప్రామాణికంగా రామాయణంలో ఉంది. ఆ ఉన్నకథ ఆమె అవసానకాలం నాటిది. కాని కోకొల్లలుగా కట్టుకథలు జానపదకథలు శబరి జీవిత పూర్వార్థాన్ని గురించినవి వాడుకలో ఉన్నాయి. శబరి అవివాహిత అయిన శబరస్త్రీ అనేది రామాయణంతోపాటు, కట్టుకథలూ ఒప్పుకుంటున్న విషయమే.

ఈ రకరకాల కట్టుకథలూ కట్టుకుంటూ కాలానుగుణమైన కథ కల్పించి శబరి జీవితాన్ని చిత్రించినా, చివరికి రామాయణ గాథనే అనుసరించి శబరి పాత్ర ఔచిత్యం చెడకుండా రచయిత ఈ తెర కథ రాశారు.

శబరి (పండరీబాయి) అందచందాలు చూసి సరస కలిసిన ఆమెనే చేసుకోవాలనీ శతవిధాల ప్రయత్నించిన రాహువు (కీ॥ శే॥ ఆర్. నాగేశ్వరరావు) విఫలుడై ఆక్రోశంలో గూడెంరాణి అయిన శబరి చేస్తున్న పాలనను వ్యతిరేకిస్తాడు. శబరికి జీవకారుణ్యబోధచేసిన కరుణ(శోభన్‌బాబు) అనే మునికుమారునితో ఆమెకు లేనిపోని సంబంధాలు ఉన్నట్లు పుకార్లు పుట్టించి రాహువు, అతని బలగం గూడెం అంతా అల్లకల్లోలంచేసి శబరి తండ్రినిచంపి, శబరిని బంధిస్తారు. రాహువు శబరిని బలాత్కారం చేయబోయి విఫలుడై పులిబోనులో పారవేయిస్తాడు. కాని రాహువు ప్రేయసి శబరిని తప్పించి పారిపొమ్మంటుంది. అలా విధికృతం వికృతంకాగా తన సుకృతంవల్ల ఆ ప్రాంతాలలోవున్న మునిపల్లెచేరి మతంగమహర్షి ఆశ్రమంలో ఆశ్రయంపొంది శ్రీరామభక్తి పారవశ్యంలో తన్మయురాలై మునికన్యగా మారిపోతుంది శబరకన్య. ఇది ఛాందసులయిన మునులకుగిట్టదు. నీచకులాంగన అయిన శబరిని తరిమివేయాలని వారు ఎన్ని ప్రయత్నాలు చేసినా మతంగునిమతి చలించదు.

అలాగే కాలం శబరకన్యను శబరి అనే వృద్ధురాలుగా చేస్తుంది. పంపాతీరంలో శబరి ఆశ్రమం కట్టుకుని అక్కడనే శ్రీరామ నామామృతపానంతో జీవిస్తుంది. ఆంజనేయుని చెలిమికూడా ఆమెకు లభిస్తుంది. మతంగఋషి శ్రీరాముడువచ్చి శబరిని తరింపజేయనున్నాడని చెప్పి, తనకా అదృష్టంలేదని చెప్పి పంచత్వం పొందుతాడు.

ఆనాటినుంచి శబరి జీవితం తపస్సు అయిపోతుంది. నిత్యనేమంగా రామనామం జపిస్తూ పండుపండి ప్రుషమితోడిముసలిది గతంలోకి రాలిపోయే పరిపక్వానికి వస్తుంది.

ఆనాడు శ్రీరాములవారు సీతాన్వేషణలో శబరిఆశ్రమానికి వచ్చేరోజు. ఈ మూడుకాళ్ల ముదుసలి అయిన శబరి జీవితమంతా నిరీక్షించిన శుభముహూర్తం శ్రీరాముని రూపంలో ఆమె ఆశ్రమానికి వస్తుంది. పూలుపరచిన బాటనే ఆయనకాళ్లు కడిగి తీసుకువచ్చి పూలఅరుగుమీద ఆసీనుణ్ణిచేసి ఆకలిగొనివున్న



## సినిమా

అయ్యలకు తాను ఏరికోరి తెచ్చిన కమ్మని ఫలాలు యిస్తుంది. ఆ యివ్వడం తనచేత్తో యిస్తుంది. పొరబాటున చేదుపండు వుంటుందేమోనని నిండారే ఆపేక్షతో ఫలాలు కొరికి చూసి ఆ ఎంగిలిపళ్లు యిస్తుంది శబరి—శబరి కనుక! రాముడు రాముడు కనుక ఆరగిస్తాడు. ఆమె హృదయఫలం చవిచూస్తాడు. ఆ వింత చూసిన ఋషులూ, ఆంజనేయుడు, ఆఖరికి లక్ష్మణుడూ ఆశ్చర్యపోయారు.

పునరావృత్తి రహితమైన కైవల్యం ప్రసాదించమంటుంది ఆరగ్రముగ్గిన మహాఫలం శబరి. తను పోయినతర్వాత కూడా నలుగురికీ ఆధారం అయేటట్లు అనుగ్రహించమంటుంది.

శ్రీరాముడు ఆమెకు కైవల్యం ప్రసాదిస్తాడు. శబరి తరిస్తుంది. ఆమె తనువు అంతరిస్తుంది. సకల జీవజీవనాధారమైన 'శబరి' నదిగా అవతరిస్తుంది.

ఇది శబరి కథ.

ఈ కథలో ఉత్తరార్థం బాగున్నంతగా మొదటి సగం బాగుండదు. అందుకనే సినిమా చివరిసగం బాగుంది. పౌరాణికచిత్రాల ప్రాచీన దర్శకత్వంలో సిద్ధహస్తులు (చలనచిత్రపు నారాయణమూర్తి పురాణపద్ధతి ఎత్తుగడతో ఆచారప్రకారం సమర్థంగా చిత్రం రూపొందించారు. పాలగుమ్మి పద్మరాజుగారి మాటలు, కర్త, కర్మ, క్రియాపాత్రలు బాగున్నాయి. కాని శబరగూడెంలో కొందరు గ్రామ్యం, మరికొందరు శిష్టవ్యావహారికం మాట్లాడటంకారణం తెలీకవింతగావుంటుంది. పాటలు మొత్తంమీద బాగానే ఉన్నాయి. పల్లవి బాగున్నంతగా చరణాలు బాగుండక కొన్ని పాటలు తేలిపోయాయనే చెప్పాలి.

చిత్రంలో పెండ్యాల సంగీతం కూడా కథతో లయకలిపి రెండోభాగంలో బాగుంది. 'అనరాదా శ్రీరామయని', 'ఏమిరామ కథ శబరీ శబరీ' పాటలు లత్యమధురంగా వున్నాయి. "నిన్ను జూచునందాక" అనే కానడరాగగీతం హృదయం కదిలించడానికి పండరీబాయి అభినయంకూడా సార్థకత వహి...



సుభోదయా వారి 'శబరిగా' పండరీబాయి.

## భక్తశబరి

ఉంది. శబర గూడెం జాతరపాటలో 'ఆర్కెస్ట్రేషన్' చాలా బాగుంది.

నటీనటుల్లో అగ్రతాంబూలం శబరిగా పండరీబాయి అందుకుంటుంది. వృద్ధాప్యంలో ఆమె నటన ప్రతిభతో కూడుకుని వుంది. శ్రీరాముడుగా శారదాక్ దర్శనీయుడుగా వున్నాడు. కే. శే. అర్. నాగేశ్వరరావు రావణుడుగా చేసిన నటన కొంత కాలం జీవిస్తుంది. అహంబ్రహ్మగా ఎ. వి. సుబ్బారావు, మాతంగుడుగా నాగయ్య, కరుణగా శోభన్‌బాబు, కర్త కర్మక్రియలుగా పద్మనాభం, అల్లు రామలింగయ్య వగైరా సమర్థంగా నటించారు.

సుభోదయా ప్రొడక్షన్స్‌వారు ఈ స్థాయిని మరింత పెంచేందుకు కృషిచేస్తారని ఆశించవచ్చు. 

## వినోద చిత్రం 'వీర జగ్గడు'

శ్రీకృష్ణసాయి ఫిలింస్ అనువదించిన వీర జగ్గడు (జగ్గూకేథాకూ) చిత్రం జూలై 19 వ తేదీ విజయాలో పత్రికలవారికి చూపించారు.

'వీరజగ్గడు' దొరల్లో దొంగ అనిపించుకున్న దొంగల్లో దొర కథ. ఈ చిత్రంలో జానపద కథ జనరంజకమైనది. మంత్రాలు, మంత్రికత్తెలు, రాజకుమారిని ప్రేమించే జానపద వీరుడు, అందుకు అడ్డుతగిలే రాజవంశీకుడు, చివరికి అయిదారు యుగళగీతాల మీదుగా, కత్తుల యుద్ధాల మీదుగా ప్రేమకు విజయం – ఇలాగే వుంటాయి దాదాపు జానపద కథలన్నీ! 'వీరజగ్గడూ' అంతే.

ఇందులో జైరాజ్, జబీన్, చంద్రశేఖర్, మీనాముంతాజ్, కృష్ణకుమారి, మున్నగువారు నటించారు. మాటలు పాటలు ఆరుద్ర, సంగీతం హనుమంతరావు (?) తెలిగించారు.

చక్కని బాణీలతో ముచ్చటయిన పాటలూ, ఆటలూ, తగినంత హాస్యాంకల వినోద చిత్రం, అందమైన అనువాద చిత్రం వీరజగ్గడు మంచి కాలక్షేపం. ★

# వార్తాభరణం

## మద్రాసు

పక్షిరాజావారి 'విమల' ఆగస్టు 11 న ఆంధ్రప్రదేశ్‌లో విడుదల అవుతుంది. ఎన్. టి. రామారావు, సావిత్రి, రేలంగి, రాజనాల, రమణారెడ్డి, సూర్యకాంతం, సంధ్య, సుమిత్ర (?) వగైరా ఇందులో నటించారు. సెన్సారు అయింది. శ్రీ ఎస్. ఎం. శ్రీరాములునాయుడు దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి మాటలు పాటలు ముద్దుకృష్ణ.

* * *

శ్రీ ప్రొడక్షన్స్‌వారి 'అభిమానం' శరవేగంతో తయారవుతూంది. ఆగస్టు 26, (వినాయకచవితి) నాడు విడుదల అవుతుంది. సి. యస్. రావు దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి, కృష్ణకుమారి, కన్నాంబ, రేలంగి, ఎస్. వరలక్ష్మి, అల్లు రామలింగయ్య వగైరా నటిస్తున్నారు. సంగీతం ఘంటసాల.

* * *

## బొంబాయి

శంకర్ – జైకిషన్ జంట సంగీతం కూరుస్తున్న ఫిల్మ్‌యుగ్ వారి "ఆస్ కా పంఛీ" మూడువంతులు పూర్తి అయింది. రాజేంద్రకుమార్, వైజయంతీమాల, ప్రధానపాత్రలు ధరిస్తున్నారు.

* * *

కె. ఆసిఫ్ సమర్పిస్తున్న 'మొఘల్-ఇ-ఆజం' ఆగస్టు 5 న భారత్ అంతటా ఒకేసారి విడుదల అవుతున్నట్లు ప్రకటించబడింది. దిలీప్, మధుబాల, పృథ్వీరాజ్ కపూర్ ప్రముఖపాత్రలు ధరిస్తున్నారు. నౌషద్ సంగీతం ఇందులో మళ్ళీ వినిపిస్తుంది.

* * *

ఎల్. వి. ప్రసాద్ నిర్మిస్తున్న 'ససురాల్' హిందీ చిత్రం తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో తయారవుతూంది. 'ఇల్లరికం' హిందీలో తీయడానికి పేరు చేస్తున్న ఈ కృషిలో రాజేంద్రకుమార్, బి. సరోజాదేవి, సుభాషిణి (?), ధుమాల్, జయశ్రీ గడ్కర్, బిపిన్‌గుప్తా, లలితాపవార్, మున్నగువారు నటిస్తున్నారు. "రాఘవం"

# "చిత్రనల్లీయం"

'సుకుమార్'

ఒకానొక సినిమా థియేటర్లో పైక్లాసులో వున్న సోఫాలో దివ్యమైన మేడకట్టుకుని చాలాకాలంగా జీవిస్తున్నది ఒకనల్లి. 'నల్లి' అంటే అదొక పురుగు. అది నల్లగా వుంటుంది. అందుకనే దాన్ని మనం ముద్దుగా 'నల్లి' అని పిల్చుకుంటాము. నల్లిగారి మేడ నిండా పిల్లలూ, మనమలూ అంతా కలిపి కొల్లలు. ఈ కొల్లలు మిగతా నల్లులపిల్లలతో కలిసి, సినిమా చూడవచ్చేవారి రక్తాన్ని ఫుల్లలతో కూల్ డ్రింక్స్ పీల్చినట్టు పీలుస్తూ వుంటాయి. కొంత రక్తాన్ని ఇంటికి పట్టుకుపోయి ఇంత కాఫీ, మరికొంత పంచభక్ష్య పరమాన్నాలూ వండుకొని మూడుపూటలూ తాగుతాయి.

ఈ విధంగా తన కొల్లలతో సుఖంగా జీవిస్తున్న నల్లి వున్నట్టుండి ఒంటరిదై పోయింది. శాడ్ సాంగ్స్ పాడుకుంటూ జీవితం గడపసాగింది. ఒకనాటి రాత్రి తన మేడంతా కావురుమన్నట్టుగా కనిపించింది నల్లికి. ఎక్కడ చూసినా తన కొల్లలు, కొల్లలుగా తిరిగేవారు. వాళ్లంతా లీలగా కనిపించసాగారు. తనకూ తిండీ తిప్పలూ కరువై పోయినై. ఆకలి బాధలతో అలమటించి, అలమటించి తన కుటుంబమంతా 'నెత్తురో' మంటూ ప్రాణాలు విడిచారు. కొంతకాలం క్రింతంవరకూ తను మహారాజులాగా జీవించాడు. ఇంటినిండా నౌకర్లు-చాకర్లు! ఒక్క చాకరు వెధవేనా లేకుండా పోయినాడు ఇవాళ!

నల్లి మహారాజు మేడ దాటి బయట కొచ్చాడు. ఏదో పాట వినిపిస్తోంది. సోఫా చివరెక్కి నించుని చూశాడు. సినిమా జరుగుతోంది. నాయకి పాడుతోంది. నల్లిమారాజు కాస్సేపు పాటవిన్నాడు—'ఇది యిదివర కెక్కడో విన్నట్యూనేనే' అనుకున్నాడు. అతను నించున్న సోఫాకు ఇటూ అటూగా సోఫాలమీద చూశాడు. ఎక్కడా ఒక్కడు కూడా కనిపించలేదు. ముందువరసలో మాత్రం ముగ్గురు నలుగు రెవరో కూచునివున్నారు. వాళ్లు థియేటరుకు సంబంధించిన మనుషులని తెలుసుకోటానికి అతనికి అయిదు సెకండు కూడా పట్టలేదు. వాళ్ళేమీ చెయ్యరాదని భావించాడు మహారాజు. నల్లిమహారాజు కళ్లు పెద్దవి, ఇంకా పెద్దవిచేసి చూడసాగాడు. థియేటరు ముందు క్లాసుల్లో జనాలు కూచున్నారు. వాళ్లంతా కులాసాగా నవ్వుతూ చప్పట్లు చరుస్తున్నారు.

ఏంబుద్ధి పుట్టిందో నల్లిమారాజు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కింది క్లాసుకు పయనించాడు.

అర్ధరాత్రి. అంతా నిర్మానుష్యం గా వున్నది. థియేటరంతా చీకటిగా వుంది. ముందుక్లాసులో బెంచీమీద ఏదో మానవాకారం కనిపించింది నల్లికి. ఆశగావెళ్లి చూసి 'పీడా' అనుకుని వెళ్లిపోయింది. వాడు ఆ థియేటర్లో సోడాలమ్మే కుర్రాడు. రెండో ఆట అయినతర్వాత వాడు ఆ బెంచీమీదనే దివ్యమైన భవనాన్ని నిర్మించుకుని అందులో హంసతూలికాపాన్పు ఏర్పాటు చేసుకుని తెల్లవారుఝామున తొమ్మిది గంటలదాకా హాయిగా నిద్రపోతాడు. వాడి శరీరమంతా గాట్లుచేసినా ఎక్కడా నెత్తురుచుక్క పుట్టదని నల్లి నమ్మింది.

వాడిని దాటుకుంటూ నల్లి మహారాజు చీకట్లో తడుముకుంటూ వచ్చాడు. ఎక్కడా ఏ అలికిడీ లేదు. తనజాతి సోదరులు ఎవరైనా వుంటారా అని 'ఏవర్రా' అని అరిచింది. ఎవరూ పలకలేదు. కాస్సేపటికో గూర్ఖానల్లి ఆ ప్రాంతాన పోతూ, నల్లిమహారాజును చూసి—"ఏయ్, ఎవరు నువ్వు?" అని గద్దించాడు.

"నాయనా నాయనా ఎన్నాళ్లకు కనిపించావురా. నిన్ను చూడగానే ఆప్తులంతా కనిపించినట్టయిందిరా. కళ్లు కాయలుకాచి పోయినై. మనజాతికి చెందిన ఒక్క పురుగు గూడా ఈమధ్య నాకు కనిపించలేదుకదురా" అని వాపోయింది.

"ఎక్కణ్ణుంచీ?" అన్నాడు గూర్ఖా.

"పై క్లాసుల్లో నుంచి వస్తున్నారా" అన్నాడు మహారాజు.

"ఓహో! ఇన్నాళ్లకు కిందవాళ్ళం కనిపించామన్నమాట. "ఏంకథ" అన్నాడు గూర్ఖా.

"ఎవరింటికన్నా తీసుకువెళుదూ—బాబూ, ఆకలి, ఆకలి తిండలేను" అన్నాడు మహారాజు నీరసంగా. గూర్ఖానల్లి జాలిపడ్డది. రమ్మని తీసుకువెళ్ళింది. ఒక పెద్దమేడముందు నించుని గేటు చప్పుడుచేసింది.

"ఎవరు?" అన్నాడు లోపల్నుంచి యజమాని.

గూర్ఖాను "ఈఅర్ధరాత్రివేళ లేపుతావేంరా మూర్ఖా" అని గర్జించాడు. గూర్ఖాకు కోపం వచ్చింది 'మూర్ఖా' అని పించుకున్నందుకు. కోపంగా మహారాజుకేసి చూశాడు.

"మరేం ఫర్వాలేదులే. వాడు అన్న మూర్ఖాలో 'మూ'తీసేసి 'గూ' తగిలించుకుని డైలాగు మార్చుకో" అన్నాడు మహారాజు అంతనీరసంలో నూ హ్యూమర్ వెదజల్లుతూ.



దేవర్ ఫిలింస్ వారి 'కార్మిక విజయం'లో బి. సరోజాదేవి.

"తలుపు తియ్యండీ" అన్నాడు గూర్ఖా.

"అయ్యా తలుపుతియ్యండి, బ్రతికి చెడ్డవాడిని" అన్నాడు మారాజు.

"ఇక్కడెవరూ వచ్చిన మంచివాళ్ళు లేరు, 'ఫో'" అన్నది లోపలి కంఠం.

"మీ హ్యూమర్ బాగుందిగానీండి, నవ్వే వోపిక లేదండి-తలుపు తియ్యండి-హాస్య సినిమాకు స్క్రిప్టు రాస్తారా" అన్నాడు మహారాజు.

"ఎక్కడా-యీ సొద" అనుకుంటూ యజమాని లేచి తలుపు తీశాడు. నల్లిమహారాజు నమస్కారంపడేసి, తన కథంతా చెప్పుకున్నాడు.

"లోపలికిరండి, మన్నించండి" అన్నాడు యజమాని. మన్నించి, లోపలికివెళ్ళాడు నల్లిమారాజు. ఇంటినిండా దీపాలు వెలిగాయి. పిల్లలూ కొల్లలూ లేచికూచున్నారు. అంతా మారాజుచుట్టూ 'ఈ అర్ధరాత్రి కొత్తమనిషెవరో' అని మూగారు. అందర్నీ చూసి మహారాజు కళ్లనీళ్ళు విడిచాడు.

"అహో నా భాగ్యం! ఎన్నాళ్లయింది, ఎన్నాళ్ళయింది! మనజాతి మనజాతి..." అన్నాడు మారాజు ఉద్రేకంగా.

"ఎవరునాన్నా" అన్నది ఒక కొల్ల.

"చెబుతానమ్మా. నేనూ అందరిలాగానే హాయిగా సిరిసంపదలతో పుత్రపౌత్రాదులతో బ్రతికినవాడినే. కాని ఈమధ్య అంతా గడ్డు రోజుల మహాత్యంవల్ల—నా సర్వస్వాన్నీ పోగొట్టుకున్నాను—ఈమధ్య ఏదో సినిమా చూస్తున్నాము. మా సోఫామీదే ఒక నల్లటి లావాడు కూచున్నాడు. కూచుని చిత్రాన్ని తెగమెచ్చేసుకుంటున్నాడు. నా పెదకొడుకు రెండు రీళ్ళు చూసి—'ఛూ, ఫ్లాప్ పిక్చరూ' అన్నాడు. వీడికెందుకు చెప్పండి—ఏదో పీడిపని పీకు చూసుకుని పోక. అమాట ఆ లావాటివాడు



శ్రీ కృష్ణసాయి ఫిలింస్ వారి 'విరజగ్గడు' చిత్రంలో - జబీన్, జైరాజ్.

# చిత్రనల్లీయం

తిన్నాడు. గుడ్లు అంతవిజేసి, మా అబ్బాయిని చూసి, కోపం తెచ్చుకొని, కళ్లెర్రజేసి— మా అబ్బాయిని చేతబుచ్చుకుని, నల్లిని నలిపినట్టు నలిపి పారేశాడు. మావాడికేం తెలుసు చెప్పండి-వాడే ఆ ఫిల్ము ప్రొడ్యూసరట!"

"అయ్యో!" అన్నాడా ఇంటియజమాని ఆశ్చర్యమూ జాలి రెండూ మేళవించే కారెక్టరు రాక్టరు అమ్మమొగుడల్లే.

"ఆతర్వాత నాభార్య — తిన్నయింటికే వాసాలు లెక్కపెట్టినట్టు—థియేటరు యజమాని పుత్రరత్నాన్ని కరవబోయేసరికి— వాడు అమాంతం హత్యచేసి పారేశాడు. ఏకోర్టులో మొరపెట్టుకోను!" అన్నాడు మారాజు.

"బాడ్మింటన్ కోర్టులో" అన్నది యజమాని కూతురు నెమ్మదిగా నవ్వుతూ.

"నువ్వూ మీ నాన్నగారల్లే హాస్యచిత్రాలకు రాయగలవుగాని తల్లీ—ఇప్పుడువాటికి సమయంకాదు. పైతరగతిలో జీవిస్తే గొప్పనుకున్నాను అందరికంటే ఎన్నో మెట్లు పైనవుంటా ననుకున్నాను. కాని— ఈమధ్య ఆసోఫాల క్లాసులకు జనాలు రావటంలేదు. మాకు తిండీ తిప్పలూ కరవై పోయినాయి. సంతానం నశించింది."

"ఎందుకు రావటం మానేశారు?" అన్నాడు యజమాని.

"వాళ్ళకునచ్చే చిత్రాలు రావటంలేదు." ఎంతసేపూ కొట్టుకున్నవీ, తన్నుకున్నవీ తప్ప—క్లాసుచిత్రం కానరాకుండావున్నది. ఈ మాస్‌చిత్రాలవల్ల — క్రింది తరగతుల్లో నగరాలు నిర్మించుకున్న మీకు లాభం

ఈ మధ్య—సత్యజిత్‌రాయో ఎవరోట- ఆయన తీసినచిత్రం వచ్చింది. మా తరగతంతా నిండిపోయింది. ఎంతో సంబరపడ్డాం. మధ్యలో 'ఇంటర్వల్' అని ఒకటియేడ్చి దీపాలు వెలిగిస్తాడుగా—మేమంతా ఇళ్లకు పోయాము. మళ్లీ వచ్చి చూసేసరికి సగంసీట్లు ఖాళీ. వాళ్ళ కెవరికీ అర్థంకాలే దనుకుంటాను ఆ చిత్రం. నలుగురికీ అర్థంఅయ్యేవి తియ్యరాదా అని నాగోల!" అన్నాడు మహారాజు.

మహారాజు ఉపన్యాసకంఠం పక్క ఇళ్లకు పాకి—సంగతులు వినటానికి నల్లులు బారులు బారులుగా వచ్చి చుట్టుముట్టాయి.

"ఒకొక్కప్పుడు ఇంగ్లీషుచిత్రాలు వస్తాయి. నీళ్ళ తన్నాగొయ్యా—అవెందుకు తెప్పిస్తారోనండీ. మావేపు జనాలే వుండరు. వచ్చేవా ళ్ళెవరో మావేపే వుంటారు" అన్నది యజమానినల్లి.

"నయం! తెలుగుభాషే అర్థంకాని యీ మనుషులకు అవెందుకు చెప్పండి. మేమూ ఏమీ జుర్రుకోవటం లేదు ఇంగ్లీషుచిత్రం వస్తే. అదివుంటే రెండురోజులేగా మహా!" అన్నది మారాజునల్లి.

"ఐనా మరీ అధ్వాన్నంగా వీమిటా చిత్రాలు-వారమూ రెండువారలూ ఆడటం-తర్వాత వెళ్లిపోవటం! తలా తోకా ఏమీ ఉండటంలేదుగా వీటికి" అన్నది ఒకచుట్టపు నల్లి.

"పెద్ద తారలంతావుంటే మాకు పండగే లెండి" అన్నది యజమాని నల్లి.

"ఆ కొన్ని కొన్ని అవి అలాగే వెళ్ళి పోతున్నాయిలెద్దురూ రెండోవారం కంటికి తెలియకుండా" అన్నాడు నెమ్మదిగా-ఒక గృహస్థు.

"దానికి బాధ్యత తారలది కాదుగా—ఆ కథలూ, ఆ దర్శకులూ" అన్నది విమర్శన తెలిసిన ఒకనల్లి.

"ఐనా స్టార్‌వాల్యూమీద జనాలకు నమ్మకం పోయింది. వీళ్ళందరికీ ఇప్పుడు కథలు కావాలట — కథ బాగాలేకపోతే మనకు పస్తే. మంచికథలుతీస్తే వీళ్ళసొమ్మేంపోయింది చెప్పండి" అన్నాడు మన మారాజు.

మిగతా నల్లులన్నీ ఈమాటకు ఎగిరిపడి, వాడికేసి క్రూరంగా చూశాయి.

"నీమొహంరా! దానివల్ల వాళ్లకుపోయిందేముంది? మనకేనష్టం! వాళ్ళకే హాయి!" అన్నాడు యజమాని.

'చెత్త ఐడియా' ఇచ్చినందుకు ముడుచుకపోయి ఫ్లాప్‌పిక్చర్ తీసిన దర్శకుడల్లే అయిపోయి, వెళ్ళి పడుకున్నాడు యువకరత్నం.

"క్లాసు చిత్రాలూ మాస్ చిత్రాలూ అని వేరువేరుగా నిర్మించకూడదు ఈ నిర్మాతలు. అందరికీ బాగుండేట్టుగా తీస్తే మనందరికీ ఇంత కూడూ గుడ్డా వుంటుంది. ఇట్లాఅన్నానని నన్ను కమ్యూనిస్టు అంటారా కొంప తీసి!" అన్నదింకో యువకరక్తం.

"ఏమైనా ఈరోజుల్లో అదృష్టం అంతా మీదే" అన్నాడు మారాజు యజమానిని ఉద్దేశిస్తూ.

"ఆఁ ఏముంది-మీరు అక్కడ ఒక్కడిని తాగిన రక్తం మేము ఇక్కడ నూరుమందిని తాగితే మాత్రం లభిస్తుందా?" అన్నది ఇందాకటి యువకరక్తమే.

"ఏమయినా మనజాతి నాశనం ఐపోయేట్టున్న ఈ తరుణంలో మనం అందరమూ ఈ నిర్మాతలకు ఒకతీర్మానాన్ని పంపుదాము" అన్నాడు మారాజు

ఆరాత్రి రాత్రే అంతాకూడి సభజరిపి ఒక తీర్మానాన్ని తయారుచేసి చిత్రనిర్మాతలకూ థియేటరు యజమానులకూ పంపేశాయి. తీర్మాన సారం

1 'ఏకతరగతి' చిత్రాలు నిర్మించాలి.

2. కథలు బాగుండాలి. బాగుంటే అందరికీ నచ్చవచ్చును.

3. వీలయితే అంతా ఒకటిగా 'జనాల క్లాసు' పెట్టాలి.

4. వీలైనంత పబ్లిసిటీ ఇచ్చి జనాలను థియేటరునిండా రానివ్వాలి. 'లిమిటెడ్ కపాసిటీస్' అనేపద్ధతి తొందరగా తీసి పారెయ్యాలి.

5. అంటురోగులు రాకూడదనే నియమాన్ని విధిగా పాటించాలి.

మరా : థియేటరు సోఫాలమీదా, కుర్చీల మీదా అన్నిరకాల ఆసనాలమీదా మందులు చల్లరాదు.

మేంకోరిన చిత్రాలు నిర్మించి, థియేటర్లో నిండా జనంవుండేట్టుగా చూడాల్సిన బాధ్యత నిర్మాతలది. థియేటర్లో జనంకనక లేకపోతే మాజాతి జాతిఅంతా బొమ్మ ఆడుతున్న తెరపైకి ఎక్కి నటీనటులను పీల్చగలదని హెచ్చరించడమైనది.

ఇట్లు,
అఖిల థియేటర్ల మత్కుణ సంఘం.



శ్రీ ప్రొడక్షన్స్ వారి 'అభిమానం'లో రేలంగి, ఎస్. వరలక్ష్మి, సావిత్రి వగైరా

# వగైరా వగైరా

## నౌషదం గాయకౌషధం

పది సంవత్సరాల క్రితం ఇండియాలో స్వర రాగ తాళాలకు ఏకవచనం నౌషద్ అనీ, నౌషద్‌కు బహువచనం అతను కట్టిన బాణీలనీ చెప్పుకునేవారు. 'బైజూబావరా' తర్వాత అతని సంగీతం 'మదర్ ఇండియా' లో వినిపించింది. మళ్ళీ నౌషద్ ఒక్కడే సంగీత దానం చేయగలిగినవాడని అంతా అనుకున్నారు. అప్పుడే విడుదల అయిన షబాబ్, అమర్ చిత్రాలు చూసినవారు 'సంగీత నౌషదానికి కాలదోషం పట్టిందన్నారు. 'ఉరన్ కటోలా' చూసినవారు ఒక్కసారిగా 'అన్నట్టు నౌషద్ మ్యూజిక్ ఈమధ్య ఎక్కడా రావడం లేదే' అని 'ఉరన్‌కటోలా వచ్చిందన్నమాటేగాని నౌషద్ కళ ఇందులో వినిపించలేదు' అని అన్నారు.

ఇప్పుడు నౌషద్ 'మొఘల్-ఇ-అజాం' చిత్రానికి సంగీత రచన చేస్తున్నాడు.

నౌషద్ పాటలు విని శ్రోతలు మేను మరుస్తారు. గాయకులు వళ్ళు తెలిసి మరింత కృషి చేసి గొప్పవారౌతారు. గాయకులకు నౌషధం ఔషధం వంటిది. దీదార్, బైజూబావరా వంటి చిత్రాలు అతని కీర్తిపతాకలు.

## ఘంటసాల గాత్రధారణ

తొలిసారిగా స్వర్గసీమలో నారాయణరావుకు గాత్రధారణ చేసిన ఘంటసాల వెంకటేశ్వరరావు, పదేళ్ళుగా అనర్గళంగా తన గళంతో దక్షిణాది చిత్రకళకే నిగళంగా ఉన్నారు. రసాల ఫల మధురిమ లొలికించే ఘంటసాల గానం ఆబాలగోపాలం ఈ దశాబ్దమూ ఆనందించారు. ఆయన గౌళ గాత్రం అనుకరించడానికి వర్తమాన గాయకులెందరో కృషి చేసేవాళ్ళు. అతను ఎక్కడ ఏ పదం ఎలా కదం తొక్కిస్తే అలా అనుకరించి తెలుగునాట ఘంటసాల చాలాచోట్ల వెలిశాడు.

అసలు రాగాల్లో 'పాతాళభైరవి' అనే రాగం ఒకటని, కర్ణాటక సంగీతంలా, 'ఘంటసాల సంగీతం' మరోటనీ కూడా చెప్పుకున్న రోజులున్నాయి.

గాయకుడుగా ఘంటసాలనుగురించి రెండు అభిప్రాయాలు లేనేలేవు. సంగీత దర్శకుడుగా ఆయననుగూర్చి కొన్ని అభి చెల్లుబాటులో ఉన్నాయి.

ఆనాటినుంచి ఈనాటిదాకా గాయకులలో అగ్రతాంబూలం ఆయనే పుచ్చుకుంటున్నాడు.



హైదరాబాద్ మూవీస్ వారి 'బల్లాక్షాయుడు'లో జగ్గయ్య, జమున.

## దీక్ష

(12-వ పేజీ తరువాయి)

వీధి రానేవచ్చింది. బండి బాగా వీధిలోకి పోయాక, కొంత చీకటిగా వున్న చోట్లో బండిని ఆపించి, నెమ్మదిగా దిగాడు. కాళ్లు వొణుకుతూ ఉండడంవల్ల సరిగా నిలబడలేక కొద్దిగా తూలాడు. అంతలోనే సర్దుకుని, డబ్బులుతీసి ధైర్యంగా జట్కావాడి చేతిలో పెట్టేశాడు.

జట్కా వెళ్ళిపోయింది. శేషగిరి అ చీకట్లో కదిలి బయటకొచ్చాడు. అదంత పెద్ద వీధికాదు. సందు. ఎక్కడా మనుష్య సంచారం లేదు. తన దొడ్డిగుమ్మం కొన్ని గజాల దూరంలోనే ఉన్నది. అక్కడికి చేరుకోడానికి శేషగిరికి సప్త సముద్రాలూ దాటాలన్నంత ప్రయత్నం చేసి నెమ్మదిగా రెండడుగులు ముందుకువేసి చటుక్కున ఆగాడు. వెనకాల ఎవరో వస్తున్న శబ్దం వినిపించింది. శేషగిరి వెనక్కు తిరిగాడు—తన మిత్రుడొకడు! శేషగిరికి గుండె 'దడ దడ' హెచ్చింది. తొందరగా చీకట్లోకొచ్చి తార

టూడసాగాడు. దొంగలాగ నక్కుతూన్న శేషగిరిని చూసి—"ఎవరది?" అని గద్దించాడు ఆ మిత్రుడు. శేషగిరి ప్రాణాలు పైనే ఎగిరిపోయినయ్. అయినా ఆ వెంటనే నిలద్రొక్కుకుని, గొంతు మార్చి, ధాటీగా—"ఈ యింటి పాకరోడిని బాబూ!"—అన్నాడు.

ఆ మిత్రుడు 'ఓ' అని తన దారిన వెళ్ళిపోయాడు. ఈలపాట పాడుకుంటూ, 'అమ్మయ్య' అనుకున్నాడు శేషగిరి. తను మహానటుడు! కాని అంతలోనే శేషగిరికి ఓ అనుమానం కలిగింది. తను చనిపోయిన వార్త వీడు వినలేదా? వింటే, ఇట్లా ఈలపాట పాడతాడా? ఒకవేళ వినలేదేమో! వినకుండా వుండటానికి అవకాశం లేదు. ఆ వైరు చాలా సేపటిముందే చేరి వుంటుంది. కొంపదీసి ఆ వైరు చేరలేదేమో అనే సందేహం కూడా కలిగింది. చేరక ఏమవుతుంది? అసలు తనకొంప జేరితేనేకాని అన్ని విషయాలూ పూర్తిగా బయటపడవు.

ప్రాణాలు బిగబట్టుకుని వూపిరి స్తంభించుకుని నెమ్మదిగా అడుగులువేస్తూ శేషగిరి తన ఇంటి దొడ్డిగుమ్మం చేరుకున్నాడు. దొడ్డిగుమ్మం ఏమంత ఎత్తయినది కాదు. తట్టి చూశాడు—మూసివుంది. ఏమయినా ఏడుపులు వినిపిస్తున్నాయేమోనని తలుపుమీద చెవిపెట్టి విన్నాడు. ఎక్కడ ఏమీ వినిపించలేదు. దానికి ఒక కారణం వుండొచ్చు. దొడ్డిగుమ్మంనుంచి ఇంట్లోకి కొద్దిగా దూరం వుంది. ఇక్కడినుంచి కేక వేసినా కూడా అందనంతదూరం!

అటూ ఇటూ చూసి శేషగిరి గోడ ఎగబ్రాకి, చప్పుడు చెయ్యకుండా అవతలకు దిగాడు. అంతా చీకటిగావుంది. దొడ్డి నిండా గడ్డి పెరగటంవల్ల దోవకూడా సరిగా తెలియటంలేదు. అలవాటయిన ప్రదేశమే కాబట్టి తడుముకుంటూ దొడ్డిదాటి బావి దగ్గరకు చేరుకున్నాడు. బావి ముందున్న తలుపులు కూడా మూసివున్నై. శేషగిరి నెమ్మదిగా తలుపు సందులోంచి చూశాడు. గుడ్డిగా దీపం వెలుగు కనిపించింది. ఆ వెలుగులోనే దూరంగా మసకమసకగా ఎవరో పడివున్నట్టు కూడా కనిపించింది. ఆ పడివున్నది తన భార్యేనని తెలుసుకోగల్గాడు శేషగిరి. ఎవరో ఏడుస్తున్నట్టు కూడా వినిపించింది. అమ్మయ్య! తన వైరు అందింది! కాని—గోలుగోలున ఏడుపు వినిపించటంలేదేం—

అంతలోనే శేషగిరి పెద్దగా ఏడుపు విన్నాడు. అది తన తల్లిది! ఎవరో ఇంటికి రాగా వాళ్ళను చూచి ఆమె బావురు మన్నట్టుంది. "ఎంతపని చేశావురా నాయనా, ఎంతపని చేశావురా! ఇంతలోనే నీకు నూరేళ్ళూ నిండిపోయాయా? నా తండ్రీ! నీ శవాన్ని కూడా చూసే దిక్కులేక పోయిందిరా" అని ఆమె ఏడుస్తున్నది. "వూరుకోండమ్మా ఏంజేస్తాం" అంటున్నారెవరో. తన భార్య ప్రక్కను ఎవరో కూచుని లేవదీస్తున్నారు. ఆమె లేచి కూచుంది. అంతలోనే ఒక్కసారి కూలబడి భోరున ఏడ్చింది. పిల్లలంతా 'అమ్మా అమ్మా' అని దగ్గర కొస్తూ చుట్టుముట్టారు. ఒకబ్బాయి 'నాన్న నాన్న' అంటూ ఏడుస్తున్నాడు.

"నాన్నగారు వస్తారమ్మా!" అన్నారు ఎవరో.

"నాన్న! బాబూ! నాన్న ఇంకరారమ్మా నాన్న ఇంకరారు!" అని శేషగిరి భార్య తల బాదుకుని ఏడుస్తున్నది...ఎవరెవరో వస్తున్నారు...మాటలు వినిపిస్తున్నై...

తన మరణవార్త అందరికీ తెలిసినట్టు రూఢి చేసుకున్నాడు శేషగిరి. అంతా వింటూ ఆనందపడసాగాడు. వచ్చినవాళ్ళల్లో కొందరు వెళ్తున్నారు...కొందరు వస్తున్నారు. తననుగురించే అందరూ మాట్లాడుకుంటున్నారు. ఆ మాట లేమిటో సరిగ్గా తెలియకపోయినా ఎవరెవరు రావాలని తను అనుకున్నాడో ఆ స్నేహితు లంతా వస్తున్నారు. మధ్యలో భార్య శోష వచ్చి పడిపోయింది. శేషగిరికి దుఃఖం కలిగింది. తన భార్యను ఇంకా ఏడిపించటం తగదనుకున్నాడు. తను చచ్చిపోతే అంతా ఈవిధంగా దుఃఖిస్తారని తేలిపోయింది! తనను గురించి అంతా చక్కగానే మాట్లాడుకుంటారన్నమాట! ఈ వ్యవహారాన్ని ఇంక పొడిగించరాదని తీర్మానించుకున్నాడు శేషగిరి. ఇంక ఆట్టే ఆలస్యం చెయ్యకుండా వాళ్ళముందు పడాలి. లేకపోతే ఇట్లా తను చనిపోయినట్టు తన మామగారికీ, దూరపు బంధువులకూ తెలియజేస్తారు. తను ఆడిన నాటకం బాగా రక్తి కట్టింది! తను ఇంక తలపాగా లాగి పారేసి, పైన తొడుక్కున్న వేషం తీసేసి—దేవుడు పంపినట్టు ఛటుక్కున ఇంట్లో ప్రత్యక్షం కావాలి! శేషగిరి కిందనున్న చేతిసంచీ చేతిలోకి తీసుకుని, ఇంట్లోకి రావటానికని మళ్ళీ దొడ్డిగుమ్మం దాటాలని లేచాడు.

* * *

ఇంట్లో రోదన ధ్వనులు ఎక్కువయినై. శేషగిరి భార్య ఎంతమంది వూరుకోమంటున్నా వినకుండా పిల్లవాళ్ళను పట్టుకుని, నెత్తినోరూ బాదుకుని ఏడుస్తున్నది. ఈ ఏడుపుల శబ్దాన్ని చీల్చుకుంటూ భయంకరమైన ఆర్తనాదం ఒకటి వినిపించింది వాళ్ళకు. అందరూ ఆశ్చర్యంగా పరుగెత్తి దొడ్డి తలుపులు తెరచి చూశారు. ఆ కేక వేసినవాడు శేషగిరి! చీకట్లో క్రింద బోర్లా పడివున్నాడు. చేతిలో వుండాల్సిన సంచీ పట్టుతప్పి ఎక్కడో పడిపోయివున్నది. శేషగిరి స్నేహితుడొకడు దీపం తీసుకొచ్చి చూశాడు. శేషగిరి నోట్లోంచి తెల్లగా నురగలు వస్తున్నై!...అందరూ దిష్టి బొమ్మలల్లే చూస్తూ వుండగా శేషగిరి కాళ్ళకు చుట్టుకునివున్న ఒక పెద్ద సర్పం బుసలు కొడుతూ నెమ్మదిగా బయటకు వచ్చి, తొందరగా ఆ చీకట్లోంచి ప్రాకి పొదల్లోకి దూరిపోయింది! ★

# విగ్రహం విహంగం

(54-వ పేజీ తరువాయి)

దానిని చేయించి నగరు మధ్యనున్న ఈ బజారు వీధిలో ప్రతిష్ఠించాలని, అలా చెయ్యడంవల్ల ప్రతిరోజూ ఆ విగ్రహాన్ని చూచినప్పుడంతా ప్రజలు సుఖప్రభావులైన మన యువ రాజును జ్ఞాపకం చేసుకుంటూ ఉంటారనీ, ఆవిధంగా చేస్తే మన రాజు, రాణీగార్ల ఆత్మలకు సంతృప్తి కలిగితాయనీ, కాబట్టి అలా చెయ్యవలసినదని మిమ్మల్ని కోరుతున్నాము" అన్నారు.

ఆమాటలు విని "మీ సలహాకు నా కృతజ్ఞతాభివందనములు. అలాగే ఏర్పాటు చేయిస్తాను" అన్నారు అమాత్యులు.

(మిగతా వచ్చేవారం)

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ళనుడికట్టు-13

## ఆధారాలు

### అడ్డము

*1 స్త్రోత్రి.

4. ఇలా వయనము చిత్తగిస్తే, యుద్ధంలో, అవమానం.

7. పువ్వుకు ముద్దు నిచ్చే దాంట్లో కలువ దాగిఉంది.

9. పారితే అదృష్టం!

10. మేము మాత్రం ఆపం! కావాలంటే మీరే విసినకర్రను వెతుక్కోండి.

11. పలువురు రుద్ధకంఠంలో రాక్షసుని వెదకాలి.

12 తల్లక్రిందులయిన తరంగం.

14. చెవులు, స్నేహంతో సమానమైనవి.

15. ఇంగ్లీషులో న్యాయవాది-తెలుగులో కూడా వాడతారు! (శబ్ద రత్నాకరంలో)

17. మీాకేది!

18. ఆరోహణలో మొదటి కొమ్ము నిస్తే కొమ్మ మిగుల్తుంది!

19. ఆకుదులిపితే ఎగిరి పడటమా?

21. అధికమైన శక్తి!

22. సోముడిలో బంధము.

23. అతనికా పలాయన దోషాన్ని ఆరోపిస్తారు? అసలు రక్షణ ఏర్పరచి ఉండాలి.

24. తోముకులో కలిసి ఉండటం!

25. గర్వములో చేదు.

27. కనుక మనలోయ వెతకండి.

31. నగం విందామంటే తామర పువ్వు సూచింపబడుతుంది.

32. పక్షికి పిట్టచేరిస్తే గుడ్లగూబ.

> **ఆధారాల పోటీ**
>
> గళ్ళనుడికట్టు-13 లో 1 అడ్డం మాటకు, 20 నిలువు మాటకు మేము ఇచ్చిన ఆధారాలకన్న ఉత్తమమైనవి పంపేవారికి రు 5 లు బహుమతిఇస్తాము. ఆధారాలు మాకు చేరవలసిన ఆఖరి తేది ఆగస్టు 6, 1960.

### నిలువు

2. మాట!

3. సంగీతంలోని వర్ణము.

5. 'లా'లో చిన్న మోసం!

6. నడకలో నడక.

8 అందరు వున్నచోట తాళము.

9. పావులాభం కావాలంటే నాల్గగాలు.

10. ఐదు ఉపాయాల కథలు.

13. అతిథి కాకపోయినా అంతటివాడు.

14. కారాగృహంకు చేరిస్తే తీపి!



16. మీరు సుముఖంగా వుంటేడబ్బు ముట్టకేం చేస్తుంది?

*20. వదంతి.

21. శక్తిని సూచించే కొంగ...

26. దండములు, రాక్షసులు, గుడియలు!

28. మీరు బహువచనాన్ని విధంగా ఏర్పరిస్తే తప్ప మాత్రమేకాదు, మానెవదార్థాన్ని కూడా సూచిస్తాగా.

29. పొలిమేరలో కూడా క్రమమా?

30. పటిలోని కోతి.

## 12-వ గళ్లనుడికట్టుకు జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తు | ను | క | ■ | ప | రు | పు | ■ | ప్ర | శ్రీ | య |
| ర | ■ | ణ | ■ | లు | ■ | లి | ■ | జా | ■ | క్ష |
| క | ల్ప | త | రు | వు | ■ | తో | డు | నీ | డ | గా |
| ము | ■ | లు | ■ | రు | చు | లు | ■ | క | ■ | నం |
| ■ | వా | ■ | ■ | ■ | క | ■ | ■ | ము | ర | ■ |
| తం | హి | ■ | పే | రో | ల | గ | ము | ■ | గ | డి |
| ■ | ని | గ | ■ | ■ | రే | ■ | ■ | ■ | డ | ■ |
| డి | ■ | ట్టె | ■ | అ | డు | గు | ■ | యు | ■ | కు |
| అ | క్ష | ర | ల | క్ష | ■ | స | క్ష | త్ర | కు | డు |
| యా | ■ | క | ■ | య | ■ | ప | ■ | యు | ■ | ము |
| స | గ | ము | ■ | ము | ఖ్య | ము | ■ | గం | టు | లు |

> **గళ్లనుడికట్టు-11**
>
> **ఆధారాల పోటీ ఫలితం**
>
> శ్రీ డి. వెంకటాచలపతి (బుక్కపట్నము) పంపిన ఆధారాలు ఉత్తమమైనవిగా నిర్ణయించి ఆయనకు బహుమతిగా రు 5 లు పంపుతున్నాము.
>
> శ్రీ వెంకటాచలపతి పంపిన ఆధారాలు ఇవి :
>
> 2 నిలువు. అశాశ్వతమైన యీ యవనికలలో తెరవంటిది. (మేము ఇచ్చినది-తెర). జవాబు-యవనిక.
>
> 9 అడ్డము. ఈ కాలమే ఆ కలికాలం (మేముఇచ్చినది-ఈ కాలమే!) జవాబు-కలికాలం. —సంపాదకుడు.

# పొట్టి కథలు

కొరియాలో యుద్ధం జరిగే కాలంలో అమెరికన్లు కొందరు అక్కడి ఆచారాలను కొన్నిటిని మార్చాలని ప్రయత్నం చేసి చూశారు. ఒకరోజు కొందరు కొరియన్లు తమభార్యల చేత బరువులు మోయిస్తూ ముందు కంచర గాడిదల మీద ఎక్కి వెళ్ళడం చూసి వారిని ఆపి, స్త్రీల నీవిధంగా హింసించడం తప్పనీ, అసలు న్యాయంగా చూస్తే వారిచేత ఇటువంటి మోటుపనులు చేయించకూడదనీ చెప్పారు.

కొన్ని రోజుల తర్వాత కంచర గాడిదల మీద ఎక్కి వెళుతున్న ఆడవారిని వెనకాలే నడిచి వెళ్తున్న వారి భర్తలనూ చూసి సంతోషం ఆపుకోలేక మళ్ళీ వారిని ఆపి, అమెరికన్లు "చాలా బావుంది కాని ఇంత మార్పు రావడానికి కారణం?" అని అడిగారు. "ఏం లేదు, నేలలో బాంబులు (మైన్లు) శత్రుపక్షంవారు పాతిపెట్టున్నారని విన్నాం. ముందు నడిచే వారికే గదా ... ..." వారు సమాధాన మిచ్చారు.

* * *

జీవితమంతా చెడు అలవాట్లు చేసుకొనడమే కాక తనకు దేవుడిపైన నమ్మకం లేదని చెప్పుకొన్న ఒక పెద్దమనిషి ముసలితనంలో ప్రాయశ్చిత్తం చేసుకోదలచానని ప్రకటించాడు. కొందరు ఇది విని సంతోషించి 'ప్రాయశ్చిత్తం' మొదలు పెట్టారు. మొదట తలగొరిగించి తర్వాత తలమీద చన్నీళ్ళుపోసి స్నానం చేయించ బోయారు. మొదటి చెంబునీళ్ళు పడగానే ఆ పెద్దమనిషి గజగజ వణుకుతూ. "ఆహా! నమ్మకం కలిగింది!" అన్నాడు. దేవుడిమీదే ఈ నమ్మకం కలిగి ఉంటుందని వారు గబగబా మరికొన్ని చెంబులు నీళ్ళు పోసి, "ఏం నమ్మకం కలిగింది?" అని ఆత్రంగా అడిగారు "మీరందరూ కలిసి నన్ను చంపేద్దామనుకుంటున్నారనే నమ్మకం కలిగింది!" అని ఆ పెద్దమనిషి వణుకుతూ జవాబు చెప్పాడు.

* * *

"సాలుకు నూటికి ఆరు రూపాయల వడ్డీ చొప్పున వెయ్యికి నాలుగేళ్ళకు ఎంతవుతుంది?" అని ఒక లెక్క నిచ్చాడు మాష్టరుగారు. మూల కూర్చున్న మాణిక్యం తప్ప అందరూ గబగబ చెయ్యడం మొదలు పెట్టారు. ఊరికే ఎందుకు కూర్చున్నావని మాష్టరుగారు గదమాయించగా. "వెధవ వెయ్యి నాకొక లెక్కా?" అని నసిగాడు మాణిక్యం.

## బహుమతి పొందిన కార్టూన్



'మాస్టారూ! బడి వదిలేశారు!'

చిత్రకారుడు— ఎమ్. వెంకటేశ్వరశాస్త్రి (కాకినాడ)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7. Thambi Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad



ఆవేదన

చిత్రకారుడు—శ్రీ కె. రాజయ్య (సిద్దిపేట)